ఉషా కిరణ్ మూవీస్



# మయూరి

దర్శకత్వం
సింగీతం శ్రీనివాసరావు

నిర్మాత
రామోజీరావు

నిర్వహణ: అట్లూరి రామారావు

# వాస్తవ చిత్రణ-స్వయం పాత్రపోషణ..

# 'మయూరి'

అనగనగా ఒక సుధ. ఆ అమ్మాయి జీవితం ఒక తీపి చేదుల కథ ... అదే 'మయూరి' చిత్రగాథ. సాధారణంగా ఒక రచయిత రూపొందించిన కథకు చిలువలు పలువలు అల్లి దాన్ని తెరానువాదంచేయడం ఆనవాయితీ.అదిమామూలు సినిమాల విషయం. మరి 'మయూరి' విషయం ఏమిటి...? ఇది జీవితంలో ఒక పాత్రలో నటించి జీవించడంలోను ఒక ప్రత్యేక ప్రయోగం దాగివుంది. ఇది చలనచిత్రసీమకే కొత్తమలుపు సృష్టిస్తుంది. అది మనందరి నమ్మకం!! మన నమ్మకం రుజువైనప్పుడు ప్రతిహృదయం లోనూ వినిపిస్తుంది సిరిమువ్వల చిరుసవ్వడి.

ఈ మువ్వల సవ్వడిలో ధ్వనించే శబ్ద తరంగాలను మీలో స్పందింపజేయాలన్న



ఆడపిల్లకు జరిగిన వాస్తవ సంఘటన. అదే 'మయూరి' చిత్రానికి ఇతివృత్తం... జీవితాన్ని చిన్నప్పుడు అమ్మమ్మ చెప్పిన కథలా ఊహించుకున్న ఓ పిల్లకు అనుకోని అవాంతరం ఎదురైతే...? పూలపానుపులాంటి భవిష్యత్తు అంపశయ్యలా మారిపోతుంది... అవునా? కొందరు పాత్రను నటించి జీవిస్తారు. కొందరు జీవితంలో నటిస్తారు. కాని మయూరి(సుధ)అలాకాదు..తనస్వీయానుభవాన్ని స్వయంగా నటించి మీ ముందుంచబోతోంది. ఈవిధంగా తన జీవితాన్ని తానే నటించడంలోను, సహజ ప్రయత్నంతో కొన్ని పాత్రలను పరిచయం చేయడం భావ్యం అనిపిస్తోంది ....

అదుగో! మాటల్లోనే కాలి అందెలు సవరించుకుంటూ నడచి వస్తోంది 'మయూరి'. 'మయూరి'కి చిన్నతనం నుంచీ నాట్యం అంటే ప్రాణం. దానికి కారణం 'మయూరి'ని కన్నతల్లి నర్తకి కావడమే! 'మయూరి' తండ్రి లాయరు వెంకటేశ్వర్లుగారు. ఆయనకో తల్లి, ఒక రెండో భార్య వేదవల్లి వున్నారు.వేదవల్లికి మరో ఇద్దరు సంతానాన్ని ప్రసాదించారు వెంకటేశ్వర్లుగారు.

మయూరికి నటరాజస్వామి అనుగ్రహం మిన్నగా వుండటంవల్ల నృత్యం పట్ల ఆరాధనతప్ప మరో ధ్యాసలేదు. నిజానికి చదువుమీదకన్నా నాట్యంమీదే ఆ పిల్ల ఆలోచనలన్నీ కేంద్రీకృతమై వుంటాయి. 'మయూరి' అంటే సహనానికి, ఆత్మస్థైర్యానికి, నిగ్రహానికి, పట్టుదలకు, దీక్షకు, తపస్సుకు అర్థంగాచెప్పుకోవచ్చు. సవతితల్లి వేదవల్లి అడుగడుగునా అడ్డంకులు చెప్తున్నా, చీదరించుకుంటున్నా అన్నిటినీ ఓర్పుతో భరిస్తూ తన అడిగితే – "ఈ ఇంట్లో నృత్యం అచ్చిరాదు. దానివల్ల ఈ ఇంటికి అరిష్టం కలుగుతుంది" అన్నదే ఆమె ఇచ్చే సమాధానం. మయూరి తల్లి నృత్య ప్రదర్శనలివ్వడంవల్ల ఆ ఇంట్లో అనేక నష్టాలు జరగడమేకాక ఆమె ప్రాణానికే హాని కలిగిందట! అంచేత సవతి తల్లికి నృత్యం పేరెత్తితేనే పట్టలేని కోపం కట్టలు తెంచుకొస్తుంది. మయూరిపట్లవున్న ఆప్యాయత కన్నా అసహ్యభావనే ఆమె మాటల్లో తొంగిచూస్తుంది. అయినా మయూరి



పట్టుదలను పట్టు సడలిపోకుండా కాపాడుకుంటూ నర్తకిగా శిఖరాగ్రాలు చేరుకున్న మహోన్నతాశయమూర్తి మయూరి. ఇది కేవలం ఆమె పాత్రను సంక్షిప్తీకరించడం మాత్రమే సుమీ!

ఒకసారి సవతితల్లి వేదవల్లిని కదల్చి చూద్దాం. వేదవల్లి రెండో భార్య కావడం వల్ల వెంకటేశ్వర్లుగారిని తన మాట జవదాటకుండా చేసుకోగలిగింది. మయూరిని నృత్యంచేయడానికి వీల్లేదని, ఆ మాట కొస్తే ఆ ఇంట్లో నాట్యం పేరు కూడా ధ్వనించడానికి వీల్లేదని ఆంక్షలుపెట్టిన ఆడకూతురు వేదవల్లి. దీనికి కారణం తన ధ్యేయాన్ని, ఆశయాన్ని విస్మరించలేదు.

ఈ తల్లీకూతుళ్ళ మధ్య ఇరుక్కుపోయి అటు భార్యనూ, ఇటు కూతుర్నీ కాదనలేని వెంకటేశ్వర్లుగారి తత్వం గురించి ఆలోచిద్దాం.

వెంకటేశ్వర్లుగారు లాయరు. నిదానస్తుడు. ఉత్తముడు. ఒక్కమాటలో చెప్పాలంటే ఆ ఇంట్లో జరిగేవన్నీ మౌనంగా గమనించే మాటరాని ఫ్యాన్‌లాగానో, గదినిండా ఆవరించిన గాలిలాగానో, అలంకరణకు తప్ప ఎందుకూ పనికిరాని

'సెట్ ప్రోపర్టీ' లాగానో ఉండిపోయే వ్యక్తి అని చెప్పుకోవచ్చు. అన్నింటికీ మించి మతిమరుపు తనానికి మరో పేరు లాయరు వెంకటేశ్వర్లు. ఇలాంటి వెంక



దేశ్వర్లుగారికో తల్లి ఉంది. నిజానికి 50 ఏళ్ళ వెనుక పుట్టింది కాని తర్వాత పుట్టాల్సిన వ్యక్తి. ఆవిడకున్న లోకజ్ఞానం' కాలజ్ఞానం ఏ ప్రశ్నకైనా తడుముకోకుండా సమాధానం చెప్పిస్తాయి. ఆ ఇంట్లో అణువణువుకి, ఆబాలగోపాలానికిబామ్మగారంటే అంత ఇష్టం. తిథి, వార, నక్షత్రాలకు కొత్త భాష్యం చెప్పగల దిట్ట. పురాతన



ఆచారవ్యవహారాలకు, మూఢనమ్మకాలకు స్వస్తిచెప్పి, పాతకొత్తల మేలుకలయికతో అందర్నీ నమ్మించి అనుకున్న మార్పు తేవడానికి ఆమె నాందీవచనం పలుకు తుంది. భూత, భవిష్యత్, వర్తమానాలను ఒకే తాటిపై నడపగల సమర్థవంతురాలు ఈ బామ్మగారు. ఈ బామ్మగారి పాత్ర పోషణ ఒక వింత తరహాలో వుంటుంది. ఈనాటి బామ్మలందరికీ తలమానికంగా నిలచే ఈ బామ్మగారు 'మయూరి'లో మయూరితో మనకు దర్శనమిస్తుంది. ఈ బామ్మను మీ బామ్మతో పోల్చి చూసు కోండి! వ్యత్యాసం మీకే తెలుస్తుంది!!

ఈ పాత్రలన్నీ ఇలావుంటే ఆ ఇంటి వంటవాడి పాత్ర మరోలా వుంటుంది. చిరకాలంగా ఆ ఇంట్లో వంటవాడిగా వుంటూ అందరి అభిరుచులను మేళవించి వండివడ్డిస్తూ వుంటాడు సుబ్బరాజు. కాకర కాయ కూరనుంచి కథాకళిదాకా చేసి చూపించగలడు, పాలకూర పప్పునుంచి భరతనాట్యందాకా రుచులందిస్తాడు సుబ్బరాజు. సుబ్బరాజు ఆఇంట్లో అందరికీ ఆప్తుడే. ముఖ్యంగా తల్లిలేని పిల్లమయూరి అంటే మరీ మరీ ఇష్టం రాజుకి. స్వయంగా ఎత్తుకుని పెంచిన ప్రేమకు తార్కాణం అది. ఇన్ని పాత్రలు పరిచయం చేశాక మరో విచిత్రపాత్ర మిగిలివుంది. ఆ పాత్రను పరిచయం చేసుకోకపోతే తప్పుచేసిన వారమే అవుతాం. అందుకే అతని దగ్గరకు వద్దాం. అతని పేరు మోహన్. మోహన్, మయూరి కాలేజ్‌మేట్స్. మోహన్ తల్లి వాణీబాల. శ్రీవాణీ నృత్యవిద్యాలయం ప్రిన్సిపాల్ ఆమె. సమయానుకూలం మాటలు, చేతలు మార్చగల సమర్థుడు మోహన్. మయూరిని తన తల్లి నడుపు తున్న నృత్యవిద్యాలయంలో చేర్పిస్తాడు. నృత్యప్రదర్శనలిచ్చి మరో ఊరునుంచి వస్తున్న మయూరికి ప్రమాదం జరగడం, ఆమె కాలు పోగొట్టుకోవడం జరిగింది. అప్పుడు మోహన్ ఏం చేశాడు?... ఆమె గురించి పట్టించుకోకుండా, కనీసం వెళ్ళి చూడకుండా, మాటవరుసకైనా మాట్లాడ కుండా మొఖం చాటేసి ఆమెను దూరంచేసి మరో వయ్యారిని వల్లోవేసుకున్నాడు. ఈ కృత్రిమ ప్రేమికుణ్ణి ఉషాకిరణ్ మూవీస్ 'మయూరి' చూపిస్తుంది. పసందైన పదహా రేళ్ళ ప్రాయంలో ఉన్న పడుచు పిల్లలూ, ఇలాంటి మోహన్‌లు ఎదురౌతారు.

జాగ్రత్త సుమీ....జాగ్రత్త!!

పసి వయసులోనే నృత్య కళపట్ల ఆరాధ నతో పసిడికలలుకని, ఎన్ని అభ్యంతరాలు



ఆటంకాలు ఎదురైనా ఎదుర్కొని ఎట్టకేలకు అభ్యసించి పదిమంది ప్రశంసలూ అందుకుంటున్న సమయంలో ప్రమాదానికి గురై కాలు పోగొట్టుకుంది మయూరి. ప్రేమించానని ప్రగల్భాలు పలికిన మోహన్ దూరమైపోయాడు అన్న బాధ గుండెల్ని దహించివేస్తున్నా పట్టుదలతో, గుండె నిబ్బరంతో, ధైర్యంతో, దీక్షతో సమస్యలను ఎదుర్కొని కృత్రిమమైన కాలుని అమరించుకుని తిరిగి దుర్భరమైన యాతనపడుతూ కూడా నృత్యం చేస్తూ నర్తకిగా పేరు ప్రఖ్యాతులు ఆర్జించుకుంటున్న ఒక సుధ కథ ఇది. ఆమె పాత్రను ఆమె స్వయంగా పోషించడం కనీ వినీ ఎరుగని విచిత్రం! చలనచిత్ర రంగంలోనే ఇది వినూత్న ప్రయోగం!

చిత్రమీజీవితం !
జీవితమీచిత్రం !!

మయూరి వయారాలకు చిత్రానువాదం చేసిన దర్శకుడు: సింగీతం శ్రీనివాసరావు

మయూరికి మాటలు గరపిన రచయిత :
గణేష్‌పాత్రో

మాటలను పాటలుగా మలచిన కవి :
వేటూరి సుందరరామమూర్తి

మయూరి అందెలకు స్వరాల విందు లందించిన స్వరకర్త :
యస్. పి. బాలసుబ్రహ్మణ్యం

మయూరికే నడకలు నేర్పిన నేర్పరి: శేషు

మయూరి గళానికి శ్రావ్యతనందించిన మధుర గళాలు :
యస్. జానకి, యస్.పి. శైలజ, బాలు

కెమేరా : హరి అనుమోలు
కళ : భాస్కరరాజు
కూర్పు : గౌతంరాజు

మిగిలిన నటీనటులు :
సుభాకర్, పి. యల్. నారాయణ, నిర్మల, వై. విజయ, పి.ఆర్. వరలక్ష్మి, కాకినాడ శ్యామల, శ్రీశైలజ, సుమిత్ర, బేబి వరలక్ష్మి, ఇందిర, జయశీల, యస్.ఆర్.రాజు, కె.కె.శర్మ, పొట్టి ప్రసాద్, మాష్టర్, చక్రవర్తి.

నిర్మాణ, నిర్వహణ: అట్లూరి రామారావు
నిర్మాత : రామోజీరావు
విడుదల: మయూరి










# చతుర

మార్చి : 1985 సంపుటి : 8 సంచిక : 2

## ఈ నెల సమగ్ర నవల

ఆమె...
'ప్రాణం పోసుకున్న వీనస్!' అన్నారు కొందరు.
'పునర్జన్మ ఎత్తిన క్లియోపాత్రా!' అనుకున్నారు ఇంకొందరు.
"కాదు...
కవుల వర్ణనలోని కావ్యనాయికలకు సజీవరూపమే ఈమె" అనేశారు మరికొందరు.
ఆమె...
మరెవరో కాదు.
ఈ కథకు నాయిక!
తన సౌందర్యంపై వ్యామోహంతో, "నిన్ను పెళ్లి చేసుకుంటా"నన్న యువకుడిని తృణీకరించింది.
తనపై మనసుపడి, "మనం పెళ్లి చేసుకుందా"మన్న వ్యక్తిని తిరస్కరించింది.
అలాంటి ఆ సౌందర్యరాశి మనోప్రాంగణంలోకి ఓ యువకుడికి ప్రవేశం లభించింది.
అతని సాహచర్యంలో వెన్నెలవెల్లువగా మారిన ఆమె జీవితంలో ఓ వ్యక్తి చేసిన ప్రయత్నంతో

# తుషార తిమిరం

ఎలా అలుముకుంది?
దాని పర్యవసానం ఏమిటి?
ఆ చీకటిని కొనసాగించిన పరిస్థితులేమిటి?
ఆ పరిస్థితుల్లో...అతనికి దూరమయేందుకు ఆమె ఏ నిర్ణయం తీసుకుంది? ఆమెకు చేరువయేందుకు అతను చేసిన ప్రయత్నాలేమిటి?

## జోస్త్ర శ్రీకృష్ణ వరప్రసాద్

లేఖిని నుంచి చిక్కని కథనంతో అలవోకగా జాలువారిన ప్రేమరూపి 'తుషార తిమిరం' ఈ నెల చతుర సమగ్ర నవల!

ముఖచిత్రం : ఎన్. శివన్నారాయణ

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' అహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-,అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించ వలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షం లోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

## ఆకాశంలో వెలిగేది ధ్రువతార
## సినీ జగతిలో వెలిగేది సితార

- ఆబాలగోపాలాన్ని 'హలో' అంటూ పలకరిస్తుంది సితార
- మీరు అభిమానించేది ఏ తారనైనా సరే– మీకు కావల్సింది సితార
- మల్టీకలర్ ముఖచిత్రమే కాదు, అనేక రంగుల సెంటర్ స్ప్రెడ్‌తో మిమ్మల్ని మురిపించి, మైమరపిస్తుంది సితార
- సినిమాకు సంబంధించిన అన్నిరకాల వార్తలకు, వ్యాఖ్యలకు, కబుర్లకు, విమర్శలకు పెట్టింది పేరు సితార

# సితార

సమగ్ర సినీవార పత్రిక

ఈనాడు కాంపౌండ్, సోమాజిగుడా

హైదరాబాద్ - 500 004

# చమర

## ఇంద్రజాల బాల

ఆ చిన్నపాప స్పృశిస్తే చాలు– పువ్వులు రంగుల్ని మార్చేసుకుంటాయి! పసుపు పచ్చటి గులాబీ ఎరుపు రంగులోకి, ఎర్ర గులాబీ ఆకుపచ్చ రంగులోకి మారిపోతుంది. ఈ మాయ అంతా ఆ పాపలోని మహత్తు కాదు. సౌమ్య అనే ఆ పాప నేర్చుకున్న ఇంద్రజాల మహిమ!

3ఏళ్లప్పుడే ఇంద్రజాల విద్యనభ్యసించడం మొదలుపెట్టిన సౌమ్య వయసు ఇప్పుడు 5 ఏళ్లు. ఇంత తక్కువ వయసులోనే ఆమె అంతర్జాతీయ ఖ్యాతిని సైతం ఆర్జించింది.

సౌమ్య స్వగ్రామం కేరళకు చెందిన త్రిచూరుకి దగ్గిరలోని 'ఇరింజాల్ గూడా'. ఆమె అక్కడే 'లిటిల్ ఫ్లవర్ కాన్వెంట్'లో చదువుతోంది. సౌమ్యకు ఇంద్రజాల విద్యను నేర్పింది ప్రముఖ ఇంద్రజాలికుడైన ఆమె తండ్రి షిబాద్!

"ఎక్కడినుంచో ఓ అస్థిపంజరం ప్రదర్శన జరిగే వేదికపైకి వస్తుంది. అక్కడ కాసేపుగంతులేసి ఎలావచ్చిందో అలా మాయమైపోతుంది. సౌమ్య తన లేలేత చేతులతో కొవ్వొత్తి మంటను తాకుతుంది. గమ్మత్తుగా ఆమె తాకగానే మండుతున్న కొవ్వొత్తి పువ్వుగా మారి ఆమెచేతుల్లోవుంటుంది." ఇవి సౌమ్యచేసే ఇంద్రజాల ప్రదర్శనలో ప్రేక్షకుల్ని అధికంగా ఆకర్షించే అంశాలు! పువ్వులంటే ఎంతో ఇష్టంగల సౌమ్య ఎక్కువగా పువ్వులకు సంబంధించిన ఇంద్రజాలాలే చేస్తుంది.

కేరళ, తమిళనాడు, కర్నాటక రాష్ట్రాలలో ప్రదర్శనలిచ్చి ప్రజలమెప్పు పొందిన సౌమ్య ఇప్పుడు అమెరికా కూడా వెళ్లబోతోంది. త్వరలో అక్కడ





ప్రపంచ ఇంద్రజాలికుల అంతర్జాతీయ సమావేశం జరగబోతోంది. అమెరికాలో ఇంద్రజాల ప్రదర్శన ఇచ్చేందుకు సౌమ్యకి అంతర్జాతీయ ఇంద్రజాలికుల

# ప్రపంచం

సంఘం నుంచి ఆహ్వానం వచ్చింది. అంతేగాక ప్రతిష్ఠాకరమైన ఆ సంఘంలో సౌమ్యకు సభ్యత్వం కూడా లభించింది.

అనేక అమెరికన్ టెలివిజన్ కంపెనీలు సౌమ్యను తమ ప్రోగ్రాముల్లో చూపేందుకు ఉత్సుకతను ప్రదర్శిస్తూ, రికార్డింగ్ కోసం తమ ఉద్యోగుల్ని మన దేశానికి పంపుతున్నాయి!

## మవ్‌తాయ్

'మవ్‌తాయ్'అనేది చైనీయులకి అత్యంత ప్రియమైన పానీయం. శక్తిదాయకమైన ఆ పానీయాన్ని ఇష్టపడనివారే చైనాలో వుండరు. దానిని 'ద్రవాల్లో డైనమైట్ లాంటిది' అని మెచ్చుకుంటారు.

చైనా ప్రభుత్వ విందుల్లో 'మవ్‌తాయ్' తప్పనిసరిగా వుండే అయిటమ్! అనేక మంది పాశ్చాత్యుల హృదయాల్ని సైతం దోచుకున్న ఈ పానీయం కొండల మధ్యలో వున్న 'కుశవ్' అనే చిన్న జిల్లాలో తయారవుతుంది.

ఈ పానీయాన్ని ఎలా తయారు చేసేదీ విదేశీయులెవరికీ తెలియకుండా రహస్యంగా వుంచబడింది. 'మవ్‌తాయ్' లాంటి పానీయాన్ని తయారుచేయాలని విదేశీయులు ఎన్నో ప్రయత్నాలుచేశారు గాని అవి ఫలించలేదు.

సాధారణంగా చైనీయులు తమ ఇళ్లకు వచ్చిన అతిథులకి టీ ఇస్తారు. కాని, 'మవ్‌తాయ్'ని తయారుచేసే గ్రామంలో అతిథులకి స్వాగతం చెప్పే తీరు వేరుగా వుంటుంది.

ఇంటికొచ్చినవారికి ఓ పద్ధతి ప్రకారం మూడుకప్పుల 'మవ్‌తాయ్' ఇస్తారు. ప్రతి కప్పూ తాగిన తర్వాత అతిథి కప్పును బోర్లించి పెట్టాలి. అలా చేస్తే అతిథి 'మవ్‌తాయ్'ని ఒక చుక్క





కూడా వృధాకాకుండా తాగినట్టు! మూడో కప్పు పూర్తయ్యాక కూడా అతిథి కప్పును బోర్లిస్తే, అతను మరో మూడుకప్పులు తాగేందుకు సిద్ధంగా వున్నాడని అర్థం.

కాని, మవ్‌తాయ్‌ని మూడు కప్పులకి మించి తాగినవారెవరూ మామూలుగా వుండలేరు. అది ఎక్కువగా తాగితే మైకం కమ్మి ఒళ్లు తెలియకుండా పడిపోవడం ఖాయం.

200 ఏళ్లక్రితం 'మవ్‌తాయ్' పానీయాన్ని తయారుచేయడం చిన్న కుటీర పరిశ్రమగా ప్రారంభమైంది. ఇప్పుడు దాని తయారీయే ఉద్యోగంగా 10 వేల మంది పైనే జీవిస్తున్నారు.

## మతిలేని సేకరణ

న్యూయార్క్‌కి చెందిన లూయిసా కారినెల్వా అనే మహిళ సేకరించిన వస్తువుల గురించి వింటే, ఆమె పిచ్చిదేమో నన్పిస్తుంది. ప్రమాదాల్లో గాని, హత్య చేయబడి గాని మరణించినవారికి సంబంధించిన వస్తువులను సేకరించడం ఆమె కలవాటు. ఆమె ప్రథమంగా ఓ ఉరి తాడుని సేకరించింది. అది ఇద్దరిని ఉరి తీసిన తాడు. దాన్ని లక్ష రూపాయలకి కొనుక్కుని అట్టే పెట్టుకుంది లూయిసా!

తర్వాత ఆమె స్నానం చేసే టబ్‌ని కొన్నది. దాని ప్రత్యేకత ఏమంటే ఓ యువతి ఆ తొట్టెలో స్నానం చేస్తుండగా ఎలక్ట్రిక్ షాక్‌కి గురై చనిపోయింది.

లూయిసా ఎప్పుడూ అలాంటి వస్తువులను కొనే అన్వేషణలోనే వుంటుంది. ఆమె ప్రపంచంలోని పత్రికలు, వార్తాపత్రిక లెన్నింటికో చందాలు కడుతుంది. వాటిలో ఘోర ప్రమాదాలు, హత్యలు, మానభంగాలు లాంటివార్తల కోసం శ్రద్ధగా వెదికి, చదివినవాటి కింద మార్కు చేస్తుంది. వాటిలో తనను ఆకర్షించిన వార్తల పట్టిక తయారుచేసుకుని, అందులో తన సేకరణకు మరింత గొప్పతనాన్ని తెచ్చిపెట్టే వస్తువు లేమున్నాయో చూస్తుంది.

తర్వాత తనకు ప్రియమైన ఆ వస్తువుల కోసం వేట ప్రారంభిస్తుంది. అవి చాలా ఖరీదైనవైతే కొనేందుకు ఆమె మరింత ఆత్రపడుతుంది. ఒకసారామె ఓ హత్యలో ఉపయోగించబడిన చిన్న కత్తిని కొనడం కోసం కొన్ని వేల మైళ్లు విమానంలో ప్రయాణం చేసి వెళ్లింది.

చికాగోలో ఓ బాలుడు పెద్ద రిఫ్రిజిరేటర్‌లో దాక్కుని, తలుపు మూసుకోవడం వల్ల మృతి చెందాడు. లూయిసా ఆ ఫ్రిజ్‌ని 5,234 డాలర్లకు కొనుక్కుంది.

ఆమె ఇంట్లో పెరడు అంతా కూలిపోయిన విమాన భాగాలు, తొట్టెలు, ఎలక్ట్రిక్ బల్బులు, ఓవెన్లు, ఇస్త్రీ చేసే యంత్రాలు, ప్రెషర్ కుక్కర్లు, గాస్ స్టవ్‌లు, కాలిన అలమరాలు, బొమ్మలతో నిండి వుంటుంది. ఆమెకు సగం కాలిపోయిన ఇళ్లు కూడా రెండున్నాయి.

అరవయ్యేళ్ల లూయిసా ఈమధ్యనే చనిపోయింది. ఆమె వకీలు ఆమె సేకరించిన వస్తువులు 36 వేల వరకూ వున్నట్టు తెలిపాడు. లూయిసా అంత పిచ్చిగా తిరిగి పోగుజేసిన ఆ వస్తువులను కొనేందుకు ఎవరూ ముందుకు రాకపోవడంతో, వాటిని అలాగే వదిలేయడం జరిగింది!





# 'జాతీయ పొదుపు పథకం' మా అమ్మాయి పెళ్లి నాటికి ఈ వస్తువులన్నీ కొనడానికి సహకరించింది!

**6** సంవత్సరాల జాతీయపొదుపు సర్టిఫికెట్ ద్వారా రు.100/-లు రు 201.50 గా పెరుగుతుంది. రు.10/- 50/- 100/- 500/- 1000/- 5000/- వరకు సర్టిఫికెట్లు లభిస్తాయి. ఆదాయపు పన్ను మినహాయింపు కూడా పొందవచ్చు!

| | | | | |
|---|---|---|---|---|
| రాబడిపన్ను రాయతీ లలో పి.పి.ఎఫ్ పథకం-అందరూ చేరవచ్చు. | 10 సం॥ సి.టి.డి. వెలసరి ఆదాచేయండి పన్నులలో రాయతీలు | ఎస్.ఎస్.సి. 11 ఇస్యూ రాబడి పన్ను, సంపద పన్నులో రాయతీలు | పోస్టల్ సేవింగ్ బ్యాంక్ అకౌంట్ రు.200తో 5.5 శాతము వడ్డి+సంవత్స రానికి రెండుసార్లు తీసే డ్రాలో ఆకర్షణీయమైన బహుమతులు | ఎస్.ఎస్.సి. VI ఇస్యూ 6 సం.లు మీ డబ్బు రెండింత లకు పైగా పెరుగుతుంది. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇస్యూ ప్రతి 6 వెలలకు ఆదాయం 12-00 శాతం వడ్డి | 11.0 శాతం వడ్డి మరియు ప్రణాళికా రక్షణ | 5 సంవత్సరముల టైమ్ డిపాజిట్ 11.5 శాతం వడ్డి | 3 సం॥ల టైమ్ డిపా జిట్ సం॥కు 10.5 శాతము వడ్డి | 2 సం. టైమ్ డిపాజిట్ సం॥కు 9.75 శాతము వడ్డి | ఏడాది టైమ్ డిపాజిట్ సం॥కు 9 శాతము వడ్డి |

అంతేకాదు మీరు మెచ్చే, మీకు నచ్చే మరెన్నో పొదుపు పథకాలు!
ఇన్‌కంటాక్స్ మినహాయింపుతో.

వివరాలకు:



కమీషనర్, **స్మాల్ సేవింగ్స్**, హిమాయత్ నగర్, హైదరాబాద్. ఫోన్స్: 224410 222886

లేదా

మీ దగ్గరిలోని పోస్టాఫీసులోగాని, జిల్లాకలెక్టర్ కార్యాలయంలోగాని సంప్రదించండి!

# అయ్యర్ కేంటీన్

నారాయణ అయ్యర్ ఢిల్లీలోని యు.యన్.ఐ. వార్తా సంస్థ ఆవరణలోని కేంటీన్ యజమాని. 8వ తరగతి వరకే చదివిన అతను 1954లో వంటపనిలో సహాయకుడిగా పనిచేసే పనికోసం ఢిల్లీ చేరాడు. కుటుంబం విపరీతమైన ఆర్థిక ఇబ్బందుల్లో చిక్కుకుని వుండటంతో ఆ విధంగా వలసపోక తప్పలేదు. అప్పట్లో అతనికి, వంటలో చిన్నచిన్న పనులు చేసి సాయపడినందుకు పది రూపాయలు లభించేవి.

ఓ పెళ్ళివిందుకై వంట చేసేందుకు వెళ్ళినపుడు నారాయణ అయ్యర్‌కి ప్రముఖ పత్రికా రచయిత కులదీప్ నయ్యర్ కలిశారు. అపుడు కులదీప్ నయ్యర్ యు.యన్.ఐకి జెనరల్ మేనేజర్. అతను వంటపనిలో నారాయణ అయ్యర్ కార్యదక్షత, నైపుణ్యాలను చూసి, అతనికి యు.యన్.ఐ. కేంటీన్ నిర్వహించే వుద్యోగమిచ్చాడు.

కేంటీన్ కాంట్రాక్ట్ కోసం మరో ఉత్తర భారతీయుడు ఎంతగానో ప్రయత్నించినా ఆ అవకాశాన్ని తనకే ఇచ్చినందుకు తనెంతో రుణపడివున్నాననీ, ఆ అవకాశమే తన జీవితాన్ని మంచి మలుపు తిప్పిందనీ అయ్యర్ అంటారు.

అయ్యర్ కేంటీన్ నిర్వహణను ఓ బాధ్యతలా స్వీకరించి ఉదయం 6గంటల నుంచి రాత్రి 9 గంటలవరకూ విరామం లేకుండా కష్టపడేవాడు. అతని శ్రమకు మంచి ఫలితమే దక్కింది. ఇపుడు ఢిల్లీలో అతనికి అన్ని సౌకర్యాలుగల అధునాతనమైన ఫ్లాట్ వుంది. అతని కేంటీన్‌లో 18 మంది వంటవాళ్ళు పని చేస్తున్నారు.

అయ్యర్ తన కేంటీన్ దగ్గిర కిళ్ళీ దుకాణం పెట్టుకునేందుకు మణి అనే



ఉన్నతమైన నాణ్యత ప్రియలోనే వుంది



priya

ఎన్నిక చేసిన దినుసులన్నీ సమపాళ్లలో
మేళవించి అద్భుతమైన రుచులతో
రూపొందించినవే ప్రియ పచ్చళ్ళు.
మీ భోజనానికి సంతృప్తి సరిజోడు-ప్రియ
ఈనాడే మీ ప్రియను మీ ఇంటికి తీసుకువెళ్ళండి.

ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI MARKETI
PRIVATE LIMITED

ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ

Kiron/PF/831

తమిళుడికి అనుమతి ఇచ్చాడు. అయితే ఆ దుకాణంలో బీడీ, సిగరెట్టులాంటివి అమ్మగూడదని షరతు పెట్టాడు.

అయ్యర్ బహుభాషావేత్త. ఇంటివద్ద మాతృభాష తమిళం మాట్లాడే అతను తెలుగు, మలయాళం, కన్నడం, హిందీ, పంజాబీ భాషల్లోనూ అనర్గళంగా మాట్లాడ గలడు. చాలామంది తమిళ ప్రముఖులు తరచుగా అతని కేంటీన్ వద్ద కలుసు కుంటూంటారు.

మంచి హాస్యప్రియుడైన అయ్యర్ కాఫీ డికాక్షన్‌కు తమాషాగా 'కషాయం' అనీ, ఇండ్లీలోకి వేసే పచ్చడికి 'ఈస్ట్‌మన్ కలర్ చట్నీ' అనీ పేర్లుపెట్టాడు. అలాగే కేంటీన్‌లోని భోజనశాలను 'అవుట్ పేషంట్ డిపార్ట్‌మెంట్' అంటాడు. ఆ కేంటీన్‌లో 'శాంతినికేతన్ భోజనం' కూడా దొరుకుతుంది. యు.యన్.ఐ. ఆవరణలోని, ఆహ్లాదకరమైన మామిడి చెట్ల నీడలో వడ్డించే భోజనాన్నే 'శాంతి నికేతన్ భోజనం' అంటాడతను. ఫైవ్‌స్టార్ హోటళ్ళలోని విలాసాల్ని అను భవించేవారూ, ప్రభుత్వ ఉన్నతోద్యోగులు, ప్రముఖ వ్యాపారవేత్తలు సైతం అయ్యర్ 'శాంతినికేతన్ భోజనం' కోసం వస్తారు. అక్కడి ధరలు కూడా సరసంగా అందరికీ అందుబాటులో వుంటాయి. చాలామంది అక్కడ శుభ్రంగా తిని, చెట్ల నీడల్లో హాయిగా నిద్రించడం ద్వారా గొప్ప ఆనందాన్ని అనుభవిస్తున్నామంటారు.

ఇపుడు అయ్యర్ సంపన్నవర్గంలో చేరినా, నిరాడంబరంగా జీవించడమే అతనికిష్టం. ఇప్పటికీ కేంటీన్‌కి వెళ్ళిన వారికి బనీను, లుంగీల్లోనే దర్శనమిస్తాడు ఆయన.

## జైలు పెళ్ళిళ్లు

జైలు జీవితం వైవాహిక బంధాలకు ఆటంకం కాగూడదనేమో అమెరికాలో జైళ్లలో వుండే ఖైదీలుకూడా పెద్దపెట్టున పెళ్లిళ్లు చేసుకుంటున్నారు.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని 'సేన్ క్వెన్‌టిన్' జైలులో జైలు గోడల మధ్యనే అనేక పెళ్లిళ్లు జరిగాయి. కొందరు ఖైదీలు తాము జైల్లో పడకముందు ప్రేమించిన యువతుల్నే ఆ విధంగా పెళ్లిచేసుకున్నారు. కొందరైతే ఇతర ఖైదీలను కలిసేందుకొచ్చిన యువతులతో ప్రేమలోపడి వారితో పెళ్లిళ్లు జరుపుకున్నారు. మరి అనేకమంది కలం స్నేహం ప్రారంభించి ఆ స్నేహాన్ని పెళ్లితో ముగించడంకూడా జరుగుతోంది.

30 ఏళ్ల సలాస్ విన్సెంట్‌కి ఓ హత్యా నేరంపై 20ఏళ్లపాటుకారాగారశిక్షవిధించ బడింది. అతను జైల్లో మూడేళ్ల క్రితం 'జూలియా క్రిస్టీ'ని పెళ్లాడాడు. 4 నెలల కోసారి 2 రోజులపాటు ఆ దంపతులు స్వేచ్ఛగావుండి, శృంగారం జరుపుకోవ డానికి అనుమతిస్తారు. వారి దగ్గిర ఏమైనా ఆయుధాలున్నాయేమోనని జాగ్రత్తగా తనిఖీచేసి వారిని ఓ గదిలోకి పంపుతారు.

24 ఏళ్ల 'వాల్టర్ పిస్తోవ్'కి 'క్రిస్టిన్ అరోనా' కలం స్నేహితురాలు. అది ప్రేమగా మారి 1981 నవంబరు 23న వారికి జైల్లో పెళ్ళి జరిగింది. ఆరోజున జైలుమొత్తం ఏదో ఉత్సవం చేసుకుంటున్నట్టే కళకళ్లాడింది. ఆ వివాహానికి హాజరైన వారందరినీ అమూలాగ్రం తనిఖీచేసి గాని జైలు లోపలికి అనుమతించలేదు అధికారులు.

—o—

ఆ గదిలోకి వెళ్ళేందుకని పరదాపై చెయివేసి పక్కకు తప్పించబోయిన ఆమె, అంతలోనే ఆగిపోయి గుమ్మం బైటనే నిలుచుండిపోయింది.

గదిలోంచి సితార్ సంగీతం వినవస్తోంది.

రవిశంకర్ సితార్‌పై మీటిన కల్యాణ రాగం!

తనకెంతో ఇష్టమైన రాగం! తనకు ప్రియమైన సితార్ పై...!

నిశ్శబ్దంలోకి ప్రవహిస్తూ చెవులకు సోకుతున్న ఆ సంగీతం పరిసరాలను మైమరపింపజేస్తున్నది!

ప్రఫుల్ల ఎప్పుడూ ఇలాంటి సంగీతం వినదే!

ఆమెకు ఈ సంగీతం నచ్చదు!

ఆమె అభిరుచులు వేరు!

అవి తనకు పూర్తిగా విరుద్ధంగా వుంటాయి.

ఫాస్ట్ బీట్స్, గిటార్ ధ్వనులతో నిండిన మ్యూజిక్ అంటే ప్రఫుల్లకు చాలా ఇష్టం!

ఆమె గదిలోని టేప్‌రికార్డర్‌లో వెస్ట్రన్ మ్యూజిక్, డిస్కో మ్యూజిక్ కాసెట్స్ తిరుగుతూ వుంటాయి సదా!

సినిమాలు కూడా అంతే!

లారెల్ హార్డీలు, ఛార్లీ చాప్లిన్‌ల హాస్య చిత్రాలూ...

థ్రిల్లింగ్‌గా వుండే జేమ్స్‌బాండ్ పిక్చర్లూ...

హిచ్‌కాక్ లైపు సస్పెన్సు చిత్రాలతో పాటు....

హారర్ సినిమాలు కూడా పిచ్చిగా చూస్తుంది.

పుస్తకాల విషయంలో కూడా ఆదే అలవాటు.

ఎక్కువగా ఛేజ్, ఆర్థర్ హెయిలీ వంటి రచయితలవే చదువుతుంది.

ఇలా ఆమె ఇష్టాలన్నీ తను ఇష్టపడేవాటికి భిన్నంగా, పాశ్చాత్య ధోరణి వైపు మొగ్గు చూపేవే!

అయినా తమ మధ్య స్నేహం—అదీ ప్రాణస్నేహంగా పెరిగిపోవటం తనకు ఒక్కొక్కప్పుడు విచిత్రంగా అన్పిస్తుంది.

తను ఎప్పుడైనా రవిశంకర్ సితార్ వింటానంటే ప్రఫుల్ల ఒప్పుకోదు!

అసలు భారతీయ సంగీతమంటేనే ఆమెకు చుక్కెదురు!

"ఏముంటుంది, నీరసంగా! బోర్! వెస్ట్రన్ మ్యూజిక్ అయితే చూడు, ఎంత ఉత్సాహ ప్రేరితంగా పట్టి వూపేస్తుందో" అంటుంది.

అలాంటిది ఇప్పుడు...

ప్రఫుల్ల గదిలో ఈ సంగీతం...

ఆమె తనకు తెలియకుండా ఎప్పుడు మారిందబ్బా...!

ఆమెకు ప్రఫుల్లను ఆటపట్టించాలన్పించింది.

గుమ్మానికున్న పరదాను తప్పించి లోపలికి నడుస్తూనే...

"ఏమిటి ప్రఫూ! హఠాత్తుగా నీకీ విదేశీ సంగీత సన్యాసం..." అని అల్లరిగా అంటున్న ఆమె మాట మధ్యలోనే, అసంపూర్తిగా ఆగిపోయింది.

గదిలోని సోఫాలో ఉన్నది ప్రఫుల్ల కాదు...మరెవరో నూతన వ్యక్తి!

పైగా అతను, యువకుడు!

సోఫాలో కాలుమీద కాలు వేసుకుని కూర్చుని మేగజైన్ పేజీలు తిప్పుతున్న అతను ఈ మాటతో వెనక్కి తిరిగి చూశాడు.




కనిపించిన ఆ యువతి అందం అతన్ని విభ్రమ పరచింది.

తనకు తెలిసిన కాంప్లిమెంట్స్ ఏవీ ఆమె అందం ముందు నిలవవు!

'రాశిపోసిన సౌందర్యం'లా ఉందీమె!

"ప్రఫుల్ల..."

గదిలో ఎవరున్నదీ చూసుకోకుండా తను లోపలికొచ్చిన తీరుకు సిగ్గుతో కుంచించుకుపోతున్న ఆమె అంతకంటే మాట్లాడలేకపోయింది.

"ప్రఫుల్ల కోసం వచ్చారా? టీ తెచ్చేందుకు కిందికెళ్ళింది! కూర్చోండి... ఇప్పుడే వచ్చేస్తుంది" మర్యాదగా చెప్పాడతను.

"లేదండీ! నేనిప్పుడే..."

"వస్తాను" అన్నమాటను మింగేసి తన అందమైన, విశాలమైన కళ్ళతో ఆ పదాన్ని వ్యక్తీకరించి గదిలోంచి వచ్చేసింది.

బైటకు రాగానే ఆమెకు ట్రే పట్టుకుని వస్తున్న ప్రఫుల్ల కనబడింది.

"హాయ్... వచ్చావా?"

ఆమె మామూలు పలకరింపు అదే!

"ప్రఫూ! నేను మళ్ళీ కలుస్తాను"

"అదేమిటీ?" ఆమె భృకుటి ముడి పడింది.

"గదిలో ఎవరో..."

"అదా నీ సందేహం?"

ప్రఫుల్ల చిరునవ్వుతో, "అతనెవరనుకుంటున్నావ్? మా అన్నయ్య శ్రీనివాస్! చెప్పానుకదా..ఢిల్లీలో ఎం.బి.ఎ.చేస్తున్నాడని. ఇప్పుడది పూర్తయిపోయి వచ్చేశాడు! పరిచయం చేస్తాను... పద" అంది.

"కాని, ప్రఫూ! నాకు..." ఆమె సందేహంగా ఏదో చెప్పబోయింది.

"అంతగా అర్జెంట్ పనివుంటే టీ తాగేసి వెళ్దువు గానీ... రా!" ఆజ్ఞాపిస్తూ పరదాను తప్పించుకుంటూ లోపలికి నడిచింది ప్రఫుల్ల.

ఆమెకు స్నేహితురాలిని అనుసరించక తప్పలేదు.

నెమ్మదిగా నడుస్తూ వచ్చి అతనికి ఎదురుగా సోఫాలో ప్రఫుల్ల పక్కనే కూర్చుంది.

"వాసూ" అంది ప్రఫుల్ల.

అతను మేగజైన్‌లోంచి తలతిప్పాడు

"శైలజ... నా డియరెస్ట్ ఫ్రెండ్!"

"శైలూ...మాఅన్నయ్య శ్రీనివాస్!"

ఒకరినొకరికి పరిచయం చేసింది.

శైలజ "నమస్తే" అంది చేతులు జోడించి.

అతను ప్రతినమస్కారం చేస్తూ-

"ఏం చేస్తున్నారు?" అనడిగాడు చిరునవ్వుతో.

"బియ్యే నాతోపాటే పూర్తి చేసింది. ఇప్పుడు ఖాళీయే" చెప్పింది ప్రఫుల్ల.

ఇంతలో సితార్ సంగీతం ఆగిపోయింది.

ప్రఫుల్ల లేచి టేప్ రికార్డర్‌లోంచి ఆ కాసెట్ తీసేసి వేరేది పెట్టింది.

ప్రఫుల్ల సోఫాలో కూర్చుంటూ "టిఫినేం లేదు!" అంటూ క్రీం బిస్కెట్ల ప్లేట్‌ని అతనివైపు చాచింది.

"తీసుకో!"

"అరె... ముందు అతిథికిచ్చి..." అన్నాడు శ్రీనివాస్, శైలజను చూస్తూ.

"అతిథా? నీకు మా స్నేహం తెలీదులే! శైలజ నాకు అతిథి కాదు. అంతకు మించిన స్నేహితురాలు" అంది ప్రఫుల్ల.

'అలానా?' అన్నట్టు చూశాడు శ్రీనివాస్.

"తీసుకో శైలజా" అంటూ ప్లేటును శైలజవైపు చాచింది.

ముగ్గురూ బిస్కెట్లు, టీ ముగించారు.

శైలజ ఖాళీ కప్పును టీపాయ్ మీద పెట్టగానే-

"ఇక వెళతావా శైలూ?" అంది ప్రఫుల్ల.

శ్రీనివాస్ ఆమెకేసి చిరుకోపంతో చూస్తూ "నీకు బొత్తిగా మర్యాద తెలీదేం ప్రఫూ? ఇంకా నీలో చిన్నతనం పోలేదు. అదేం అడగడం?" అన్నాడు.

ప్రఫుల్ల నవ్వేస్తూ, "నీవొచ్చావు కదా, గొప్ప మర్యాదస్తుడివి! ఇక అలాంటివన్నీ నీ దగ్గర నేర్చుకుంటానులే! నాకు మర్యాద తెలీకపోవడం కాదు; నీకే మా స్నేహం గురించి తెలీదు. ఇందాకే వెళ్ళిపోతానన్న దాన్ని నేనే ఆపాను తెలుసా? ఇప్పుడు వెళ్ళేందుకు మొహమాటపడుతుందని వెళ్ళమంటున్నాను, అంతే!" అంది

అతను మౌనం వహించాడు.

శైలజ సోఫాలోంచి లేచింది.

"వస్తానండీ!"

అతను నవ్వుతూ తల పంకించాడు.

"సీయూ!"

ప్రఫుల్ల ఆమెతోపాటు గుమ్మం వరకూ వచ్చింది.

అక్కడినుంచి వచ్చేస్తున్న శైలజకి, ప్రఫుల్ల పరిచయం చేసినప్పుడు ప్రతి నమస్కారం చేస్తున్నప్పటి శ్రీనివాస్ ముఖమే గుర్తొస్తోంది.

అంతకుముందు, తర్వాత సిగ్గు వల్ల తను అతని ముఖంలోకి సేపుగా చూడలేకపోయింది!

* * *

"ఆంటీ...మీకు ఫోన్ కాల్!"

ఎదురింటి ప్లీడరుగారి ఆఖరి అబ్బాయి వచ్చి చెప్పేటప్పటికి శైలజ వంటపనిలో వుంది.

"ఎవరినుంచి?'' అడగబోయినదల్లా ఆగిపోయింది.

ప్రఫుల్ల తప్పించి ఎవరు చేస్తారు గనుక!

"ఇప్పుడే వస్తాను బాబూ....పద'' చెప్పి పంపేసింది.

ఎందుకబ్బా ఫోన్ చేయడం? నిన్ననే కదా కల్సుకుంది? అంతలోనే ఏం అవసరం?-అనుకుంటూ స్టౌమీద గిన్నెలో ఉడుకుతున్న కూరని గరిటెతో ఒకసారి కలియబెట్టి వంటగదిలోనుంచి ముందు గదిలోకి వచ్చింది.

భాగ్యం మంచంమీద కాళ్లు జాపుకుని గోడకి చేర్లబడి కూర్చుని, ఆ నెల తేవలసిన పచారీ సరుకుల లిస్ట్ తయారు చేస్తోంది.

"ఫోన్ వచ్చిందట అక్కా!'' అంది శైలజ ఆమె దగ్గరికి వెళ్ళి నిలబడి.

ఏమాత్రం కాస్త బైటకు వెళ్ళే అవసరానికి కూడా ఆమెతో చెప్పి, అనుమతి తీసుకోనిదే వెళ్ళరాదు. అది ఆంక్షవంటి అలవాటు!

"ఎవరి నుంచో?"

భాగ్యం గొంతులో అదోకలాంటి ధ్వని. ఆమె కావాలనే శైలజతో మామూలుగా మాట్లాడదు.

"ఇంకెవరున్నారు? ప్రఫుల్ల అయి వుంటుంది''

రోషం తెచ్చుకోకుండా బదులు చెప్పింది శైలజ. భాగ్యం వైఖరి తెల్సి కూడా ప్రతి విషయానికీ ఫీలవటం వ్యర్థం అన్న నిర్ణయానికి ఆమె ఎప్పుడో వచ్చేసింది.

"సరే....వెళ్ళిరా"

"స్టౌ మీద కూర పెట్టాను. కాస్త చూస్తుంటావుగా" అంది శైలజ.

"ఊ" గుర్రుగా అని, "ఆ మాట్లాడే దేదో వేగం తెమల్చుకురా. నీవు మహా రాణిలా ఊరేగుతుంటే ఇక్కడ పనులు చేసేందుకు ఎవరూ లేరు" అంది భాగ్యం.

శైలజ మౌనంగా బైటకు నడిచింది.

ప్లీడరుగారి ఇంటి కాంపౌండ్‌వాల్‌కి వున్న గేటు తెరచుకుని లోపలికి వెళ్ళింది. గేటునుంచి వరండా వరకూ సిమెంట్‌తో వేయబడ్డ బాటకి అటూ ఇటూ రకరకాల పూలమొక్కలు! మామూలుగా ఆ ఇంటికి వస్తే ఆ పూలమొక్కలను చూసుకుంటూ పువ్వుల అందానికి ముగ్ధురాలవుతూ నడిచేది శైలజ. ఇపుడుమటుకూ ఆ ఇరవై అడుగుల దూరాన్ని గబగబా నడిచి వరండా చేరుకుంది.

"నమస్తే సర్" అని ప్లీడరుగార్ని విష్ చేసింది.

వరండాలో ఈజీ ఛైర్‌లో కూర్చుని న్యూస్‌పేపర్ తిరగేస్తున్న ఆయన, పేపర్‌లోంచి తలఎత్తకుండానే, ఆ నమస్కారం అందుకున్నానన్నట్టు చేయి వూపారు, బదులుగా "ఆఁ...నమస్తే" అంటూ.

శైలజ వరండా తర్వాత వున్న హాలులోకి నడిచింది. అక్కడ వుంటుంది ఫోన్.

పక్కన పెట్టి వుంచిన రిసీవర్ చేతిలోకి తీసుకుని చెవికి ఆనించుకుని, "హలో" అంది.

"శైలూ?" అంది అవతలివైపు ప్రఫుల్ల కంఠం.

"అవును"

"నేను...ప్రఫుల్లని!"

"ఆమాత్రం గుర్తించలేనా? ఏమిటి?"

"సాయంత్రం అయిదు గంటలకల్లా నీవు మా ఇంట్లో వుండాలి" పురమాయించినట్టు అంది ప్రఫుల్ల.

"ఎందుకుట?" అంది శైలజ.

"చెబితే కానీ రావా?"

"చెప్పరాదా!"

"పార్టీ!"

"పార్టీ ?"

"అవును. శ్రీనివాస్ ఎం.బి.ఎ. పూర్తి చేసి వచ్చాడని!ఇదేమీ పార్టీకి చెప్పుకోదగ్గ సందర్భం కాదనుకో.అయినా మా అమ్మకి ఏదైనా అట్టహాసంగాచేసి ఆడంబరం ప్రదర్శించడం అలవాటుకదా ! మరి పార్టీకి వస్తున్నావా?'' అంది ప్రఫుల్ల.

"రావాలనేవుంది.కానీ...'' శైలజ తటపటాయిస్తున్నట్టు ఆగింది.

"కానీలు, అర్థణాలు ఎక్కడున్నాయమ్మాయ్? నువ్వొస్తున్నావు'' ఖరాఖండిగా అంది ప్రఫుల్ల.

"కానీ నాకు.." శైలజ చెప్పబోతుంటే "నీతో నేను మాట్లాడలేను గానీ శ్రీనివాస్ వస్తున్నాడు...తనకే చెప్పుకో ఆ చెప్పేదేదో, పిలవమన్నది తనే'' అంది ప్రఫుల్ల.

"అరె!'' శైలజ కంగారుపడుతూ అంది.

అప్పటికే రిసీవర్ శ్రీనివాస్ చేతిలోకి మారింది.

"శైలజా?'' అతనికంఠం మంద్రంగా విన్పించింది.

"ఊఁ'' పలికిన శైలజకి గుండె ఓ క్షణం లయతప్పి కొట్టుకున్నట్టు అన్పించింది.

"పార్టీకి వస్తున్నారుకదూ?'' ఆహ్వానానికి మొహమాటంతో అయినా ఒప్పించే ధోరణి కలిసివుంది, ఆ పలకరింపులో.





"........."

శైలజ కంఠంలో ఏదో అడ్డుకున్నట్టు ఏమీ చెప్పలేకపోయింది.

"యూ మస్ట్ కమ్!" తిరిగి అన్నాడు అతను.

"సరే!" అంది అప్పటికి.

"థాంక్యూ. ఓకే దెన్" అంటూ రిసీవర్ క్రెడిల్ చేశాడతను.

శైలజ కూడా రిసీవర్ పెట్టేసి సంతోషంగా చూసింది.

అక్కడ సోఫాలో కాలుపైన కాలు వేసుకు కూర్చుని, ఎడమచేతితో పట్టుకున్న కాగితాలను చూస్తూ, కుడిచేతిలోని పెన్‌ని చుబుకానికి కొట్టుకుంటూ సాలోచనగాచూస్తోంది ప్లీడర్‌గారమ్మాయి నీరజ. శైలజ ఫోన్‌లో మాట్లాడటం ముగించటం చూసి—

"ఏమిటి సంగతి?" అంటూ పరామర్శించింది.

"ఓ ఫ్రెండ్...పార్టీకి రమ్మని ఆహ్వానించింది"

ఆమెకు బదులు చెప్పి "నే వెళ్తాను" అంటూ నడవబోయింది శైలజ.

"కాసేపు కూచుండూ" అంది నీరజ.

"లేదు....పనివుంది"

"పనిలేదన్న మాట నీ నోటంట ఎప్పుడొచ్చిందిగనక? కాస్త ఈ స్టోరీ చూసి సజెషన్స్ ఇస్తావని నేను చూస్తున్నాను"

నీరజకి పద్దెనిమిదేళ్లు వుంటాయి. బియస్సీ చదువుతూంది. అప్పుడప్పుడూ పత్రికల్లో ఏవో రాస్తుంటుంది. శైలజ మంచి పాఠకురాలు కావటంతో, ఆమె విమర్శల్తో తన రచనలకు మెరుగు పెట్టవచ్చునని నీరజ నమ్మకం!

"తీరిక వున్నప్పుడు మళ్లీవస్తాను" శైలజ తప్పించుకోబోయింది.

త్వరగా రమ్మన్న భాగ్యం హెచ్చరిక తరుముతోంది ఆమెను.

"ప్లీజ్..ఇది కాస్త చూసేసిపో. ఇవాళే పత్రికకి పంపించేయాలనుకుంటున్నాను"

శైలజ ఇక తప్పదనుకుంటూ సోఫాలో నీరజ పక్కన కూర్చుంది. నీరజ ఆమె చేతికి కాగితాలు, పెన్ అందించి ఏదో పనిమీద వెళ్తున్నట్టు లోపలకు వెళ్లింది.

శైలజ కథను చదివింది. ఒకటి రెండు వ్యాకరణ దోషాలుంటే సరిచేసింది. సంభాషణలలో అటూ ఇటూ దొర్లిన పదాలను ఒక క్రమంలో పెట్టింది.

ఆమె ఆ విధంగా సరిచేసేటప్పటికి లోపలనుంచి నీరజ తిరిగొచ్చింది. ఆమె రెండు చేతులలోనూ కాఫీకప్పులున్నాయి.

"తీసుకో" అంది ఒక కప్పు శైలజకి అందిస్తూ.

"అరె, ఎందుకు?" అంది శైలజ.

"ఎందుకేమిటి? తాగేందుకు" అంది నవ్వేస్తూ.

శైలజ అయిష్టంగానే తీసుకుంది. ఆమెకు అందించిన తర్వాత నీరజ సోఫాలో కూర్చుంది.

"ఎలావుంది?" కాఫీ సిప్‌చేస్తూ అడిగింది నీరజ.

"బావుంది!" అంది శైలజ.

"తప్పులేమీ లేవుకదా?"

"సరిచేశానులే" అంటూ ఖాళీకప్పును ఎదురుగావున్న టీపాయ్ మీద వుంచింది శైలజ.

"నా రాతలకి నువ్వు ప్రథమ పాఠకురాలివి కావటం నా అదృష్టం" అంది నీరజ సంతోషిస్తున్నట్టు.

"అదేమీకాదు" అంది శైలజ.

"మరి?"

"చెప్పాలనుకున్న విషయాన్ని ఓ

రచనగా మలిచే ప్రతిభ కలిగివుండటం అసలైన అదృష్టం!"

శైలజ జవాబుకి చిరునవ్వు నవ్వింది నీరజ.

కాగితాలు, పెన్ టీపాయ్‌మీద వుంచేసి "ఇక నే వెళ్తా''అంటూ లేచిన శైలజకి "సరే" అంటూ తల వూపింది.

శైలజ తిరిగొచ్చేటప్పటికి భాగ్యం ఉగ్రరూపంతో ఎదురుచూస్తోంది.

"గంటసేపు ఫోన్‌లో ఏం కబుర్లు తగలడతాయ్? ఇక్కడ కూర తగలడింది" అంది ఉరిమి చూస్తూ.

"ఏమైంది?" అంది శైలజ చప్పున.

"ఏమవుతుంది? మాడింది"

శైలజ తలవంచుకుని, మౌనం వహించింది.

సంజాయిషీ ఇచ్చుకోవలసిన అవసరం లేదని ఆమె వుద్దేశం. తప్పుకు తను ఎంత వరకూ కారణమో భాగ్యం తెలుసుకోలేదా?

వెళ్తూ, "కూర చూస్తుండ"మని చెప్పనే చెప్పిందిగా! అయినా కూర మాడిపోయిందని నిందిస్తున్నదంటే దాని అర్థం తనను ఏదోవిధంగా అపరాధినిగా చూడటమే ఆమెకు కావాలని. అటువంటి పరిస్థితిలో ఏం చెప్పుకున్నాఆమెచెవికి ఎక్కుతుందా?

"మూగమొద్దులా ఉండటం ఒకటి నేర్చావ్. చుట్టుపక్కలవారంతా నా గయ్యాళితనాన్ని ఆడిపోసుకోవాలనికదూ"

ఆమె ఉక్రోషాన్ని చూసి శైలజకి నవ్వొచ్చింది.

"అయితే ఇప్పుడేం చేయమంటావ్?'' అంది సౌమ్యంగా.

భాగ్యం ఒక తీక్షణమైన చూపు విసిరి "ఏంతెలివి ప్రదర్శిస్తున్నావ్? చేసింది ఏదో చేసిందికాక ఇప్పుడు ఏంచేయమంటావని నన్నే ఎదురడుగుతున్నావా? చాలా బావుంది'' అంది అక్కసుగా.

"......''

శైలజ ఏమీమాట్లాడకపోవటం చూసి-

"దోసకాయలున్నాయిగా వాటితో పచ్చడిచేసి, చారు పెట్టు. పావుగంటలో అయిపోవాలి తెలిసిందా? ఈలోపు నేనలా తాయారమ్మ గారింటికి వెళ్లొస్తాను. మాడిపోయిన గిన్నెనుకూడా శుభ్రంగా, మసి లేకుండా తోమేసెయ్"అని పురమాయించేసి తను పెత్తనాలకి వెళ్లిపోయింది - అక్కడే లక్కపిడతలతో ఆడుకుంటున్న రెండేళ్ల కూతురు 'చిన్నీ'ని తీసుకుని.

శైలజ ఒక్కసారే రిలీఫ్‌గా ఫీలయి తేలికగా నిశ్వసించింది.

పని తనకేమీ కష్టంకాదు. పైగా వూర్కెనే బద్ధకంగా కూర్చునేకంటే ఏదో ఒక పని చేస్తుండటంలో తనకు సంతృప్తి లభిస్తుంది. కానీ తన దురదృష్టం ఏమంటే ఎంత చాకిరీచేసినా భాగ్యం నిందల్ని భరించవలసే వస్తోంది.

భాగ్యం శైలజకి స్వంత అక్కకాదు- సవతితల్లి కూతురు. భాగ్యం తల్లి మరణిస్తే, భాగ్యం తండ్రి మరొక పెళ్లిచేసుకున్నాడు.

మొదట్లో ఆ సవతితల్లి భాగ్యాన్ని బాగానే చూసుకునేది. శైలజ పుట్టేకమాత్రం భాగ్యంమీది ప్రేమ మటుమాయమయింది. క్రమంగా అది భాగ్యంమీద ద్వేషంగా పరిణామం చెందింది. ఎన్నో విధాలుగా ఆమెను బాధపెట్టేది. అది భాగ్యం మనసులో 'తన ఈ కష్టాలన్నిటికీ కారణం శైలజే' అన్న భావానికి అంకురార్పణ చేసింది. ఆ ఆలోచన ఆమె వయసుతో పాటు పెరుగుతూ వచ్చినా, కసితీర్చుకునే అవకాశం మాత్రం లభించేదికాదు. ఎప్పు




డైనా చాటుమాటుగా శైలజని కొట్టినా, గిల్లినా అంతకు ఎన్నోరెట్లు దెబ్బలు సవతి తల్లినుంచి తినవలసి వచ్చేది. భాగ్యం పెళ్ళి అయాక, భర్త మంచివాడు కావటంతో తేలికగా వూపిరి పీల్చుకుంది. తర్వాత తండ్రి, సవతి తల్లి రైలు ప్రమాదంలో చనిపోవటంతో శైలజకి తనే దిక్కు అయింది. చిన్నతనంలో సవతి తల్లి పెట్టిన బాధలవల్ల శైలజపట్ల పెంచుకున్న కసి, ద్వేషం ఇప్పుడు ఈ విధంగా బయటపడసాగింది.

భాగ్యం భర్త శంకర్రావుకి మాత్రం శైలజ అంటే సానుభూతి. తల్లిదండ్రుల్ని ఒకేసారి కోల్పోయి ఏకాకి అయిందని జాలి. భాగ్యం కొడుకు 'బాబీ', కూతురు 'చిన్నీ'లక్కూడా శైలజ అంటే ఇష్టమే! అందుకే భాగ్యం తన పిల్లలిద్దరినీ ఆమెకు దూరంగా వుంచేందుకు ప్రయత్నిస్తుంది.

'పావుగంటలో వంట పూర్తిఅవా'లన్న భాగ్యం ఆర్డర్, శైలజ మనసును హెచ్చరించటంతో, తల విదిలించి వంటగదిలోకి నడిచింది.

స్టౌ పక్కనవుంది కూరమాడిపోయిన గిన్నె. మూత తెరిచి చూసింది శైలజ. బెండకాయ ముక్కలు మాడిపోయి మసి బొగ్గుల్లా అయినాయి. తనపైన పంతం కాకుంటే భాగ్యానికి కూర చూసేందుకు ఒక నిముషం సమయం లేకపోయిందా?

గిన్నెను పాత్రలు తోమేచోటపెట్టి వంటకు ఉపక్రమించింది శైలజ.

స్టౌ వెలిగించి, పోపువేసి చారుకు నీళ్ళు పెట్టింది. చారు నీళ్లు మరుగుతుండగా చకచకా దోసకాయముక్కలు తరిగింది. ఈ లోపు చారు మరిగిపోవటంతో, గిన్నె దింపేసి స్టౌ ఆర్పేసింది.

ఆ దోసకాయముక్కల్ని రోట్లో నూరి పోపు పెట్టేస్తే వంట అయిపోయినట్టే!

రోలు పెరట్లో ఒకమూల వుంటుంది. మోరీ దగ్గరేవుంటే మసలేందుకు ఆటంకంగా వుంటుందని అలా మూలన పెట్టి వుంచారు. ఇప్పుడు రోలును కడిగేందుకు మోరీ దగ్గరికి దొర్లించుకు వెళ్ళింది శైలజ. మోసేందుకు చాలా బరువుంటుంది. అందుకే దొర్లించుకు వెళ్ళడం!

రోలును నీళ్ళతో కడిగేసి తిరిగి తెస్తుండగా పరధ్యానంలో వుండి కుడి పాదం మీదకు దొర్లించేసుకుంది శైలజ.

కెవ్వుమన్న కేక రాకుండా ఆపుకో గలిగిన ఆమె, 'అమ్మా!'అంది బాధకు.

కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగినాయి.

బొటనవేలు చితికి, గోరు చిట్లడంతో రక్తం కారసాగింది. రోలును వదిలేసి ఎడమచేత్తో బొటనవేలు గట్టిగా పట్టుకుని, కుడి చేత్తో నీళ్ళు చిలకరిస్తూ కూర్చుంది.

కొంతసేపటికి ఆ నొప్పి కొద్దిగా తగ్గిందనుకున్నాక లేచి నడవబోయింది. ప్రయత్నమైతే చేసిందికానీ కాలుతీసి కాలు వెయ్యలేకపోయింది. భరించలేనంతనొప్పి!

ఎలాగో మడమమీద నడుస్తూ ఇంట్లోకి వెళ్ళి ముందు గదిలోని అలమర తలుపులు తెరచింది. ఒకసారి బాబిగాడికి ఆటల్లో దెబ్బలు తగిలినప్పుడు కొన్న బాండేజ్ క్లాత్ కొద్దిగా మిగిలివున్నట్టు గుర్తు. ఆమెకు వెదికే శ్రమలేకుండా పై అరలో ఒక మూలన కన్పించింది. తీసుకుని బొటన వేలికి కట్టు కట్టుకుంది.

ఆమెకు కాసేపు విశ్రాంతిగా కూర్చోవాలని వుంది గానీ మరి పని?

భాగ్యం తిరిగొస్తే మళ్ళీ రభస!

నొప్పిని పళ్ళ బిగువున భరిస్తూ పచ్చడి చేసేందుకు లేచి వెళ్ళింది. తన నిస్సహాయతకు ఏడ్పు వస్తోంది.

కానీ ఆమెకు అలవాటయిన సహనం కంటివెంట కన్నీరు రాకుండా అడ్డుకుంది.

* * *

సాయంత్రమైంది!

శైలజకి ప్రఫుల్ల ఆహ్వానం గుర్తొచ్చింది.

కానీ ఎలా?

పాదం ఇంకా నొప్పెడుతూనే వుంది. మామూలుగా నడవనీయడంలేదు.

పోనీ, రాలేనంటూ ఫోన్ చేస్తే? అనుకుంది.

పీదరుగారి ఫోన్ వాడటం బాగుండదు. వాళ్ళకి, ఇతరులు ఎక్కడినుంచి అయినా ఫోన్‌కాల్ వస్తే మాట్లాడేందుకు ఉపయోగించడం అభ్యంతరం లేదుగానీ, ఎవరికన్నా చేసేందుకు తమ టెలిఫోన్ వాడుకోవడం నచ్చదు.డబ్బులు తీసుకునేందుకు వారికి నామోషి.

పబ్లిక్ బూత్ కాస్త దూరం. తనేమో నడవగల స్థితిలో లేదు. అయినా ఫోన్ చేయడం ఏమంత ప్రాణావసరం కాదుకదా అని ఆలోచించి ఆ ప్రయత్నం విరమించుకుంది శైలజ.

భాగ్యం తిరిగొచ్చేటప్పటికి మొత్తానికి వంట పూర్తి చేసేసింది.

"ఏమైంది?" కాలికి కట్టు చూసి అడిగింది భాగ్యం.

శైలజ చెప్పింది.

"కళ్ళు ఎక్కడో పెట్టుకుంటావ్! ఏ పనీ సవ్యంగా చేయడం చేతకాదాయె" అని వాఖ్యానించి పూరుకుంది.

శైలజకి పార్టీకి వెళ్ళామని అంతగా లేకపోయినా, ఇపుడువెళ్ళలేకపోతున్నందుకు అనీజీగా వుంది.

శ్రీనివాస్ కూడా ఆహ్వానించాడు, నిన్నటి పరిచయానికే ఎంతో విలువను ఆపాదించి.

అతడేమనుకుంటాడో?

'పోజ్ పెడుతూం'దని భావిస్తే?

* * *

పార్టీకి ఆహూతులు ఒక్కరొక్కరే వస్తున్నారు.

ఖరీదైన దుస్తులు, ఆభరణాలతో ఆడంబరంగావున్న ఆడవాళ్ళు...సూట్లలో దర్జాగా కనబడుతున్న మగవాళ్ళు.

వచ్చినవారంతా ముందు శ్రీనివాస్‌ని పలకరిస్తున్నారు. ఆలివ్ రంగు సూట్‌లో మరింత హుందాగా కనబడుతున్నాడతను. మగవాళ్ళు అతనితో కరచాలనం చేసి అభినందనలు తెలుపుతున్నారు. మందహాసంతో వారిని రిసీవ్ చేసుకుంటున్నాడు అతను.

పార్టీ ఆవరణలోని తోటలో ఏర్పాటు చేశారు. చెట్లను రంగురంగుల చిన్న బల్బులతో అలంకరించారు. వాటి కాంతి రేయి తాలూకు చీకటిని పూర్తిగా పారద్రోలలేకపోతోంది. వెలుగు చీకట్ల సమ్మేళనం అక్కడ ఓ వింత వాతావరణాన్ని సృష్టిస్తోంది.

పార్టీకి హాజరైనవారు కూల్‌డ్రింక్ తాగుతూ గ్రూపులుగా ఏర్పడి మాట్లాడుకుంటున్నారు.

శ్రీనివాస్ తండ్రి తన వ్యాపార భాగస్వాములతో ముచ్చటిస్తున్నాడు. తల్లి పార్టీ ఏర్పాట్లను అజమాయిషీ చేయడంలో తీరిక లేకుండావుంది.

ప్రఫుల్ల తన ఫ్రెండ్స్ మధ్య వుంది.

తన దగ్గరికొచ్చే అతిథులతో యధాలాపంగా మాట్లాడుతున్నాడు శ్రీనివాస్. ఎవరి రాక కో వెదిచూస్తున్నట్టు అప్పుడప్పుడూ అతని కళ్ళు గేటు వైపు పయనిస్తున్నాయి.





కాని, ఎప్పటికప్పుడు అతని మనసుకి నిరాశే మిగులుతోంది. ఆ ఆశాభంగం ముఖంలో తెలియకుండా జాగ్రత్తపడు తున్నాడు. చిరునవ్వుతోనే మాట్లాడు తున్నాడు.

ఇంతలో శ్రీనివాస్ తల్లి ఒక సలభై ఏళ్ళావిడను వెంటబెట్టుకుని అతని దగ్గరికి వచ్చింది.

పట్టుచీర, రాళ్ళ నగలు ధరించిన ఆవిడలో ఐశ్వర్యం కొట్టొచ్చినట్టు కనబడు తోంది. పక్కన ఆవిడ పోలికలు స్పష్టంగా కన్పిస్తున్న ఓ యువతి.

"వాసూ! ఈవిడ లీలావతిగారని... ఈవిడ భర్త చక్రధరంగారు ఈమధ్యనే మీ నాన్నగారికి బిజినెస్ పార్టనర్‌గా కలిశారు" అని పరిచయం చేసింది తల్లి.

"నమస్తే!"

చేతులు జోడించి చెప్పాడు శ్రీనివాస్.

ఆవిడ ప్రతి నమస్కారంచేస్తూ-

"మా అమ్మాయి జయ! ఫైనల్ బియస్సీ చదువుతోంది" అంటూ పక్కనున్న యువతిని పరిచయంచేసింది.

జరీ అంచుల ఆకుపచ్చ రంగు షెల్వార్ కమీజుల్లో వుందామె.

"నమస్తే" అనబోతున్న అతని కుడిచేయి పట్టుకుని కరచాలనం చేసి "గ్లాడ్ టూ మీట్ యూ!" అని నవ్వింది.

ఆ చొరవ అతన్ని విస్మయపరచింది. ముఖ్యంగా పక్కన తమ పెద్దవాళ్లు వుండగా...

ఎవరినో చూసి పలకరిస్తూ శ్రీనివాస్ తల్లి, లీలావతి అక్కడినుంచి వెళ్లి పోయారు.

అతన్ని కళ్ళప్పగించి చూసింది జయ.

చూడగానే ఆకర్షించే ముఖం! పత్తయిన జుట్టు! ఎర్రటి శరీర ఛాయ! ఆరడుగులకి తగ్గని ఎత్తు! సన్నమూ, లావూ కాకుండా పొడుగుకి తగ్గట్టు వున్న దేహ నిర్మాణం!

"యూ లుక్ సో హేండ్‌సమ్!"

కనురెప్పల్ని సుతారంగా తాటిస్తూ చెప్పింది.

శ్రీనివాస్ విస్తుబోయి చూశాడు.

"థేంక్స్" అన్నాడు యథాలాపంగా.

"ఎం. బి. ఎ. పూర్తి చేశారట కదా?"

"అవును"

"జాబ్ చేస్తారా? ఫ్యూచర్ ప్లాన్స్ ఏమిటి?"

"జాబ్ కాదు. మా నాన్నగారు త్వరలో తన బిజినెస్ వ్యవహారాల్ని నాకు అప్పగించబోతున్నారు. ఎం.బి.ఎ చేసింది ఆ వుద్దేశంతోనే!"

"మీ హాబీలేమిటి?"

"ఇంటర్వ్యూలాఅడుగుతున్నారేమిటి?" అని నవ్వాడు శ్రీనివాస్.

"జోక్స్ చదవడం, వినడం- వాటిని అందరికీ చెప్పడం నా హాబీ" అందామె.

శ్రీనివాస్ చిరునవ్వు నవ్వి, మౌనంగా వూరుకున్నాడు.

"ఓ జోక్ చెప్పనా?'' అడిగిందామె.

ఆమెకు వినడంకంటే, మాట్లాడటం పైనే అమితాసక్తి వున్నట్టు గుర్తించాడు అతను.

''ఒకటైతేనే చెప్పండి'' అన్నాడు నవ్వుతూ.

ఆమె ఓ క్షణం అర్థంకానట్టు చూసి, "ఎక్కడో చదివాను" అంటూ ప్రారంభించింది.

"ఇద్దరు ప్రేయసీ ప్రియులు ఓ పార్కుకి వెళ్లారట.

ప్రియుడిని ప్రేయసి ఒక పొద వెనక్కి లాక్కువెళ్లి 'నన్ను ముద్దు పెట్టుకో డియర్!' అందట.

కొంచెం పిరికివాడైన ప్రేమికుడు, 'ఇక్కడా? ఎవరైనా చూస్తే...?' అని భయపడ్డాడట.

దాంతో ప్రేయసి, 'రక్షించండి... రక్షించండి' అని కేక లేసిందట.

కాని, అక్కడికి ఎవరూ రాలేదట!

అప్పుడు 'చూడు... ఎవరూ లేరు! భయం లేదు!' అంటూ ప్రియుడికి హామీ ఇచ్చి తన ముద్దు చెల్లించుకుందట ప్రేయసి!"

ఫక్కున నవ్వుతూ చెప్పడం ముగించి "ఎలావుంది?" అనడిగింది జయ.

"బాగానే వుంది'' అన్నాడు శ్రీనివాస్.

''జోక్ ఎలావున్నా దాన్ని ఇలా అసందర్భంగా చెప్పడం మాత్రం బాగో లేదు" అని నిష్కర్షగా అనలేకపోయాడు మర్యాద అడ్డొచ్చి.

"మీరు మొహమాటం కోసం చెబుతున్నారు. బావుంటే నవ్వేవారు కదా. ఏదీ నవ్వలేదే! అంటే నవ్వురాని జోక్ అన్నమాట. ఈసారి మరో మంచి జోక్ చెబుతానుండండి! దీనికి మీరు పగలబడి నవ్వాల్సిందే!"

శ్రీనివాస్ గతుక్కుమన్నాడు.

ఆమెను ఎలా తప్పించుకోవాలో అర్థం కాలేదు.

ఇంతలో అతన్ని రక్షిస్తున్నట్టుగా ప్రఫుల్ల ''వాసూ" అని పిలిచింది కొద్ది దూరం నుంచి- అతనివైపు వస్తూ.

''ఎక్స్‌క్యూజ్ మీ'' అని జయకు చెప్పి వడివడిగా ఆమెకు ఎదురెళ్ళాడు.

''శైలజ రాలేదు చూడు'' అంది ప్రఫుల్ల దగ్గరికొచ్చాక. ఆమె గొంతులో నిష్ఠూరం ధ్వనించింది.

''అవును''

అంతకంటే ఏమనాలో తోచలేదు అతనికి.

"ఫోన్ చేయనా?''

''నీ ఇష్టం'' అన్నాడు.

ప్రఫుల్ల అంతలోనే తన వుద్దేశాన్ని మార్చుకున్నట్టు ''ఊహూం...వద్దులే! తనకి రావాలని లేనప్పుడు మనకెందుకు? పదేపదేఆహ్వానించి ఎందుకుఅలుసవడం?" అంది కొట్టి పారేస్తున్నట్టు.

శ్రీనివాస్ ఏమనలేకపోయాడు.

ప్రఫుల్ల అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

అతను తిరిగి వంటరిగా మిగిలాడు.

జయ 'ఎక్కడుందా?' అని చూశాడు.

ఫాషనబుల్‌గా అలంకరించుకున్న నలుగురు యువతులతో కలిసి వుందామె. వాళ్ళంతా నవ్వుతున్నారు. తన జోక్స్ వారి మధ్య ప్రయోగిస్తున్నట్టుంది.

'హమ్మయ్య!' అనుకున్నాడు శ్రీనివాస్.

* * *

ఆఫీసునుంచి వచ్చిన శంకర్రావు శైలజ కాలుకు కట్టు చూసి ఏమైందని అడిగాడు.

ఆమె సమాధానం విని, "డాక్టర్ దగ్గరికి వెళ్ళకూడదూ?" అన్నాడు.

"ఆఁ...ఆఁ! ఇటువంటి చిన్న చిన్న వాటికి కూడా డాక్టర్ల దగ్గరికి పరుగెడితే ఇంక సంసారం నిలిచినట్టే!" భాగ్యం కల్పించుకుంది తనదైన ధోరణిలో.

శంకర్రావు ఎదురు మాట్లాడలేదు. శైలజ కూడా పట్టించుకోలేదు.

తల్లిదండ్రుల మరణం ఆమె జీవితాన్ని ఏనాడో స్తబ్దంగా మార్చేసింది. హఠాత్తుగా వారు ఆమెను ఒంటరిదాన్ని చేస్తూ ఈ లోకాన్ని వీడిపోవడం ఆమె మనసుకు పెద్ద విఘాతమే అయింది.

అంతకు ముందు యువతుల్లో సహజంగావుండే ఉత్సాహమే శైలజలో కూడా వుండేది. కాలేజీ చదువులోనూ, ఇతర ఏక్టివిటీస్‌లోనూ చురుకుగావుంటూ, ఏ కార్యక్రమాలు జరిగినా ప్రముఖంగా పాల్గొనేది.

'కాలేజీ బ్యూటీ' అనే పదం సైతం ఆమె సౌందర్యానికి తగినదికాదని 'బ్యూటీ ఆఫ్ బ్యూటీస్' అనేవారుతోటి విద్యార్థులు. గమత్ ఏమిటంటే- తన అందాన్ని ఇతరులుపొగడటం ఆమెకు గర్వంగా కాక చిరాకుగా అన్పించేది. అందంతో ఆకర్షించడం ఇష్టంలేని కారణంగానే ఆమె కాలేజీ రోజుల్లో తనకు సన్నిహితం కాబోయిన వారందరినీ దూరంగానే వుంచింది. మర్యాదకోసం వారితో వూరికే మాట్లాడే దంతే! దానికే వాళ్లు మహా సంతోష పడిపోయి ప్రేమలేఖలు, వగైరా ప్రయత్నాలు మొదలుపెట్టేవారు. దాంతో ఆమెతో మాట్లాడే అవకాశాన్ని సైతం కోల్పోయేవారు.

తల్లిదండ్రులను కోల్పోయాక ఎదురైన పరిస్థితులు శైలజకి జీవితంపట్ల అనురక్తిని తగ్గించాయి.

సవతితల్లిపట్ల పెంచుకున్న ద్వేషాన్ని శైలజపై తీర్చుకుంటూ ఆమె తన చెప్పు చేతల్లో వుండేలా, తను శాసించిన ప్రకారం నడుచుకునేలా చేయడంలో అహర్నిశలూ పాటుపడి సఫలీకృతురాలైంది భాగ్యం. శైలజ స్వభావరీత్యా ఆమెతో ఘర్షణ పడకుండా తనే సర్దుకుపోవడం అలవాటు చేసుకుంది.

చివరికి 'జరిగేది జరగక మానదు. జరగనిది ఎలానూ జరగదు' అనే ఒక రకమైన కర్మసిద్ధాంతం ఆమె మనసును స్తబ్దతతో నింపింది.

మరి మూడురోజులకి శైలజకి కాలు నొప్పి తగ్గిపోయి మామూలుగా అయింది. ప్రఫుల్ల తనకోసం వస్తుందేమో అనుకుంది.

రాలేదు.

కనీసం ఫోన్ కూడా చేయలేదంటే- ఆమెకు కోపం వచ్చిందనీ, అది ఇంకా పోలేదనీ అర్థం.

తన్ను కల్సుకుని, ఆరోజు వెళ్ళని కారణాన్ని సంజాయిషీ ఇచ్చుకుంటేగానీ ఆమె కోపం పోదు.

రెండు మూడు పర్యాయాలు అదే విధంగా జరిగింది!

తనను చూడటంతోటే ముఖం మరొక వైపుకి తిప్పేసుకుంటుంది.

తను ఆమె చుబుకం పట్టుకుని ముఖం తనవైపుకి తిప్పుకో ప్రయత్నిస్తే,బిగుసుకు పోయినట్టుగా తలను కదలనీదు.

"ఏయ్... ప్రఫూ!"

ఆమెనుంచి సమాధానం వుండదు.

"అరె!"

అప్పటికీ మౌనమే!

"సరే...నేను వెళ్తున్నాను"

తను గుమ్మం వైపు నడిచే ప్రయత్నం చేస్తుంది.

"అటువంటిదానివి ఎందుకొచ్చావ్"

విసురుగా తలతిప్పి అంటుంది ప్రఫుల్ల అపుడు.

ఆమెనుంచి ఆ ప్రవర్తన కోసమే తన ప్రయత్నం!

"మరి వస్తే నువ్వు మాట్లాడకపోవటం బాగుందా చెప్పు!"

"మరి నువ్వు మొన్న చేసిన పని బాగుంది కదూ?"

"కారణం చెబితే నువ్విలా నిష్ఠూరాలాడవు" అంటుంది తను అనునయంగా.




"రావాలన్న అసక్తి నిజంగా వుంటే ఏ కారణాలూ అడ్డుపడవు...తెలుసా?"

"మరి నా కాలు అడ్డుపడిందే?"

"ఏమిటీ"అన్నట్టు చూస్తుంది.

"కాలి బొటనవేలు రోలు కిందపడి పచ్చడయింది.అయినా మా ప్రఫుల్ల కోసం బైలుదేరేదాన్ని. కానీ చెప్పుకీ, కాలుకీ సయోధ్య కుదరక విరమించుకున్నాను"

ప్రఫుల్ల కోపం మాయమై, "ఏదీ?" అని ఆదుర్దాగా చీర కుచ్చెళ్ళు పైకి తీసి పాదాన్ని చూస్తుంది.

గాయపు మచ్చని చూసి,"అరె...సారీ శైలూ! నొప్పి ఇప్పుడు లేదు కదా?" అంటుంది, అంతవరకూ తను చేసిన హఠం గుర్తొచ్చి.

"అపార్థం చేసుకున్నానని అర్థం చేసుకొన్నావు కదా... ఇక ఫర్లేదు. నొప్పి పూర్తిగా తగ్గింది కనుకనే ఈ మహారాణి దర్శనం చేసుకోగల్గాను ఇవ్వాళ్టికైనా" అంటుంది తను నవ్వేస్తూ.

ఇలా ప్రఫుల్ల ప్రవర్తనను వూహించుకుని, నవ్వుకుంటూ ఆమె దగ్గరికి బైలుదేరింది శైలజ.



లాన్‌లో, గార్డెన్ ఛెయిర్‌లో వెనక్కువాలి కూర్చున్నాడు శ్రీనివాస్.

పక్కనే టీపాయ్ మీద, టేప్‌రికార్డర్ లోంచి డోనాసమ్మర్ 'ఐ ఫీల్ లవ్' విన్పిస్తోంది.

కళ్ళు మూసుకుని వున్న శ్రీనివాస్ గేటు చప్పుడయితే కళ్ళు తెరిచి చూసి, కుర్చీలో నిటారుగా అయ్యాడు.

గేటు దగ్గిర ఆమెను చూసిన వెన్వెంటనే అతడి కళ్ళల్లో తళుక్కుమన్న భావం సంతోషాన్ని తెలుపుతూంది.

"రండి" ఆహ్వానపూర్వకంగా నవ్వాడు, టేప్‌రికార్డర్ ఆపుజేసి.

"ప్రఫుల్ల వుందా?" అడిగింది శైలజ.

"లేకుంటే రాకూడదా?"

"అహఁ...అదికాదు" అతనిప్రశ్నకు తడబడినట్టు అంది.

"ప్రఫుల్ల క్లబ్‌లో ఏదో ఫంక్షన్‌కి అమ్మతో కల్సి వెళ్ళింది. ఎవరూ లేక బోర్ కొడుతూంది. మీరు వచ్చి కాస్త కంపెనీ ఇస్తే ధన్యుణ్ని"

అతను అంత ఇదిగా ఆహ్వానిస్తే కాదని ఎలా అనటం?

శైలజ నెమ్మదిగా వచ్చి అతని ఎదుట వున్న కుర్చీలో కూర్చుంది.

"మొన్న రాలేదెందుకు? మీ కోసం ఎంతో ఎదురుచూశాము" అన్నాడు శ్రీనివాస్.

అతనలా కనుక్కోవటం ఆమెకు సంతోషకారణమైంది. ఎందుకంటే, ఆవిధంగా అడగటం తనని ఫార్మల్‌గా ఆహ్వానించలేదన్న విషయాన్ని స్పష్టం చేస్తూంది.

"వచ్చేదాన్నే కానీ,కాలికిగాయమై..." అసంపూర్తిగా ఆగిపోయింది.

"అరె... ఏమైంది?"అతని చూపులు చప్పున కిందికి వాలినాయి.

కానీ ఆమె పాదాలు కన్పించకుండా చీర కుచ్చెళ్ళు అడ్డుపడినాయి.

ఏమైందీ చెప్పింది శైలజ.

"ఏదీ... చూడనివ్వండి" అన్నాడు అలాగే చూస్తూ.

"ఇప్పుడు ఫర్లేదు... తగ్గిపోయింది"

శ్రీనివాస్‌కి ఆమె సంశయం అర్థమై పూరుకున్నాడు.

"మాచయ్యా"

మొక్కలకు నీళ్ళుపోస్తూ అక్కడే వున్న మాలిని పిలిచాడు.

"అయ్యా!" వచ్చిఎదురుగా నిలబడ్డాడు అతను.

"వెళ్ళి వంటతనితో రెండు టీలు చేసి పట్టుకురమ్మన్నానని చెప్పు" ఏదో అన బోతున్న శైలజని చేత్తో వారించాడు శ్రీనివాస్. తిరిగి టేప్‌రికార్డర్ ప్లే బటన్ నొక్కాడు.

అందులోంచి వెలువడుతున్న సంగీతం వారి మధ్య సంభాషణకి ఆస్కారం లేకుండా, మౌనం అలుము కునేట్టు చేసింది.

శైలజకి ఈ పరిస్థితి అదోలా వుంది. అతనితో తను ఒంటరిగా ఇలా...గుండె బయతప్పి కొట్టుకుంటూంది.

చూపుల్ని నేలపై పరచి ఆమె!

ఆమె ముఖం చూస్తూ అతను!

వంటతను ట్రేలో టీకప్పులు పట్టుకొచ్చి, కప్పులు టీపాయ్ మీద వుంచి వెళ్ళిపోయాడు.

శ్రీనివాస్ టేప్‌ని ఆపేశాడు.

"తీసుకోండి"

ఒక కప్పు ఆమెవైపుకి జరిపాడు.

శైలజ చేయి చాచి కప్పు అందుకుంది.

టీ తాగటం పూర్తిచేసి కప్పు టీపాయ్ మీద పెట్టేశాడు శ్రీనివాస్. శైలజ కూడా టీ తాగటం పూర్తిచేసింది.

ఇద్దరి మధ్యనా మౌనం రాగాన్ని ఆలపిస్తూంది.

"బావుంది పద్ధతి"

దీర్ఘంగా నిశ్వసిస్తూ అన్నాడతను.

శైలజ కళ్ళు ఎత్తి చూసింది.

"మీరొచ్చి బోర్‌ను తరిమికొట్టేస్తారని పిలిస్తే, మీరేమో మౌనంతో స్నేహం చేస్తున్నారు" కొద్దిగా ఆ రో ప ణ గా అన్నాడు.

"ఏం మాట్లాడమంటారు?" అంది శైలజ నెమ్మదిగా.

"నేను చెప్పాలా?" నవ్వాడతను.

"మీ ఆడవాళ్ళు మాట్లాడదల్చుకుంటే టాపిక్స్ కరువనుకోను! అయినా ఆడ వాళ్లు మాట్లాడటానికి టాపిక్ అవసరం వుండదనుకుంటా!"

ఎర్రబడిన ఆమె ముఖం చూసి—

"మరిచేను. మీరు అందరిలాంటి వాళ్లు కాదు కదూ! పోనీ ఇంటర్వ్యూ చేస్తాను. వాటికి జవాబులు చెప్పండి" అన్నాడు.

"అడగండి'' అంది శైలజ.

"మీ హాబీలేమిటి?''

"సాహిత్యం, సంగీతం''

"అరె... నావీ అవేనే'' వింతపడి పోయాడతను.

"దేనిలో అయినా ప్రవేశం వుందా?''

"కొంచెం వుంది...సంగీతంలో''

"ప్రోగ్రామ్స్ ఏమైనా ఇచ్చారేమిటి?''

అతడు అరచేతిని మడిచి చుబుకానికి ఆన్చి ముందుకి వంగి అన్నాడు.

"ఆ...కొన్ని లలిత సంగీత కార్యక్రమాలలో పాల్గొన్నాను"

"మీరే బెటరే!" అన్నాడు అతను వెనక్కి వాలి కూర్చుంటూ.

"నాకు సాహిత్యంలో ప్రవేశం వుంది. బి. కాం. చదువుతున్నపుడు





కొద్దిగా గేయాలవీ రాసేవాణ్ని"

అలాగా అన్నట్లు చిరునవ్వు నవ్వింది శైలజ.

విడివడిన గులాబీరంగు పెదిమల మధ్య, దానిమ్మ గింజల కూర్పులా వుండే తెల్లటి కాంతితో ప్రత్యక్షమయే పలు వరస...కొద్దిగా కనురెప్పలు వాలి, కళ్ళ కింద ఏర్పడే ఉబ్బు...అరుణిమ పులుము కున్న చెక్కిళ్ళపై కనపడే నొక్కు... చిరునవ్వు ఆమె ముఖానికి సమ్మోహ నత్వాన్ని మరింతగా సంతరించి పెడు తుంది.

ఆమెకేసి చూస్తూ శ్రీనివాస్ అనిమిష నేత్రుడే అయాడు!

కాసేపటికి అది గమనించినట్టుగా ఆమె కదలింది.

అతను తెప్పరిల్లి, చూపులు మరల్చు కుని "మీకు రవిశంకర్ సితార్ ఇష్ట మటకదా! ప్రఫుల్ల చెప్పింది..విందామా?" అంటూ టేప్‌రికార్డర్‌లో కాసెట్ మార్చాడు.

నిశ్శబ్దంలోకి మంద్రంగా ప్రవహించ సాగింది కర్ణపేయమైన సితార్ సంగీతం.

* * *

ఫోన్ వచ్చినట్టు కబురు వస్తే మాట్లా డేందుకు వెళ్ళింది శైలజ.

"హలో" ఆమె రిసీవర్ ఎత్తి అనగానే అటునుంచి విన్పించింది-

"నేను...ప్రఫుల్లని"

"నమస్తే" శైలజ హాస్యంగా అంది.

''గొప్ప వినయమేగానీ, నిన్న వచ్చా వటకదా'' అంది ప్రఫుల్ల.

''ఏం ఉపయోగం? రాణీగారి దర్శనం కాలేదుకదా''

''శ్రీనివాస్ చెప్పాడు ఆరోజు పార్టీకి నువ్వు రాని కారణం...సారీ శైలూ''

''ఎందుకు?"

''నువ్వు రాలేదన్న కోపంతో ఇక నిన్ను కలుసుకోగూడదనుకున్నాను. కానీ నిన్న శ్రీనివాస్ అసలు సంగతి చెప్పాక...''

"పశ్చాత్తాపపడుతున్నావ్.అంతేనా!'' మధ్యలోనే అడ్డుకుని అంది శైలజ.

''మరి నీ తప్పు ఏమీలేదు కదా''

''నాకు నువ్వు చేసిన తప్పు కూడా ఏమీ కన్పించడంలేదే''

''అంటే?''

''నేను రానందుకు కోపం వచ్చిం దంటే అది నాపట్ల నీకుగల ఇష్టాన్ని స్పష్టంచేస్తూంది''

''భలే ఆలోచిస్తావే!''

''నిజం కాదా?''

''కాదనే ధైర్యమే ! మళ్ళీ ఎపుడు కలుస్తున్నావు?''

"వీలైనపుడు''

''ఉంటాను''

"అలాగే"

అటువైపు ఫోన్ క్రెడిల్ చేసిన చప్పుడు విని రిసీవర్ పెట్టేసింది శైలజ.

* * *

కూరగాయలు కొనుక్కుని మార్కెట్ నుంచి ఇంటికి వెళుతూంది శైలజ. సంచీ బరువుగా వుంది.

పక్కన సైకిల్ ఆగినట్టనిపించి తల తిప్పి చూసింది.

బలరాం సైకిల్ దిగుతున్నాడు.

అతడు పలకరింపుగా నవ్వుతుంటే, ఆమెకూడా చిరునవ్వు నవ్వింది.

అతను శంకర్రావు బావకి మంచి స్నేహితుడు. శంకర్రావు కొరకు తరచూ ఇంటికి వస్తుంటాడు. కలుపుగోలు మన స్తత్వం కలవాడవటంచేత వచ్చినప్పుడల్లా

భాగ్యాన్ని, శైలజని కూడా పలకరించి పోతుంటాడు.

"మార్కెట్ నుంచా?" అనడిగాడు శైలజని.

"అవును"

"ఆ సంచీ ఇలా ఇవ్వండి"

అతను సైకిల్ హేండిల్‌కి తగిలించాలనే ఉద్దేశంతో అడిగినట్టు అర్థం చేసుకుంది శైలజ.

"ఎందుకు మీకు శ్రమ?" అంది మొహమాటంగా.

"భలేవారే! శ్రమ ఏముంది? ఆ శ్రమ ఏదో సైకిల్‌కేగాని నేనేమీ మోయను కదా?'' అంటూ చొరవగా ఆమె చేతిలోని సంచీని తీసుకుని, హేండిల్‌కి తగిలించాడు.

సంచీ ఇచ్చాక ఆమెకు తేలికగా అనిపించి, మనసు అతనిపట్ల కృతజ్ఞతాభరితమయింది.

"ఈ మధ్య సినిమాలేం చూశారు?" అన్నాడు నడుస్తుండగా.

"ఏమీ చూడలేదు"

"అయినా ఇప్పటి సినిమాలు చూడటం కంటే చూడకపోవటమే మెరుగులెండి. చూస్తే ఏముంది?మనలాంటివారికి డబ్బులు వేస్ట్ అయాయన్న బాధతప్ప, సినిమా ఆఖరికి ఏమీవుండదు. ఆ ఫీలింగ్‌తో వచ్చే తలనొప్పి! దానికి ఎక్స్‌ట్రాగాటాబ్‌లెట్స్‌కి, కాఫీకి ఖర్చు! అంతా తడిసి మోపెడవుతుంది! అంచేత సినిమాకి వెళ్ళకపోవడంలో ఎంతో సుఖం వుంది. దానిబదులు మరొక ఎంజాయ్‌మెంట్‌ని సృష్టించుకోవటం ఎంతో బెటర్...ఏమంటారు?"

శైలజ చిరునవ్వుతో వూరుకుంది.

"కానీ ఒకటి! ప్రస్తుతం ఎంతోమందికి గాలి, నీరు, ఆహారంలా బతకటానికి సినిమా కూడా ప్రాణావసరం అయిపోయింది. అందుకే ఏ థియేటర్‌దగ్గిర చూసినా ఎటువంటి చెత్త సినిమాకి కూడా జనం విరగబడుతున్నారు"

ఆమె మౌనంగా అతను చెప్పేది వింటోంది.

"శైలజా!" అతని కంఠంలో ఆకస్మికంగా ప్రవేశించిన మార్పును శైలజ గమనించింది.

"మా కుటుంబంలో మొదటి సంతానం నేనే. నాన్నగారు వ్యవసాయం, ఉద్యోగం లాంటి వ్యాపకాలేమీ పెట్టుకోకుండా, తాతగారినుంచి వారసత్వంగా వచ్చిన పొలాన్ని అవసరాలకి అమ్ముకుంటూ కాలం గడిపేవారు. అలా మొత్తం ఆస్తి, మేము-అంటే నా ఇద్దరుచెల్లెళ్ళు, ఆఖరివాడయిన తమ్ముడు పెరిగేప్పటికిహరించుకుపోయింది.అప్పటికి డిగ్రీ పూర్తిచేసిన నాకు, ఉద్యోగంచేసి ఇంటి బాధ్యతను చేపట్టే అవసరం ఏర్పడింది. మొదట్లో ఒక ప్రైవేట్ కంపెనీలో కొన్నాళ్ళు పనిచేశాను. తర్వాత టెస్ట్‌లవీ పాసయి బాంక్‌లో వుద్యోగం సంపాదించాను. పెద్దకొడుకునవడంతో చెల్లెళ్ళకు పెళ్ళిచేసి, తమ్ముడికి చదువు చెప్పించే బాధ్యత నాదే. ఒక చెల్లాయికి పెళ్ళి అయిపోయింది. తమ్ముడి డిగ్రీ మరో సంవత్సరానికి పూర్తయిపోతుంది. ఈలోపే ఇంకో చెల్లాయికి కూడా సంబంధం చూసేసి పెళ్ళి చేసేస్తే, ఇక నాకు ఏ బాధ్యతా లేనట్టే. హాయిగా స్వేచ్ఛావాయువులు పీల్చుకుంటూ...''

అతను ఆపేసి, తనకు సడెన్‌గా గుర్తొచ్చినట్టు, "సొంత విషయాలు చెప్పి బోర్‌కొడుతున్నానా?" అన్నాడు.

అతను ఎందుకు చెబుతున్నాడో అర్థం కాకున్నా, యథాలాపంగా వింటూండి

పోయిన శైలజ "ఊహూ..లేదు''అంది, మొహమాటంగా నవ్వేస్తూ.

''నాకో కార్టూన్ గుర్తొస్తోంది. భార్య ఏవేవో చెప్పేస్తూ, మధ్యలో 'ఏం బోరు కొడుతున్నానాండీ?' అంటుంది. దానికి భర్త 'అబ్బెబ్బెబ్బే...లేల్లేదు. నేనసలు వింటంలే!' అంటాడు. అలాగ?" అన్నాడు బలరాం, ఆమెకేసి నవ్వుతూ చూస్తూ.

అతని వుద్దేశం అర్థమై, "అబ్బే... అదేంకాదులెండి. అయినా నేను పూర్తిగా విన్నట్టు ఎలా నిరూపించుకోమంటారు?'' అంది చిరునవ్వుతో.

''అరె! ఇంత అల్ప విషయానికి రుజువులూ, నిరూపణలూ ఎందుకండీ? నేను ఆ కార్టూన్ సంగతి సరదాకి చెప్పానంతే!" అని కొద్దిసేపు ఆగి, ''కొందరికి మనకు సంబంధించిందంతా రహస్యం లేకుండా చెప్పుకోవాలనిపిస్తుంది. మనకు అత్యంత సన్నిహితులని తోచినవారికే ఆవిధంగాచెప్పుకోబుద్ధవుతుంది"అన్నాడు

ఒక లిప్తపాటు శైలజ భృకుటి ముడి పడింది.

అతను చెప్పింది ఆమెకు అర్థమయీ కానట్టు అస్పష్టంగా వుండిపోయింది.

ఇంతలో ఇంటిదగ్గరికి వచ్చేయటంతో ఆమె ఆలోచనలను విరమించేసింది.

''ఇక వుంటానండి'' అంది.

బలరాం సైకిల్ హేండిల్‌నుంచి సంచీని తీసి అందిస్తే తీసుకుంది.

''నేను వెళ్తా" అన్నాడతను.

"చాలా థాంక్స్'' చెప్పింది శైలజ.

''దీనికేముందండీ?''

అతను వెళ్ళబోయినవాడే ఆగి, ''శంకర్రావు వచ్చాడంటారా?''అన్నాడు.

"ఏమో... రాకపోవచ్చు! అయినా చూస్తానుండండి" అంటూ లోపలికి వెళ్ళబోయింది.

"అక్కరలేదులెండి.. నేను వెళ్తాను" సైకిల్‌పై కూర్చుని అన్నాడు బలరాం.

"సరే" అని ఇంట్లోకి నడిచిందామె.




అతడి చేయి ప్రఫుల్ల చేతిలోని నవలను లాగి విసురుగా టీపాయ్‌మీదకు గిరాటేసింది.

ప్రఫుల్ల మొదట చిరాకుపడింది. మరుక్షణం చిరునవ్వుతో "ఏమిటి బ్రదర్?" అంది శ్రీనివాస్‌ని చూస్తూ.

"బోర్" అన్నాడతను.

"అయితే నన్ను బోర్ కొడదామనా?" అంది ప్రఫుల్ల.

"ఎవరికీ బోర్ లేకుండా బైటకు పోదాం!"

"ఎక్కడికి?"

"ఏదైనా మూవీకి!"

"ఏమున్నాయ్?"

"లారెల్ హార్డీలది ఏదో వున్నట్టుంది"

"అయితే పద" అని ఉత్సాహంగా లేచిందామె.

పది నిమిషాల్లో ఇద్దరూ కారులో వున్నారు.

శ్రీనివాస్ డ్రైవ్ చేస్తున్నాడు.

కారు లిబర్టీని దాటి నారాయణగూడా

వైపు సాగుతూండగా-

"మీ శైలజ వాళ్లుండేది హిమాయత్ నగర్‌లో అన్నావ్ కదూ?" అన్నాడు శ్రీనివాస్.

"అవును.. అయితే?" ప్రఫుల్ల అర్థం కానట్టు చూసింది.

"మన ప్రోగ్రామ్‌లో ఓ మార్పు చేద్దామా?"

"సినిమా కేన్సిల్ అనకుండా ఏం చెప్పినా అయామ్ రెడీ!"

"సినిమా ఎందుకు వద్దంటాను?"

"మరి ఏమిటి చెప్పు"

"సినిమాకు మనతోపాటు మీ శైలజను కూడా పిలిస్తే?"

ప్రఫుల్ల అతనికేసి అర్థవంతంగాచూసి "ష్యూర్!" అని, "అరె! నాకా ఆలోచనే తట్టలేదు. అయితే కారును ఇలా పోనియ్యి!" అంటూ డైరెక్షన్స్ చెప్ప సాగింది.

* * *

"హాయ్..శైలూ!" పడకకుర్చీలోవాలి కూర్చుని శరత్ నవల చదువుతున్న శైలజ తలఎత్తి చూసింది.

గుమ్మం దగ్గిర ప్రఫుల్ల. వెనుక శ్రీనివాస్!

శైలజ విభ్రాంతిగా చూసింది. ఆహ్వాన పూర్వకంగా నవ్వుతూ చప్పునలేచి నిలబడింది.

"రండి... రండి"

ప్రఫుల్లవచ్చి అక్కడ మంచంమీద కూర్చుంది.

"కూర్చోండి"

కుర్చీని శ్రీనివాస్ వైపుకి జరుపుతూ అంది శైలజ.

ముస్తాబులో లేకపోయినా ఆమె ముఖంలో చెరిగిపోని ఆకర్షణను నిర్నిమేషనేత్రుడై చూస్తున్నాడుశ్రీనివాస్.

ఆమె మాటకు తేరుకుని కుర్చీలో కూర్చుని శైలజ అంతవరకూ చదువుతున్న నవలను చేతిలోకి తీసుకున్నాడు.

"మీ ఆడవిలన్ ఏది?"

ప్రఫుల్ల ప్రశ్న భాగ్యాన్ని వుద్దేశించి అని అర్థంచేసుకుంది శైలజ.

"ఛ... పూర్కో" కసిరి, "ఎవరో వడియాలు పెట్టుకుంటూ సహాయంకోసం పిలిస్తే వెళ్లింది" అని చెప్పింది.

"మేం సినిమాప్రోగ్రాంమీద వచ్చాం. సినిమాకని బైలుదేరి వస్తుంటే వాసు చీఫ్ గెస్ట్‌గా నిన్ను ప్రపోజ్ చేశాడు. తయారవు... పోదాం!" అంది ప్రఫుల్ల.

శైలజ అతనికేసి "అవునా?" అన్నట్టు చూసింది.

ఆమెకేసే చూస్తున్న శ్రీనివాస్ ముఖంలో ఏవో అస్పష్టమైన భావాలు! చప్పున చూపులు మరల్చుకుని చేతిలోని పుస్తకంమీదకు దృష్టి సారించాడు.

ఇష్టంలో ఓ గమత్ వుంది. ఎదుటి వ్యక్తులు తమని ఇష్టపడుతున్నారన్న ఫీలింగ్ ఎవరికైనా వెంటనే ఆ ఎదుటి వ్యక్తిపై ఇష్టం కలిగేట్టు చేస్తుంది. మునుపే ఆ ఇష్టం వున్న పక్షంలో అది విస్తరించటం జరుగుతుంది.

ఆలోచనల్లో వున్న శైలజతో "ఏమిటి?" అంది ప్రఫుల్ల, తక్షణమే బైలుదేరమని హెచ్చరిస్తున్నట్టు.

"ఇప్పుడా?" సందేహంగా చూసింది శైలజ.

"ఏం... నాలాంటివాళ్లఅలంకరణకైతే ప్రోగ్రామ్‌కి ఒకరోజు ముందుగా ఎనౌన్స్ చెయ్యాలి గాని, నీ ముస్తాబుకి పది నిముషాలు కూడా పట్టదని నాకు తెల్సులే.ఊఁఊఁ...మేం ఇలా కూచుంటాం.

నువ్వు రెడీ అయి వచ్చెయ్!" ప్రఫుల్ల త్వరపెట్టింది.

''అయితే, ముందు మీకు టీ తయారు చేసి ఇస్తానుండండి''

"అబ్బబ్బా! టీకి హోటల్‌కి వెళ్ళొచ్చు కానీ నువ్వు ముందు తయారవు" ప్రఫుల్ల విసుక్కుంది.

"మీ అన్నయ్యగారు మా ఇంటికి రావటం ఇదే ప్రథమం! టీ ఇవ్వకుంటే ఎలా? నాకు ఆతిథ్యం తెలియదని అనుకోరూ?''

శ్రీనివాస్ ఏం మాట్లాడకుండా నవ్వు ముఖంతో చూస్తున్నాడు.

ప్రఫుల్ల ఎడమ అరచేయి వెనుక భాగంతో నుదురు కొట్టుకుని, కుడిచేత్తో శైలజని వెళ్ళమన్నట్టు సూచించింది.

శైలజ నవ్వుకుంటూ వంటగదిలోకి నడిచింది. టీ తయారు చేసి రెండు మగ్గుల్లో తెచ్చి ప్రఫుల్లకి, శ్రీనివాస్‌కి అందించిందామె.

సిప్‌చేసి తలెత్తాడు శ్రీనివాస్.

"ప్రఫుల్లా! నీవల్ల ఈరోజు ఒక మంచి అవకాశాన్ని మిస్సయ్యేవాడిని తెలుసా?" అన్నాడు.

"ఏమిటి బ్రదర్?"

"ఇంత రుచిగల టీ తాగే ఛాన్స్ పోయేది"

"నిజం!?" నవ్వింది ప్రఫుల్ల.

శైలజ మందహాసంతో చూస్తోంది.

శ్రీనివాస్ ఆమెకేసిచూస్తూ అన్నాడు–

"నిజమండీ శైలజా! ఇంత రుచిగల టీ ఇంతవరకూ తాగలేదు. అందుకే ఇప్పుడు 'టీ ఇంత రుచిగా వుంటుందా?' అన్న అనుమానం వస్తోంది"

అతని పొగడ్తకి ఇబ్బందిగా కదిలింది శైలజ.

"అంతే అన్నయ్యా! శైలజ ఏ వంట చేసినా దానికి ఎక్కడ లేనిరుచి, ఏ పని చేసినా దానికి కొత్త అందం ఇట్టే వచ్చేస్తాయి"

"ప్రఫూ... ఇక పొగడ్తలు చాలు! ఇప్పటికే లావుగా వున్నానని అందరూ గోలపెడుతున్నారు" అంది శైలజ, కంఠంలో ఆమె మాటలకి అయిష్టత ప్రకటిస్తూ.

"మీరు లావా?" నవ్వాడు శ్రీనివాస్.

"అన్నవాళ్ల కళ్లకి దృష్టి లోపం ఏదో వుండొచ్చు. నాకు మిమ్మల్ని చూస్తుంటే, ఆ బ్రహ్మదేవుడు మంచి మూడ్‌లో వున్నప్పుడు మిమ్మల్ని ప్రత్యేక శ్రద్ధతో తయారుచెయ్యలేదు గదా అన్పిస్తుంది"

అనేశాక శ్రీనివాస్‌కి తన పొరపాటు గ్రహింపుకి వచ్చింది.

'అతిగా మాట్లాడేశానేమో!' అనుకుని నాలుక కరుచుకున్నాడు.

సందేహంగా శైలజ ముఖంకేసి చూశాడు. సిగ్గుతో ఆమె బుగ్గలు కెంపు రంగులోకి మారటం గమనించాక ఆ బెరుకు తగ్గింది.

"వస్తా ప్రఫూ!'' ప్రఫుల్లతో అని చప్పున లోపలకి వెళ్ళిపోయింది శైలజ.

అంతవరకూ ఆసక్తిగా ఆమె ముఖ కవళికల్ని గమనించిన ప్రఫుల్ల, శ్రీనివాస్ కేసి ముఖం తిప్పింది.

అతను తన ముఖంలోని భావాలు తెలియనీయరాదన్నట్టు తల వంచుకుని టీ సిప్ చేయసాగాడు.

'వీళ్లలో పరస్పరం ప్రేమలాంటిది కలుగలేదు కదా!' ప్రఫుల్ల మనసులో చోటుచేసుకుంది చిన్న అనుమానం!

అకస్మాత్తుగా ఆమె మనోనేత్రంతో





శ్రీనివాస్, శైలజలను ఒకరి పక్కన ఒకరు నిలుచున్న జంటగా దర్శించింది. అది ఆమె మనసుకు రమణీయమైన దృశ్యంగా తోచింది.

శైలజ వాసుకి భార్య అయితే?

దుస్తులు మార్చి, ముస్తాబుతో తన అందానికి మరింత మెరుగు దిద్దుకుని గదిలో ప్రత్యక్షమైన శైలజని రెప్ప వెయ్యటం కూడా మరచి చూశాడు శ్రీనివాస్.

''ఇక వెళ్దాం'' అన్న ప్రఫుల్ల మాటకు అయిష్టంగా లేచాడు!

* * *

థియేటరులో శైలజ, ఆమె పక్కనే ప్రఫుల్ల, తర్వాత శ్రీనివాస్ కూర్చున్నారు.

తెరపై ఎడ్వర్టైజ్‌మెంట్ షార్ట్స్ నడుస్తున్నాయి.

''అబ్బ.... నాకు ఈ జిరాఫీ తల అడ్డువస్తోంది'' ముందు కూర్చున్న బట్టబుర్రను చూసి అంది ప్రఫుల్ల.

శైలజ చిన్నగా నవ్వి వూరుకుంది.

ముందు సీట్లో వున్నతను అది విన్నాడేమో, తల దించుకున్నాడు.

కాని, కాసేపటికి తిరిగి యథాప్రకారంగా వచ్చేసిందా తల.

ప్రఫుల్ల మళ్ళీ విసుక్కుంది.

"ప్చ్" ఆ నడివయసు వ్యక్తి ఆ మాటలు విని విసుక్కున్నట్టుగా ఓసారి వెనక్కు చూసి తల తిప్పుకున్నాడు.

''అరె!'' అంటోంది ప్రఫుల్ల.

''పెద్దాయనతో గొడవెందుకుగానీ, మనం సీటు మారదాం ప్రఫూ'' అన్నాడు శ్రీనివాస్ తగ్గు స్వరంతో.

''అవునూ..పక్కనే ఆజానుబాహుడివి నువ్వున్నావనే మర్చిపోయాను. నీకు కనబడకపోవడం వుండదుగా! సరే... కూర్చో'' అని నవ్వుతూ లేచింది ప్రఫుల్ల.

ఇద్దరూ సీట్లు మారి కూర్చున్నారు.

శైలజ పక్కసీటులో కూర్చున్న శ్రీనివాస్ కుర్చీమీద చెయ్యి ఆన్చబోయి ఆమె చేయి తగలడంతో ''అయాయ్ సారీ'' అంటూ చప్పున అక్కడినుంచి చేయి తీసేశాడు.

శైలజ కూడా చేయి తీసి ''మీరు ఆన్చుకోండి'' అంది.

"ఊహూ.. లేడీస్ ఫస్ట్. అది మీకే" అన్నాడు శ్రీనివాస్.

కాని, ఆమె ఆ చేత్తో రెండో చేయి మోచేతి వద్ద పట్టుకుని కూర్చుంది.

చివరికి ఆ కుర్చీ చేయి ఖాళీగా ఉండిపోయింది.

సినిమా ప్రారంభమైంది!

సినిమా నడుస్తుంటే థియేటర్ లాఫ్ పెరేడ్ తీరునే వుంది.

నవ్వుల జల్లులు తెరలు తెరలుగా కురిశాయి.

లారెల్ హార్డీలు చేసిన తమాషాలకి థియేటర్ నవ్వులతో మార్మోగిపోయింది.

లాఫ్ పెరేడ్ అయ్యాక ఇంటర్వెల్!

"లెటజ్ హేవ్ ఏ కప్ ఆఫ్ కాఫీ" అన్నాడు శ్రీనివాస్.

ముగ్గురూ లేచి థియేటరులోంచి బయటకు వచ్చారు.

శైలజ, ప్రఫుల్ల ఒక పక్కన నిలుచుంటే శ్రీనివాస్ కాఫీ స్టాల్ దగ్గరికి వెళ్ళాడు. నురగలు తేలిన కాఫీ కప్పులతో తిరిగొచ్చాడు.

సినిమా గురించి మాట్లాడుకుంటూ కాఫీ తాగేశారు.

ఇక థియేటరులోకి నడుద్దామను

కుంటుండగా—

"హాయ్ వాసూ"

నాగరీకంగా అలంకరించుకున్న ఒక యువతి-వెంట అటువంటి తరహా అమ్మాయిలు మరో ముగ్గురు అనుసరిస్తుండగా, వచ్చి శ్రీనివాస్‌ని పలకరించింది.

శ్రీనివాస్ ఉత్సాహంగా "హలో" అన్నాడు.

"నేను కనపడలేదా సుధా?"

ప్రఫుల్ల ఆ యువతి చేతులు పట్టుకుని అంది.

"అదేం మాటా? నీకే మేము కనబడటం మానేశాము"

ప్రఫుల్లకు బదులిస్తూ శైలజకేసి ముఖం చిట్లిస్తూ చూసింది సుధ.

శైలజతోటి స్నేహం ప్రారంభమయాక, ప్రఫుల్లకు ఆమెతోటిదే లోకమయింది. శైలజ వ్యక్తిత్వం, ఆమెలోని ఆకర్షణ అలాంటివి!

సుధ నిష్ఠూరాన్ని పట్టించుకోకుండా శైలజను తీసుకుని, వారికి కొంచెం దూరంగా వచ్చేసింది ప్రఫుల్ల.

శ్రీనివాస్‌తో కబుర్లలో పడింది సుధ.

ప్రఫుల్ల శైలజతో, "నీకు తెలీదుకదూ.. సుధ మా వాసుకి కాబోయే భార్య" అంది.

శైలజ ముఖం వివర్ణమయింది.

'శ్రీనివాస్‌కి మరొకరితో పెళ్ళి నిశ్చయమైపోయిందా?'

శైలజకి చేదు తిన్నట్టుగా వుంది.

శ్రీనివాస్ కేసి చూసిందామె.

అతను నవ్వు ముఖంతో, సుధతో ఉత్సాహంగా మాట్లాడుతున్నాడు.

"కాబోయే భార్య కదూ?"



బాధగా అనుకుంది.

'అయినా అతనికి పెళ్ళి నిశ్చయమైతే తను బాధపడటమేమిటి?'

తను అతన్ని కోరుకుంటోందా? తనకు తెలీకుండానే అర్హతకు మించి ఆశిస్తోందా?

మనసును మందలించుకుంది.

ప్రఫుల్ల ఆమె ముఖంలో మారిస

భావాలను గమనించి అనుకుంది. 'నిజమే! తను అనుకున్నట్లుగానే శైలజ వాసుని ప్రేమిస్తోంది! అని. ఆ విషయం రూఢి పర్చుకునేందుకే అలా అబద్ధం చెప్పింది ఆమె!

బెల్ మోగడంతో అందరూ లోపలికి నడిచారు. సుధ స్నేహితురాళ్ళతో తమ సీట్లవైపు వెళ్ళిపోయింది.

ఈసారి ముందుగా ప్రఫుల్ల, పక్కన శైలజ, ఆమె తర్వాత శ్రీనివాస్ కూర్చున్నారు. ముందు సీటు నడివయసు వ్యక్తి మరోచోటికి మారిపోయినట్లున్నాడు. లారెల్ హార్డీల జంటదే మరో సినిమా 'హెల్ప్‌మేట్స్' మొదలయింది.

"ఇందాక నేను చెప్పింది అబద్ధం. సుధ మా అన్నయ్యకి ఫియాన్సీ ఏమీ కాదు"

ప్రఫుల్ల శైలజ చెవిలో నెమ్మదిగా అంది.

అంటూ ఆ మసక వెలుతురులో శైలజ ముఖంలో మారిన భావాలను గమనించేందుకు ప్రయత్నించి విఫలురాలయింది.



— 4

పేవ్‌మెంట్ మీద చకచకా నడుస్తూ వెళుతున్న శైలజను చూసి చేతిలోని సిగరెట్ బైటకు విసిరేసి కారు ఆపాడు శ్రీనివాస్.

"హలో!"

శైలజ ఆగి చూసింది. ఆమె ముఖంలో చిరునవ్వు చోటు చేసుకుంది.

"హలో" అంది చిన్నగా.

"ఇంటికేనా?" అన్నాడు శ్రీనివాస్.

"అవును" అన్నట్టు తల వూపింది.

"కారెక్కండి...నేను డ్రాప్‌చేస్తాను"

"మీకెందుకు శ్రమ?"

తన అభ్యర్థనను తోసిపుచ్చుతున్నందుకు మరోలా భావిస్తాడేమోనని, నవ్వు ముఖంతో అంది శైలజ.

"ఫర్లేదు.దీంట్లో శ్రమ ప్రసక్తిలేదన్న విషయం మీకు తెలియదనుకోను"

"లేదు...నేను వెళ్ళగలను"

అతను ఒక నిముషం మాట రానట్టు చూశాడు.

"మీకిష్టం లేకపోతే డైరెక్ట్‌గా చెప్పెయ్యొచ్చుగా? అన్నాడు నిష్ఠూరంగా.

శైలజ కొద్దిగా చలించింది- అతని ముఖంలోని ఎర్రదనానికి, కంఠంలో బాధతో కూడిన నిష్ఠూరానికి.

"అనవసరంగా మీరు అపార్థం చేసుకుంటున్నారు"

సౌమ్యపూర్వకంగా నవ్వుతూ అంది.

"అందుకే కారెక్కండి"

అతను తననలా వదలి వెళ్ళడని అర్థమైపోయింది శైలజకి.

ఇంక తర్కించదల్చుకోలేదు.

పేవ్‌మెంట్ దిగి కారువైపు నడిచింది.

శ్రీనివాస్ సీటుమీద జరిగి డోర్ తెరిచాడు. ఆమె కారులో కూర్చుని డోర్ వేశాక కారు ముందుకు పోనిచ్చాడు.

"ఏమిటి...నడిచి వెళ్తున్నారు?"

రోడ్డుమీద దృష్టిని నిలిపి కారును డ్రైవ్‌చేస్తూ అడిగాడు శ్రీనివాస్.

ఆశించినంత త్వరగా జవాబు రాక పోవడంతో ఆమెవైపు చూశాడు.





"ఇబ్బందికరమైన ప్రశ్న వేశానా?" అంటూ తిరిగి రోడ్ మీదకి దృష్టిని మరల్చాడు.

"ఊహూఁ" అంది శైలజ నెమ్మదిగా.

"మరి సమాధానం చెప్పేందుకు ఆలోచిస్తున్నారే?"

"మీ ప్రశ్నకు రెండు సమాధానాలున్నాయి.వాటిలో ఏది చెబుదామా అని"

"రెండూ చెప్పండి"

"నిజం చెప్పాలంటే, నేను నడిచివెళ్ళున్నది పొదుపు చెయ్యాలన్న ఉద్దేశంతో"

"అబద్ధమైతే?''

అతని ముఖంలో ఆసక్తి కదలాడింది.

"దగ్గరే కదా అని నడిచివెళ్తున్నా - అని చెప్పి వుండేదాన్ని!"

''ఇంత యదార్థంగా మాట్లాడటం ఈ కాలంలో తగదు"

అతను నవ్వుతూ, హెచ్చరిస్తున్నట్టుగా అన్నాడు.

"సన్నిహితుల దగ్గర కూడా నిజం దాచటం దేనికి?"

"అంటే...?" అర్థోక్తిలోనే ఆపేసి,

"థేంక్స్!'' అన్నాడు శ్రీనివాస్,

"ఎందుకు?'' అంది శైలజ, అతని కృతజ్ఞతలకు కారణం బోధపడక.

"నన్ను మీకు సన్నిహితుడిగా భావించినందుకు''

అతని పట్ల తనకుగల ఇష్టాన్ని మాటల్లోనే అనుకోకుండా వెల్లడి చేసిందా?

శైలజ బిడియంగా తలవంచుకుంది.

"కొందరితో పరిచయం మామూలుగా వుండిపోతే బాగుండదు. అది పెరిగి పెరిగి మనసులు పూర్తిగా ఏకమైపోతే బాగుండునన్పిస్తుంది. జీవితంలో మనకు తారసపడే చాలా కొద్దిమందితో...'' చెబుతున్నాడు శ్రీనివాస్.

"ఇంక ఆపుతారా?'' అంది శైలజ వీధి మొదట్లోనే దిగిపోదలచి.

శ్రీనివాస్ ఖంగుతిన్నాడు.

'ఏమిటి ఇంత నిర్మొహమాటంగా అంది?'

దెబ్బతిన్నట్లుగా చూశాడు.

అతని చూపుల్ని అర్థంచేసుకుంది శైలజ.

"సారీ!నేను ఆపమంది కారుని"అంది.

అతను తేరుకున్నాడు.

ముఖంలోకి నవ్వు తెచ్చుకొని, బ్రేక్ నొక్కాడు. శైలజ కారు దిగి డోర్ వేసింది.

"చాలా థేంక్స్."

''వెల్‌కమ్!"అన్నాడు నవ్వుతూ.

''ఇక వుంటాను"

''ఓకే.. సీయూ!''

అక్కడినుంచి కదిలి ఇంటివైపు నడక సాగించింది శైలజ.

పిరుదుల మీద లయగా, నాట్యంచేస్తున్నట్టు కదుల్తూంది పొడుగాటి జడ!

'ఏమిటి... ఈ శైలజలోని ఆకర్షణ!'

కారు రివర్స్ చేస్తూ అనుకున్నాడు శ్రీనివాస్.

* * *

''నీ ఫ్రెండ్ శైలజకి గర్వం ఎక్కువను కుంటా!"

సాయం సమయాన లాన్‌లో కుర్చీలలో కూర్చుని,టీ తాగుతుండగా అన్నాడు శ్రీనివాస్, ప్రఫుల్లతో.

శైలజ మనస్తత్వం గురించి ప్రఫుల్ల ద్వారా తెల్సుకుందామని అతని వుద్దేశం.

క్లోజ్ ఫ్రెండ్ కాబట్టి ఆమెను గురించి ప్రఫుల్ల వివరంగా చెప్పగలదు.

కాని,''ఏం....అలా ఎందుకనుకుంటున్నావ్?'' అని ఎదురు ప్రశ్న వేసింది

ప్రఫుల్ల.

"పొద్దున్న కారులో నేనొక ఫ్రెండ్ దగ్గరికి వెళ్తుంటే పేవ్‌మెంట్ మీద నడుస్తూ కనపడింది. ఇంటివరకూ డ్రాప్ చేస్తానంటే, కారు ఎక్కేందుకు చాలా బెట్టుచేసింది''

"దాన్ని గర్వమని ఎందుకనుకోవాలి? ఆత్మాభిమానమని ఎందుకనుకోగూడదు?"

"........"

ప్రఫుల్ల ప్రశ్నకు సమాధానం చెప్పలేక శ్రీనివాస్ మౌనం వహించాడు.

''అయితే శైలజనలా వదిలేసి వెళ్ళిపోయావా?'' అంది ప్రఫుల్ల తిరిగి.

''లేదు'' అంటూ, శైలజ కారు ఎక్కేంతవరకూ ఆమెకూ, తనకూ మధ్య జరిగిన సంభాషణ చెప్పాడు శ్రీనివాస్.

"తను అంతే అన్నయ్యా. నా సహాయాన్ని నిరాకరించిన సందర్భాలూ వున్నాయి"

ప్రఫుల్ల నిట్టూర్చి చెప్పసాగింది.

"బియ్యే పాసయింది కదా! అసలయితే ఫస్ట్‌క్లాస్ రావలసిందే. పరీక్షలకు ముందు పదిహేనురోజులు జ్వరంతో పడకేయడంతో క్లాస్ తప్పిపోయింది. ఆర్థిక ఇబ్బందుల కారణంగా నాతోపాటు పోస్ట్‌గ్రాడ్యుయేషన్‌కి రాలేకపోయింది.

డాడీకి ఇంత ఇన్‌ఫ్లూయెన్స్ వుంది కదా! ఆయనద్వారా ఏదో ఒక వుద్యోగం వచ్చేట్లు చూస్తానంటే ఒప్పుకోదు.

"ప్రఫూ! నీ స్నేహాన్ని ఇలా నా స్వలాభానికి వాడుకోవడం ఇష్టంలేదు" అంటుంది.

"ఆ భావంతో నువ్వడగటంవల్ల కాదుగా నేను చేస్తున్నది! నీ మీద ప్రేమతో" అంటే విన్పించుకోదే...

"ఏమో ప్రఫూ..మీ నాన్నగారి ద్వారా ఉద్యోగంవస్తే నేనుమాత్రం నీ దగ్గర మామూలుగా మసలలేను. మన స్నేహం ఇలా స్వచ్ఛంగా వుండాలనుకుంటే నువ్వు మాత్రం ఇటువంటి సహాయాలుచేసేందుకు ప్రయత్నించవద్దు" అంటుంది.

పోనీ ఇంటిపరిస్థితులు ఏమన్నా అనుకూలంగా, బాగున్నాయా అంటే అదీలేదు.

తనకు తల్లిదండ్రులు లేరు. వాళ్ల అక్క పరమ గయ్యాళి. తనను రాచి రంపాన పెడుతుంది.

పాపం శైలజకి పెళ్ళయేంతవరకూ తప్పవేమో ఈ కష్టాలు? ఆ పెళ్ళికూడా ఎటువంటి వ్యక్తితో జరుగుతుందో!" బాధగా అంది ప్రఫుల్ల.

శ్రీనివాస్ మౌనంగా విన్నాడు.

అతని మనసులో శైలజపట్ల జాలి కల్గింది. కాసేపాగి—

"అవునూ, ప్రఫూ! నీకు ఫ్రెండ్స్‌గా ఎవరూ అట్టే నచ్చరుకదా! శైలజతో ఈ ప్రాణస్నేహం ఏమిటి?" అన్నాడు.

"అదంతా నీకెందుకు?" అంది ప్రఫుల్ల కొట్టిపారేస్తూ.



## 5

బ్యూటీపార్లర్ లోంచి బైటకొచ్చారు ప్రఫుల్ల, ఆమెతో శైలజ!

"నేనే నీ అంత అందగత్తెనైతేనా? అందంకోసం ఈ బ్యూటీ పార్లర్లకు తిరిగే





అవస్థ తప్పేది కదా" అంది ప్రఫుల్ల నిట్టూరుస్తూ.

"ఇప్పుడు నీ అందానికి ఎవరు వంక పెట్టారని? ఇలా అలంకరణకోసం బ్యూటీ పార్లర్లకి తిరుగుతూ, తోడురమ్మని నా టైమ్ వ్యర్థంచేయడంతప్ప!" శైలజ విసుక్కొంటున్నట్టు అంది.

"భలే అన్నావులే!నాతో రావడం నీకు టైం వేస్టన్నమాట....అవునా" ప్రఫుల్ల నిష్ఠూరంవేసింది. ఆమెకు వ్యతిరేకంగా ఏ చిన్నమాట మాట్లాడినా చాలు. అంతే! ప్రఫుల్ల ఆవిధమైన నిష్ఠూరపు మాటలు ప్రారంభిస్తుంది.

"అదికాదు నేననేది.."ఆమె ఉక్రోషం తెలిసిన శైలజ నచ్చజెప్పబోయింది.

"అర్థమైందిలే! ఇంకేమీ చెప్పనక్కర లేదు" అంటూ ప్రఫుల్ల ఆటోకోసం చూడసాగింది.

ఇంతలో స్పీడుగా పోతున్న ఓ మోటార్ సైకిల్ వాళ్లిద్దరూ నిలబడ్డ పేవ్ మెంట్ పక్కకు వచ్చి ఆగింది. దాన్ని నడుపుతున్న వ్యక్తిని చూడగానే ప్రఫుల్ల సంతోషాతిరేకంతో కేక పెట్టినట్టు 'హాయ్...శంకూ' అంది.

'హాయ్!' అన్నాడతను చిన్నగా నవ్వుతూ.

వెంటనే-

"నా ఫ్రెండ్ శైలజ" చెప్పిందతనికి.

శైలజ నమస్కారంచేస్తూ చూసింది అతన్ని.

నలుపు, ఎరుపు చెక్స్ ఫుల్ స్లీవ్స్ షర్టుని, నీలిరంగు జీన్స్‌లోకి నిర్లక్ష్యంగా టక్‌చేశాడు. చొక్కా చేతులు మోచేతి కిందివరకూ మడత పెట్టాడు.

కొద్దిగా పెరిగిన గడ్డం!

శైలజకి చూడగానే అతనంటే మంచి భావం కలగలేదు. అయినా ఏ వ్యక్తినైనా చూసిన వెంటనే ఓ అభిప్రాయానికి రావడం సరైనపద్ధతి కాదని మనసుకి చెప్పుకుంది.

"శైలూ...దీసీజ్ భవానీశంకర్!" చెప్పింది ప్రఫుల్ల.

అతను ప్రతినమస్కారం చేస్తూ ఆ కొద్దిసేపటిలోనే శైలజను ఆపాదమస్తకం చూశాడు. అరుదైన అందాన్ని చూసిన మైమరపు అతని కళ్లలో ప్రతిఫలించింది. గుండ్రటి ముఖంలో తీరైన కనుబొమలకు మధ్య కొద్దిగా పైన విశాల ఫాలభాగానికి శోభను కల్పిస్తూ గుండ్రంగా దిద్దుకున్న కుంకుమ! మనసులోని స్వచ్ఛతను తెలుపు తున్నట్టుగా మెరుస్తున్న విశాలమైన కనులు! కనుబొమలనుంచి ప్రారంభమై సూదిగాసాగిన నాసిక కింద ఎక్కుపెట్టిన విల్లులాంటి వొంపు కలిగిన గులాబీరంగు పెదవులు. పొందికగా, ఎత్తుకు తగిన సౌష్టవంతోవున్న తక్కిన శరీరానికీ, తలకూ మధ్య వారధిగా శంఖంలాంటి మెడ.

కుంకుమ రంగు చేనేత చీర,అదేరంగు బ్లౌజు ధరించిందామె!

తలంటుకున్న నొక్కుల జుత్తునుంచి విడివడి ఫాలభాగాన నర్తిస్తున్న ముంగురులు, ఆమె ముగ్ధమనోహరంగా నిలుచున్న తీరు అతన్ని 'ఎస్టానిషింగ్‌బ్యూటీ' అని విస్మయపడేట్టు చేశాయి.

అయితే అది ముఖంలో తెల్లియకుండా జాగ్రత్తపడ్డాడు.

"ఎక్కడికి వెళ్తున్నారు?" అన్నాడు ప్రఫుల్లకేసి తిరిగి.

"ఎక్కడినుంచి అని అడిగితే సరిగ్గా వుంటుంది" అంది ప్రఫుల్ల.

"సరే... ఎక్కడినుంచి వస్తున్నారు?" అన్నాడు భవానీశంకర్ నవ్వుతూ.

"ఇలాంటి చొప్పదంటు ప్రశ్నలు వేయడానికే కలిశావా ఏంటి?" అంది ప్రఫుల్ల దబాయిస్తూ.

"బుద్ధొచ్చింది. ఏమీ అడగను!" అతను నమస్కారం చేస్తున్నట్టుగా చేతులు కలిపాడు. "లెంపలుకూడా వేసుకోవాలా?"

"అదేమీ వద్దులే" ప్రఫుల్ల నవ్వేసింది.

వాళ్లు అలా చనువుగా వుండటంచూసి శైలజ విస్మయపడింది. చూస్తుంటే ఆమెకతను కొత్తగా పరిచయమైనవాడిలా లేడు. ఇంతకుముందే వారి పరిచయం ఓ స్థాయికి వచ్చినట్టుంది. కాని ప్రఫుల్ల తనదగ్గిర ఏమీ దాచదే! ఆమెకు కొత్తగా ఎవరు పరిచయమైనా తనకు చెప్పకోకుండా వుండదు.

అయినా అతని గురించి చెప్పలేదంటే- చెప్పడం అనవసరమనా?

అతను...?

"ఐస్‌క్రీమ్ తిందాం" అంది ప్రఫుల్ల.

ముగ్గురూ దగ్గిరేవున్న ఐస్‌క్రీమ్ పార్లర్ వేపు నడిచారు.

భవానీశంకర్ మోటార్‌సైకిల్ నడిపించుకుంటూ తెచ్చి పార్లర్‌బైట పార్క్ చేసి లోపలికి నడుస్తున్న శైలజ, ప్రఫుల్లలను అనుసరించాడు.

బేక్ వ్యూలో శైలజ... బ్లౌజుకీ, నాజూకుగావున్న చీరకట్టుకీ మధ్య ఆచ్ఛాదన లేని సన్నటి నడుముభాగం, పొడుగాటి జడ పిరుదులపైలయబద్ధంగాకదులుతూ...

ఆమె సౌందర్యం అతని మతి పోగొట్టింది.

ముగ్గురూ లోపలికెళ్ళి కూర్చున్నారు.

"మూడు కసటా''



బేరర్‌కి చెప్పింది ప్రఫుల్ల.

"ఏం కావాలని మమ్మల్ని అడిగే పనిలేదా?" అన్నాడు భవానీశంకర్.

"శైలజ గురించి నాకు తెలుసు. నా ఇష్టమే తన ఇష్టం. నీ ఇష్టం ఎలావున్నా నేను ఆర్డరిచ్చింది తినాల్సిందే!"

ప్రఫుల్ల గీరగా చెప్పింది.

"చిత్తం!" భుజాలెగరేశాడతను.

శైలజ నవ్వుకుంది వారి ధోరణికి.

బేరర్ తెచ్చిన ఐస్‌క్రీమ్ తింటుండగా-

"తర్వాత ప్రోగ్రామ్ ఏమిటి?" అన్నాడు భవానీశంకర్.

అతను శైలజను ఓరగా, ఆమె గమనించకుండా చూస్తున్నాడు. ఆమెతో ఇంకాసేపు గడపాలని వుంది. వీలు చేసుకుని మాట్లాడించాలని...కాని, ఆమె మౌనగంభీరంగా వుండటం చూసి వెనకాడుతున్నాడు.

"చెప్పు. నువ్వేమంటావో" అంది ప్రఫుల్ల.

"ప్రభాత్‌లో మంచి జేమ్స్‌బాండ్ పిక్చరుంది... చూద్దామా?"

"ఓకే" ఉత్సాహంగా చెప్పింది ప్రఫుల్ల.

"మీరూ సరేనాండీ?" శైలజను ఉద్దేశించి అన్నాడు భవానీశంకర్.

శైలజ వెంటనే జవాబు చెప్పడానికి సంశయించింది.

కొన్ని క్షణాల తర్వాత "సారీ! నేను రాలేను" అంది నెమ్మదిగా.

"అదేం?"

"నేనింటికి వెళ్ళిపోవాలి ప్రఫూ"

"సరే... వెళ్లు" ప్రఫుల్ల కోపంగా ముఖం చిట్లించింది.

"అన్యాయమండీ! మీరు నేను కలిశాక మాట్లాడిన మొదటిమాట నాకు వ్యతిరేకంగా వుండటం ఘోరం!"

భవానీశంకర్ నిష్ఠూరంగా అన్నాడు.

"అందుకే సారీ చెబుతున్నానుకదా!"

"మాకిష్టంలేని నిర్ణయం తీసుకుని సారీ అంటే సరిపోతుందా?"

"శైలూ... నేనడుగుతున్నాను! వస్తున్నావా? రావా?" ప్రఫుల్ల కల్పించుకుని విసుగ్గా అడిగింది.

ఆమె ఒకో సమయంలో వూరికే సహనం కోల్పోయి మాట్లాడుతుంది.

"కాస్త అర్థంచేసుకో ప్రఫూ! నేను ఇంటికెళ్ళడం తప్పదు" అంది శైలజ నవ్వే ప్రయత్నంచేస్తూ.

"సరే! సినిమాకి మనం ఇద్దరమే పోదాం శంకూ!" అంది ప్రఫుల్ల అతని వేపు తిరిగి.

ఆ క్షణంలో అతని ముఖంలో ప్రత్యక్షమై వెంటనే అదృశ్యమైన ఆశాభంగాన్ని ప్రఫుల్ల గమనించలేకపోయింది.

అతనికి చెప్పలేని నిరుత్సాహంగా అన్పించింది. తను ఆమె కోసం ఈ ప్రోగ్రామ్ పెట్టుకున్నాడు. కాని, ఆమె... 'ప్చ్' అని నిట్టూర్చాడు మనసులో.

ఐస్‌క్రీమ్ పార్లర్‌లోంచి బైటకి వచ్చారు.

"నిన్ను ఆటోలోపంపేసి వెళతాము" చెప్పింది ప్రఫుల్ల.

"ఫర్లేదు...నేను బస్‌లో వెళతాను. మీరు వెళ్ళండి. సినిమాకు టైమయిపోతుంది" అంటూ ఆమెను వారించింది శైలజ.

"ఏం శంకూ ?" ప్రఫుల్ల భవానీ శంకర్ మాటకోసం చూసింది.

"పద" అతను మోటార్‌సైకిల్ స్టార్ట్ చేశాడు మరోమాట లేకుండా.

ప్రఫుల్ల వెనక కూర్చుంది.

"ఓకే...సీయూ!"

ఇద్దరూ శైలజకి చెప్పారు.

"సీయూ!"

మోటార్‌సైకిల్ రివ్వున దూసుకుపోయింది.

శైలజ భుజం మీదినుంచి పైటను ముందుకు లాక్కుని కొంగును చేత్తో పట్టుకుని బస్ స్టాప్ వైపు అడుగులేసింది.



## 6

కిందికి వాలివున్న చెట్టు కొమ్మపై కాళ్ళు వూపుతూ కూర్చుని మునిపంటితో గరికపోచను కొరుకుతోంది ప్రఫుల్ల.

క్లిక్!

షెల్వార్ కమీజుల్లో వున్న ప్రఫుల్ల ఎడమ మోచేయి వద్ద హేండ్ బాగ్ పెట్టుకుని, కుడిచేతి మునివేళ్ళతో ముఖం మీదికి వాలుతున్న ముంగురులను సుతారంగా వెనక్కి నెట్టుతూ, కళ్లు కిందికి వాల్చుకుని మెట్లమీది నుంచి దిగుతోంది.

క్లిక్!

"ఈసారి ఫుల్‌కాదు...బస్ట్ సైజు" చెప్పింది ప్రఫుల్ల.

ఆమె తన కుంకుమరంగు చున్నీని కళ్ళకి కిందుగా, ముక్కును సగం కప్పేసేట్టు, ముఖానికి అడ్డుగా పట్టుకుంది.

"ముఖం కొంచెం పైకెత్తాలి" అన్నాడు భవానీశంకర్.

"తల కొద్దిగా కుడివైపు వాల్చు" అని సరిదిద్దాడు.



"కళ్లు అటు చూస్తుండాలి" డైరెక్షన్ చెప్పాడు.

కెమేరా వ్యూ ఫైండర్‌లోంచి చూస్తూ "ఓకే" అన్నాడు.

క్లిక్‌మనిపించాడు.

“కాసేపు రెస్ట్ తీసుకుందాం” అన్నాడు తర్వాత కెమేరాకు కవర్ పెట్టేస్తూ.

“అలాగే...శైలజకో స్నాప్ తీసేసి” అంది ప్రఫుల్ల.

“వద్దు...వద్దు” అంటోంది శైలజ.

“రండి” అన్నాడు భవానీశంకర్ వుత్సాహంగా.

అతనా అవకాశం కోసమే ఎదురు చూస్తున్నాడు-ఇలా బైలుదేరినప్పటినుంచీ శైలజను ఫొటో తీయాలని.

శైలజ.

“ఇందులో ఇష్టమేమిటోయ్! పోజు కొట్టకు” అంది ప్రఫుల్ల.

“అదే నేనంటున్నదీను! పోజు పెట్టడం నాకిష్టం లేదు” శైలజ హాస్యంగా అంటూ ఆ ప్రసక్తి నుంచి తప్పించుకోవాలని ప్రయత్నించింది.

“అయితే నాకిష్టమైన ఫోజు నేనే పెట్టిస్తానులే” అంటూ ఆమెను సమీపించింది ప్రఫుల్ల.

“ప్రఫూ! అనవసరంగా సీన్ క్రియేట్ చేయకు” అంది శైలజ దూరం జరుగుతూ.

“అదే నేనూ కోరుతున్నాను..ప్లీజ్”

అఖరున ‘ప్లీజ్’ అనేసి నోరు కట్టేస్తుంది. ఆ జబర్దస్తీ ప్రఫుల్లకు మొదటి



కాని, ఆమె ఫొటోలకి నిరాకరించినట్టు ప్రఫుల్ల చెప్పింది. తను బలవంత పెట్టి వప్పించేవాడేగానీ, తను అంతగా ఆమెపై ఆసక్తి కనబరిస్తే ప్రఫుల్ల ఎలా అర్థం చేసుకుంటుందోనని జంకాడు.

“ఊహూ....నాకిష్టం లేదు” చెప్పింది

నుంచీ అలవాటే!

శైలజ గత్యంతరంలేక తన వాదన మర్చిపోయింది.

భవానీశంకర్ ప్రేక్షకుడిలా చూస్తున్నాడు-ఆమె సౌందర్యాన్ని కెమేరాలో ఛాయాచిత్రంగా బంధించే క్షణం కోసం!

'శైలజ చెట్టుకు వయ్యారంగా ఆనుకుని నిలబడింది. ఆమె ధరించిన లేత పసిడి వన్నె చేనేత చీర పైట చెవులను కప్పుతూ కుడిభుజంమీదనుంచి ముందుకొచ్చి, చెంగు ఆమె ఎడమచేతిలో అలవోకగా చిక్కి వుంది.

అరమోడ్పులయిన కళ్ళతో, కుడిచేత్తో నాజూకుగా పట్టుకున్న ఎర్ర గులాబిపువ్వు చూస్తోందామె.

ఆమెకు డైరెక్షన్స్ చెప్పడం ముగించిన ప్రఫుల్ల, అంత దూరంలో నిలబడ్డ భవానీ శంకర్ పక్కకు వచ్చేస్తూ, ''ఓకే శంకూ! ఫుల్ ఫొటో" అంది.

అతను కెమేరాలో ఫోకస్ సరిచూసుకుంటూ చెప్పాడు.

''స్మైల్ ప్లీజ్!"

విడివడని శైలజ పెదవులపై ముగ్ధ మనోహరమైన చిరునవ్వు!

కెమేరా క్లిక్‌మంది.

"ఓకే..ఇక రెస్ట్!" చెప్పింది ప్రఫుల్ల.

ఒకచోట పచ్చికపై జంపఖానా పరుచుకుని కూర్చున్నారు.

ప్రఫుల్ల కేన్ బాస్కెట్‌లోంచి కారియర్లు తీసి గిన్నెలు విప్పుతోంది. శైలజ సహాయపడబోతే వద్దంది.

"ఏమేం తెచ్చావ్?" అడిగాడు భవానీ శంకర్.

"వెయిట్ అండ్ సీ.ఎందుకా ఆత్రం?" నవ్వుతూ కసిరింది.

ఓ గిన్నె చూసి, "కారట్ హల్వా... ఓహ్" అన్నాడు కళ్ళెగరేస్తూ.

"కేకులు, శాండ్‌విచెస్! ఓహో...బానే వుంది"

ఆఖరున చూసింది ఏమిటో అతనికి అర్థంకాలేదు.

"అదేమిటి?"

"ఇదా? నా అమృత హస్తంతో తయారుచేసిన వంటకం! అంచేత ఇది కారపు వంట అయినా తియ్యగానే వుంటుంది...చూడండి!"

ప్రఫుల్ల నవ్వుతూ చెప్పింది.

"అసలు తినదగినట్టు వుంటుందా అని!"

"ఆ భయమేం అక్కరలేదు'' అభయమిచ్చింది.

"పేరేమిటి?''

"ఖీమా పనీర్ కట్‌లెట్!"

"ఆ పేరుగల వంటకాన్ని తయారు చేశావా? లేక తయారయిన డిష్‌కి నువ్వే అలా నామకరణం చేశావా?"

భవానీశంకర్ నవ్వుతూ అల్లరిపట్టించాడు ఆమెను.

ప్రఫుల్ల కళ్ళెర్ర జేసింది.

"ఏమిటి నీ వుద్దేశం? ఆఁ...హూ డూ యూ థింక్ అయామ్? నాకు వంట చాతకాదనుకుంటున్నావా? ఇది 'ఈవ్సవీక్లీ'లో బహుమతి పొందిన వంటకం...తెలుసా?''

శైలజ వారి సరదాలో పాలుపంచుకోలేకపోతోంది.

ప్రఫుల్ల బలవంతంమీద వచ్చిందేతప్ప ఇలా రావడం ఆమె పూర్తి ఇష్టంతో కాదు.

ఉదయం ప్రఫుల్ల వాళ్ళింటికి వెళ్ళిన సమయానికి ఆమె ఎక్కడికో బయలుదేరే సన్నాహంలో వుంది.

''హాయ్..వచ్చావా?'' అంది శైలజను చూసి సంతోషంగా.

''ఎక్కడికో వెళ్తున్నట్టున్నావే?''

''అవును! ఈరోజు భవానీశంకర్ ఫొటోలు తీస్తానన్నాడు"

''అలాగా! అయితే నేను మళ్ళీ కలుస్తాను" అంటూ శైలజ కూర్చున్నదే లేవబోయింది.





"అదేమిటి ..నువ్వు రావూ?" అంది ప్రఫుల్ల.

"నేనెందుకు మీ మధ్యన?"

'ఏం మాట్లాడుతున్నావ్?' అన్నట్టు చూసింది ప్రఫుల్ల.

"భలే అర్థం చేసుకున్నావులే. నువు రావడం ఇష్టంలేకుంటే అడిగివుండే దాన్నా?"

నిష్ఠూరమాడింది.

"అబ్బే... అదికాదు నా వుద్దేశం"

"సరే...వదిలెయ్. వస్తున్నావు కదా!"

"కాని..."

"కాణీ, అర్థణాల కాలం చెల్లిపోయింది"

"నీతో వస్తానుగాని ఫొటోల్లోకి రాను. ఈ షరతుపై అయితే నేను రెడీ"

"ఏమిటి నీ అభ్యంతరం?" ప్రఫుల్ల విసుగ్గా చూసింది.

"అదంతే!"

"అదే ఎందుకంటాను!"

"నేను నీ ఆహ్వానానికి ఒప్పుకున్నట్టు నువ్వూ నా షరతుకి ఓకే అనవచ్చుకదా!"

"సరే..కానివ్వు" ఇక వాదించలేనట్టు అంది ప్రఫుల్ల.

ఆమె డ్రెస్సింగ్ టేబిల్ ముందు కూర్చుని ముస్తాబవుతోంది.

శైలజ టీపాయ్‌మీది పత్రిక అందు కుని యధాలాపంగా పేజీలు తిరగేస్తోంది.

ఆమె మనసులో ఓ సందేహం మిగిలి పోయింది.

అది వెల్లడించాలా, వద్దా అన్నట్టు కాసేపు తటపటాయించింది.

చివరికి అడిగేందుకే సిద్ధమయింది.

"ప్రఫూ!"

"ఏమిటి?"

ము ఖా ని కి స్నో రాసుకుంటున్న ప్రఫుల్ల తల తిప్పకుండా అడిగింది.

"నేను మీ ప్రోగ్రామ్‌లో అనుకోకుండా కలవలేదు కదూ?"

"అంటే?"

వేళ్ళతో స్నోను ముఖమంతా సమంగా పులుముకుంటూ అంది.

"నువు బైలుదేరే సమయానికి వచ్చి నందువల్ల నన్ను రమ్మంటున్నావా? లేక ముందే నన్ను..."

"నీ అనుమానాలకి జోహారు తల్లీ!" ఆమె పూర్తి చేయకముందే కల్పించుకుంది ప్రఫుల్ల.

"నీకా డౌట్ ఎందుకొచ్చింది? మొన్న నిన్ను వదిలేసి నేనూ, భవానీశంకర్ సినిమాకు వెళ్ళామనేనా?" అంది తల తిప్పి శైలజ వేపు చూసి.

"అహ!" అంది శైలజ తొందరగా.

ఆరోజు వాళ్ళిద్దరూ సినిమాకి వెళ్ళాక తిరిగి ఇప్పుడే కలవడం.

ప్రఫుల్ల తల తిప్పకుని ముస్తాబు కొనసాగిస్తూ చెప్పింది-

"అలా చేయడం ఓవిధంగా తప్పే నేమో ! ఓ ఫ్రెండ్ తోడుగా వున్న ప్పుడు మరో ఫ్రెండ్ కలిస్తే మొదటి వాళ్ళని డ్రాప్ చేసుకోకూడదు కదా! కాని, ఆరోజు నాకు అప్పుడే ఇంటికెళ్ళే మూడ్ లేదు. ముగ్గురమూ కలిసి చూడాలనే సినిమా ప్రోగ్రాం నిర్ణయిం చింది! కాని, నువ్వు ఇంటికెళ్ళిపోవాలం టుంటే బలవంతంగా ఆపాలన్పించలేదు. ఎన్నోసార్లు అలా ఇబ్బంది పెట్టాను కదా! ఆ విధానం మార్చుకోవాలని...

ఇప్పుడు నువ్వు సమయానికి వచ్చి నందుకు సంతోషిస్తున్నాను. లేకపోతే కాసేపట్లో నీకు ఫోన్ చేసి వుండేదాన్ని. నీవు ఇంటి దగ్గిర సిద్ధంగా వుంటే కారులో వచ్చి నిన్ను కలుపుకునేవాళ్ళం!"



శైలజ ఆమె మాటలతో సంతృప్తి పడింది.

ప్రపుల్ల ముస్తాబు పూర్తయింది అప్పటికి.

"బైలుదేరుదామా!" అంటూ డ్రెస్సింగ్ టేబిల్ వద్ద నుంచి లేచింది.

"నా చీరొకటి కట్టుకోకూడదూ?" అంది శైలజ కట్టుకున్న చేనేత చీరను చూసి.

"ఈ చీరకేం? బాగోలేనా?"

"అలా అని కాదు"

"మరి, నన్నిలాగే వుండనివ్వు"

ఆడంబరాలంటే ఇష్టపడని శైలజకి మిథ్యాడంబరాలు అసలే గిట్టవు.

ఎన్నిసార్లో-తను ఈవిధంగా కోరితే ఆమె నిరాకరించడం!

ఆమె స్వభావం గురించి మర్చిపోయి మట్లాడినందుకు ప్రపుల్ల తనపై తానే విసుగుపడింది.

"ఇక పద!"

మేడపైనున్న ప్రపుల్ల గదిలోంచి ఇద్దరూ మెట్లుదిగి కిందికి వచ్చారు.

ప్రపుల్ల తల్లితో వెళ్తున్నానని చెప్పి వచ్చింది.

నౌఖరు కారియర్లు వుంచిన బాస్కెట్, ఇతర సరంజామా డిక్కీలో పెట్టాడు.

ప్రపుల్ల గేరేజ్‌లోంచి కారు బైటకు తీసింది. శైలజ కూర్చున్నాక రోడ్డు మీదికి పోనిచ్చింది.

"భవానీ శంకర్ లిబర్టీ దగ్గరుంటా నన్నాడు. ముందు అతన్ని కలుసుకుని, అక్కడినుంచి ఫొటోలు..."

ఆమె కారు నడుపుతూ అతనితో తన పరిచయం ఎలా ప్రారంభమైందీ శైలజకి చెప్పింది.

ప్రపుల్ల రోజూ తమ కారులోనే కాలేజీకి వెళుతుంది. ఆమెను కాలేజీ దగ్గర దింపి కారు తీసుకెళ్ళిపోయే డ్రైవర్, మళ్ళీ సాయంత్రం కాలేజీ వదిలే సమయానికి కారు తెస్తాడు.

ఆరోజు సాయంత్రం ప్రపుల్లను తీసుకెళ్ళేందుకు కారు రాలేదు. ఆమె తండ్రి ఉదయమే చెప్పాడు-కారు పంపడం వీలు పడదని.

ప్రపుల్ల కాలేజీ ఆవరణ దాటి రోడ్డు మీదికొచ్చి ఆటో కోసం చూసింది.

ఖాళీగా ఒక్క ఆటో కూడా కనబడ లేదు.

ఆమె దగ్గరలో వున్న బస్‌స్టాప్ కెళ్ళి నిలబడింది-ఆటో దొరికితే సరే, లేకుంటే బస్‌లో వెళ్ళిపోవాలనే ఆలోచనతో.

అక్కడే పది నిముషాలు నిలబడింది.

అప్పటికి వచ్చిందొక బస్!

కిక్కిరిసి వున్న అది స్టాప్‌లో కాకుండా ఇరవై గజాలు ముందుకెళ్ళి ఆగింది.

అలవాటైనవాళ్ళు పరుగెత్తి వెళ్ళి అందుకున్నారు.

ప్రపుల్ల చూస్తూ నిలబడింది.

మరో అయిదు నిముషాల తర్వాత వచ్చిన బస్సు రష్‌గానే వున్నా బస్‌స్టాపులోనే ఆగింది.

కాని, ప్రపుల్ల అందరితోపాటు తోసుకుని బస్ ఎక్కలేకపోయింది.

తర్వాత బస్ కోసం ఎదురుచూస్తూ నిలబడింది.

పది నిముషాలు గడిచినా ఏదీ రాలేదు!

ప్రపుల్లకు విసుగుపుట్టింది. 'ఇక బస్‌లో వెళ్ళటం కుదరని పని' అనుకుంది.

ఆటోల జాడ కూడా లేదు.

అంతలో అటుగా ఓ యువకుడు మోటార్‌సైకిల్‌పై వస్తుండటం చూసిన

 

ప్రఫుల్లకి ఓ ఆలోచన వచ్చింది.

రోడ్డుపై రెండడుగులు ముందుకేసే లోగా ఆమె ఆలోచనను పసికట్టినట్టే ఆ మోటార్ సైకిల్ ఆమె ముందుకొచ్చి ఆగింది.

"ఎక్కడికి?" అని కనుక్కోకుండానే "లిఫ్ట్ ఇస్తాను రండి" అన్నాడతను చిరునవ్వుతో.

ఆమె ఎక్కి కూర్చోగానే మోటార్ సైకిల్ ముందుకు పరుగెత్తింది.

అతనే భవానీశంకర్!

ఫొటోగ్రఫీ అతని హాబీ! సిటీలో అతనికో కలర్‌లాబ్ వుంది కూడా!

నిజానికతనికి కష్టపడి డబ్బు సంపాదించాల్సిన అవసరం లేదట!

అతను ఏ సంపాదనా లేకుండా, హాయిగా జీవితం గడిపేందుకు కావల్సినంత వారసత్వపు ఆస్తి ఉందట!

అందువల్ల కలర్‌లాబ్ నడుపుతున్నది సంపాదన కోసం కాదు-ఫొటోగ్రఫీపై గల అభిరుచితో! రెండు ఎడ్వర్టయిజింగ్ ఏజెన్సీలకి అవసరమైనప్పుడు మోడల్స్‌ని ఫొటోలు తీసి ఇస్తుంటాడు కూడా.

తన గురించి ఇదంతా చెప్పి ప్రఫుల్ల వివరాలు తెల్సుకున్నాడు.

అతను ఓపెన్‌గా మాట్లాడటం నచ్చిన ప్రఫుల్లకి, తన గురించి చెప్పుకోవడానికి అభ్యంతరమేమీ తోచలేదు.

ఆ తర్వాత అతను ప్రఫుల్లను రెండు మూడు సార్లు కలుసుకోవడం...'ఈజీ గోయింగ్'గా వుండే అతని స్వభావం ఆమెకు నచ్చడం.... అలా అలా పరిచయం పెరిగి స్నేహితులయారు.

ప్రఫుల్ల చెప్పడం ముగించాక-

"ఉత్తి స్నేహమేనా? లేక మరో బంధం..." అంది శైలజ ఆమె ముఖంలోకి చూస్తూ.

ప్రఫుల్ల చెక్కిళ్ళు ఎర్రబడ్డాయి. ఆమె అలా సిగ్గుపడటం చాలా అరుదు!

శైలజ అది చూసి నవ్వుకుంది.

"ఇంతవరకూ ప్రేమ ప్రసక్తి రాలేదు. అలాంటిదుంటే నీకు చెప్పకుండా వుంటానా?"

ప్రఫుల్ల రోడ్డు మీదికి దృష్టిసారించి కారు నడుపుతూ చెప్పింది.

వారి మాటల్లోనే కారు లిబర్టీ దగ్గరికి చేరుకుంది.

థియేటరు పక్కనేవున్న రెస్టారెంట్‌లో కూర్చుని వారికోసం నిరీక్షిస్తున్నాడు భవానీశంకర్.

కారు చూడగానే బైటకొచ్చి ఇద్దరికేసి చూసి "హలో" అన్నాడు చిరునవ్వుతో.

"హలో" తిరిగి విష్‌చేశారు వాళ్ళు.

మెగ్‌యార్ స్లీవ్స్ షర్టుని కార్డురాయ్ జీన్స్‌లోకి టక్‌చేశాడు.

భుజానికి కెమేరా వేలాడుతోంది.

అలా అతన్ని చూడగానే ప్రఫుల్ల చెప్పింది గుర్తొచ్చింది శైలజకి.

'ఈజీ గోయింగ్ ఫెలో!'

కారును సమీపించిన అతనితో "వెనక కూర్చో" అని చెప్పింది ప్రఫుల్ల.

"ఏమిటి... కారు నువ్వు నడుపుతున్నావా?" అడిగాడు కొద్దిగా తలవంచి విండో అద్దంలోంచి చూస్తూ.

"డ్రైవింగ్ సీటులో కూర్చున్నది కనబడటంలేదూ?" అంది ప్రఫుల్ల.

"డ్రైవర్ ఏమయ్యాడు?"

"మనతో డ్రైవర్లు, నౌకర్లు ఎందుకు 'బోర్' అని వద్దన్నాను"

అతను కారులో వెనుక సీటులో కూర్చున్నాడు.

కారును టాంక్‌బండ్‌వైపు నడిపింది

ప్రఫుల్ల.

"అయితే ప్రఫుల్లా...ఇంతవరకూ కారును ఎన్నిసార్లు డాక్టర్ దగ్గరికి పంపావ్?" అన్నాడు భవానీశంకర్.

"ఏమిటీ?" అంది ప్రఫుల్లకి అర్థం కాక.

"అదే...నీ డ్రైవింగ్‌లో ఎన్ని యాక్సిడెంట్స్ జరిగాయి? కారు ఎన్నిసార్లు రిపేరకి షెడ్‌కి వెళ్ళొచ్చింది??"

"డేమ్ యూ!"

కుడిచేత్తో స్టీరింగ్‌ని అదుపుచేస్తూ, పక్కకు తిరిగి కొట్టడానికన్నట్టు ఎడమ చేతిని అతని మీదికి విసిరింది ప్రఫుల్ల ఉక్రోషంగా.

"అరరే..ముందుకు చూడు" అన్నాడతను- ఆమె చేతికి అందకుండా మరో వైపుకి జరిగి తప్పించుకుని.

"మనకేమైనా ఫర్లేదు! కాని, నీ ఫ్రెండ్‌ని క్షేమంగా ఇంటికి చేర్చాల్సిన బాధ్యత ఒకటి వుంది కదా"

శైలజ అతని అల్లరికి మనసులో నవ్వుకుంది.

కారు టాంక్‌బండ్‌పై పరుగెడుతోంది.

"నీ ఫ్రెండ్ ఏమిటీ..ఏమీ మాట్లాడటం లేదు. అప్పుడప్పుడూ మౌనవ్రతంలాంటిది పాటిస్తుంటారా?"

భవానీశంకర్ నవ్వుతూ శైలజకేసి చూసాడు.

సడెన్‌గా అతను టాపిక్ తన వైపుకి మరల్చడం చూసి శైలజ ముందు మొహమాటపడింది.

క్షణం ఆగి, "నాకు అవకాశం ఇవ్వకుండా మాట్లాడటం, పోట్లాడటం అంతా మీ ఇద్దరే కానిస్తున్నారు కదా" అంది నెమ్మదిగా- ప్రఫుల్ల సమాధానం చెప్పే లోపునే.

భవానీశంకర్ విస్మయపడ్డాడు- ఆమె మాటలతో ఇలా ఎదుర్కొనగలదని వూహించి వుండకపోవడంతో.

"ఓహ్!" అని నవ్వేశాడు.

"తను చాలా పొదుపరిలే మాటలు ఖర్చుచేయడంలో!" చెబుతూ, "ఇక్కడో స్నాప్ తీసుకుందామా?" అంటూ కారును పక్కకు తీసింది ప్రఫుల్ల.

"యాజ్ యూ లైక్!"

కారును పేవ్‌మెంట్ పక్కనే నిలిపి, ఆమె దిగేందుకు డోర్ తీయబోతుంటే, "నేను కారులోనే వుండిపోతాను ప్రఫూ" అంది శైలజ.

భవానీశంకర్ ప్రశ్నార్థకంగా చూశాడు.

"అదేమిటి? ప్రఫుల్లతోపాటు మీరు కూడా..."

అతని మాటలు పూర్తికాకుండానే అందుకుని-

"తనకి ఫొటోలు అక్కర్లేదటలే శంకూ!" అంది ప్రఫుల్ల.

భవానీశంకర్ నిరుత్సాహంగా ఆమెతో పాటు కారు దిగాడు.

ప్రఫుల్ల పేవ్‌మెంట్ మీదకి నడిచి రెయిలింగ్‌ని ఆనుకుంది.

"అలా నిలబడి దానిపై చేతులుంచి.." భవానీశంకర్ ఆమెకు సూచన లివ్వబోయాడు.

"హూ డూ యూ థింక్ అయామ్? నేను మోడల్‌ని కాదుకదా! పోజుల గురించి నువ్వేం చెప్పనక్కరలేదు. నేను నాకిష్టమైన భంగిమలో వుంటాను. నీవు చేయవలసిందల్లా ఫొటోలు తీయడమే" ప్రఫుల్ల దబాయింపుగా అంది.

'కాలుమీద కాలు వేసుకుని, రెండు చేతులతో రెయిలింగ్‌ని ఆధారంలా




పట్టుకుని, ముఖం ఎడమవైపు మాత్రమే ఫొటోలో వచ్చేట్టు, తల కుడిభుజం మీదికి తిప్పి నవ్వుతూ నిలుచుంది!'

భవానీశంకర్ ఆ భంగిమను కెమేరాలో బంధించాడు.

తిరిగి కారెక్కారు.

ఆవిధంగా సిటీ అంతా కారులో తిరుగుతూ-ప్రఫుల్ల తనకు నచ్చిన చోట కారు ఆపి ఫొటో దిగుతూ, మూడు గంటలకి యూనివర్సిటీ గార్డెన్‌కి చేరుకున్నారు.

"శైలూ!"

శైలజ ఆలోచనలనుంచి తెప్పరిల్లి ప్రఫుల్లకేసే తిరిగింది.

తెచ్చినవాటిని పేపర్ ప్లేటుల్లో సర్దిన ఆమెస్పూన్‌తోపాటు శైలజకి అందించింది.

భవానీశంకర్ తన ప్లేటులోని కారట్ హల్వా ఖాళీ చేస్తున్నాడు.

శైలజ ప్రఫుల్లతో పాటు స్పూన్‌తో హల్వా అందుకుని తింది.

అలా ఒక్కొక్కటీ తినసాగారు-ఏవో కబుర్లతో.

ప్రఫుల్లే అధికంగా మాట్లాడుతోంది. భవానీశంకర్ తినడంలోనూ, శైలజ వినడంలోనూ ఎక్కువ నిమగ్నమై వున్నారు.

"ఇన్‌క్రెడిబుల్!" అన్నాడు భవానీశంకర్ హఠాత్తుగా.

"ఏమిటి?" అంది ప్రఫుల్ల.

శైలజ ముఖంలో కూడా ఆసక్తి కదలాడింది అతని కామెంటుకి.

"నేను నమ్మలేకపోతున్నా ప్రఫుల్లా.. నీవు చేసిన ఖీమా పనీర్ కట్‌లెట్ బాగుందేమిటి?" అన్నాడు భవానీశంకర్ కళ్ళెగరేసి.

అతను తినడంలో ముందున్నాడు. నెమ్మదిగా తింటున్న శైలజ, ప్రఫుల్ల ఇంకా ఆ అయిటమ్‌లోకి రాలేదు.

ప్రఫుల్ల నవ్వేసింది అతని మాటకి.

"నాకు ముందే తెలుసు... అది నేను చేయలేదు గనక ఖచ్చితంగా రుచిగానే వుంటుందని. మా వంటావిడ చేత చేయించాను'' నవ్వుతూ అసలు విషయం చెప్పేసింది.

"భలే భయపెట్టావుకదా ! నేను ఆరోగ్యంమీద ఆశలు వదిలేసుకుని మరీ ఇది తినేందుకు సిద్ధపడ్డాను తెలుసా?"

భవానీశంకర్ గట్టిగా నవ్వేశాడు.

శైలజ కూడా నవ్వుతూ వారిసరదాలో కలిసిపోయింది.

అలా కొంతసేపు నవ్వులతో కాలం దొర్లింది.

తర్వాత ప్రఫుల్ల, భవానీశంకర్ కాసేపు కార్డ్స్ ఆడారు. శైలజ ఆడనని చెప్పేసి ప్రఫుల్ల పక్కన చూస్తూ కూర్చుంది.

సాయంత్రమైంది!

పశ్చిమాద్రిన సూర్యుడు కుంగేందుకు సిద్ధపడుతున్నాడు.

"ఈ లైటింగ్ ఫొటోలకిబావుంటుంది" చెప్పాడు భవానీశంకర్.

మళ్ళీ ఫొటోలు తీసుకునేందుకు లేచారు.

"శైలూ! మనిద్దరం కలిసి ఫొటో దిగుదాం. ఇదొక్కటే..కాదనకు'' అంది ప్రఫుల్ల ఈసారి.

శైలజకి ఆసక్తి లేకపోయినా, ప్రఫుల్ల వూరుకోదని తెలిసి ఒప్పుకుంది.

శైలజ పువ్వులు కోస్తుంటే ప్రఫుల్ల ఆమె పక్కన నిలుచుని చూస్తున్నట్టు — వారిద్దరినీ ఫొటోతీసి "కెమేరా వున్నా ఫొటో భాగ్యానికి నోచుకోని దురదృష్ట

"ఎందుకులే వద్దు! ఫొటోలో భవానీ శంకర్ బదులు అతని 'ఘోస్ట్'ను చూసుకోవడానికా?" అన్నాడతను నవ్వుతూ.

ఆమెకు ఫొటోలు తీయగలంత పరిజ్ఞానం వున్నట్టు తెలిసినా సరదాగా జోక్ చేశాడు.

ప్రఫుల్ల ఉక్రోషపడలేదు.



"నా 'ట్రిక్ ఫొటోగ్రఫీ' ప్రతిభను ఆ విధంగా ఫొటోలో చూసుకుని ఆనందించవచ్చుగాని కెమేరా ఇవ్వు" అంది తనుకూడా దాన్ని సరదాగానే తీసుకుంటూ.

కెమేరా ప్రఫుల్ల చేతికొచ్చింది.

"ఫొటో బాగా రావాలంటే నేను చెప్పిన పోజు పెట్టాలి"

"ఏమిటి నీ దౌర్జన్యం? ఇందాక నన్నయితే చెప్పనివ్వలేదు?"

వంతుణ్ని నేనేనన్న మాట" అన్నాడు భవానీశంకర్.

"సరే..నువ్వు నిలబడు. నేను తీస్తాను" అంటూ సిద్ధమైంది ప్రఫుల్ల.

"అంతే!"

"మీరైనా న్యాయం చెప్పండి శైలజా" ఆమె వత్తాసుకోసం ప్రయత్నించాడతను.

"తన సపోర్టుతో నాపైధ్వజమెత్తాలనే? మిత్రభేదం కల్పిస్తావా? మా దగ్గర నీ పప్పులేమీ వుడకవు.. గుర్తుంచుకో!" ప్రఫుల్ల నవ్వింది.

శైలజ కూడా ఏమనలేక చిరునవ్వుతో వూరుకుంది.

భవానీశంకర్ అక్కడితో ఆ ప్రసక్తి వదిలేశాడు.

ఓసారి చుట్టూచూసి, "అక్కడి కెళ్ళి నిలబడు" అంది ప్రఫుల్ల చూపుడువేలితో పాయింట్ చేసి చూపుతూ.

భవానీశంకర్ వెళ్ళి ఆమె చెప్పిన జాగాలో నిలుచున్నాడు.

"అలా దర్వానులా బిగుసుకుని నిట్ట నిలువుగా నిలబడటంకాదు. కుడికాలు కొంచెం బెండ్ చేయి!

ఓకే! ఒక చేయి పేంటు జేబులో



పెట్టుకుని, మరో చేయి నడుముపై, కాదు- నడుము వెనక పెట్టుకో!

అయిందా? ముఖం పైకెత్తి, పళ్ళన్నీ బైటపడేలా కాకుండా, కాస్త నవ్వు!

గుడ్! దటీజ్ ద పోజ్!

నౌ, అయ్‌విల్ షూట్ యూ!

రెడీ!

వన్, టూ, త్రీ!"

ప్రఫుల్ల నవ్వుతూ కెమేరా 'క్లిక్' చేసింది.

"ఆహా...ఏమి డైరెక్షన్స్? ప్రొఫెషనల్‌లా అట్టహాసం చేశావే?" నవ్వాడు భవానీశంకర్.

'మరేమనుకున్నావు?' అన్నట్టు చూసి శైలజ వైపు తిరిగిందామె.

"శైలూ! నువ్వు మా ఇద్దరినీ తీయాలి"

"నేనా?"

"అవును... నీకు తెలీదుకదూ?"

"తెలీకపోతేనేం! నేను చెబుతాను" అన్నాడు భవానీశంకర్ వెంటనే అందుకుని.

ప్రఫుల్లను ఒక చెట్టు పక్కన నిలబడమన్నాడు.

ఆమెకు తగినంత దూరంలో నిలబడి కెమేరాలోంచి యాంగిల్ చూసి, ఫోకస్ సరి చూసుకుని శైలజను పిలిచాడు.

"ఇదుగో... కెమేరా ఈ హైట్‌లో వుంచి చూడండి. ఫ్రేమ్ ఇలా ఉండాలి. మీరు చేయవలసిందల్లా ఇలా క్లిక్ చేయడమే" అని చూపాడు.

శైలజ తల వూపి అతని దగ్గరనుంచి కెమేరా తీసుకుంది.

కెమేరా అందిస్తుండగా వేళ్ళు తగలడం అతను కావాలని చేసిన పనిగా గుర్తించలేదామె. యధాలాపంగా జరిగినట్టు పట్టించుకోలేదు.

భవానీశంకర్ కెమేరా ఆమెకిచ్చేసి ప్రఫుల్ల వైపు నడిచాడు.

"ప్రఫుల్ల చున్నీని మెడకు చుట్టి ముందుకు వేలాడేసుకుని, దానిఅంచులను రెండు చేతులతో పట్టుకుంది.

భవానీశంకర్ ఆమె పక్కనే కొంచెం వెనుకగా తాకీతాకనట్టు నిలబడి,కుడిచేయి చాచి పక్కనున్న చెట్టుకు ఆనించి,ఎడమ చేతిని పేంటుజేబులో పెట్టుకుని నిలబడ్డాడు."

అతని సూచనల ప్రకారం శైలజ కెమేరా పట్టుకుని క్లిక్ చేసింది.

"థేంక్యూ"

భవానీశంకర్ వచ్చి ఆమె చేతిలోని కెమేరాను తీసుకున్నాడు.

ఈసారి కూడా ఆమె చేతికి అతని వేళ్ళు తగిలాయి.

సూర్యాస్తమయమైంది!

చీకటి రాకను గమనించినట్టు వెలుగు క్రమంగా పలచబడుతోంది. రేయంతా తన ఆధిపత్యాన్ని నిలుపుకునేందుకు చీకటి నెమ్మదిగా సమాయత్తమవుతోంది.

"ఇక వెళ్దామా ప్రఫూ! మరో రెండు మూడు స్నాప్స్ వుంటాయి. వెళుతూ వెళ్తూ ఎక్కడన్నా ఫ్లాష్ ఉపయోగించి అవి ఫినిష్ చేద్దాం" అన్నాడు భవానీ శంకర్.

"అలాగే" అంది ప్రఫుల్ల.

ముగ్గురూ కాసేపట్లో సరంజామా అంతా సర్దుకుని, కారులో వేసుకుని గృహోన్ముఖులయ్యారు.

* * *

"హలో"

"భవానీశంకర్?"

"అవును... మీరెవరు?"




''గెస్ చేయండి చూద్దాం''

''గీత''

"కాదు"

''హైమ''

''ఊహూఁ''

''అయితే విజయ అయివుండాలి''

"ఎవరు వాళ్ళంతా?"ఆమె కంఠంలో కోపం!

బదులుగా ఫోన్‌లో అతను పగలబడి నవ్వడం వినబడింది.

''ప్రఫుల్లా''

''......''

ఆమె కోపంతో మాట్లాడలేదు.

"మరొకరి పేర్లు చెప్పినందుకు నీవు కోపంతో మాట్లాడటంలేదు... అవునా? అలా కోపగించుకునేది ఒకే ఒక్కరు. ఆ విధంగా నువ్వెవరో గ్రహించాను. నువ్వు ఖచ్చితంగా ప్రఫుల్లవే"

ప్రఫుల్ల అతని వివరణతో సర్దుకుంది.

''తెలివితేటలకి సంతోషించాంగానీ, ఎందుకు ఫోన్ చేశానో తెలుసా?"

''ఏదీ... నువ్వు చెప్పందే?"

''అది కూడా గెస్ చేయరాదూ''

"ఫొటోల గురించి?"

''నీ బుర్రను 'మాస్టర్ బ్రెయిన్' అని మెచ్చుకోవాలన్న మాట! ప్రింట్లు వేశావా?"

"లేదు"

అతను టేబిల్‌మీది శైలజ ఫొటోను తదేకంగా చూస్తూ చెప్పాడు.

"వేయలేదా? ఎందువల్ల??"

ప్రఫుల్ల ఎగిరిపడ్డట్టుగా అంది.

"కొంచెం బిజీగా వుండి. రేపు అయిపోతాయి" చెప్పాడతను.

"ఇప్పటికి మూడు రోజులైంది. మరో రోజు గడువు పెడుతున్నావా? అసలు నువ్వు ఫొటోలు తీసిన మర్నాడే ప్రింట్లు వేసి చూపుతావనుకున్నాను! అలాంటిది నాలుగు రోజులు చేశావు. బద్ధకమా? నిర్లక్ష్యమా? అంత ఇంట్రెస్ట్‌లేనివాడివి మరి ఫొటోలు తీసేందుకు అంత వుత్సాహ మెందుకు ప్రదర్శించావ్? నేనేమీ ముచ్చటపడలేదే! నీ అంతట నువ్వే కదా ఫొటోలంటూ నన్ను ఒప్పించింది?"

''ఓకే ప్రఫూ...ఓకే! బిజీ అని చెప్పుకున్నాను కదా? సారీ చెప్పాలా?" అతను కంఠంలో విసుగుదాచుకుంటూ అన్నాడు.

"పొరపాట్లు చేయడమెందుకు? తర్వాత సారీలెందుకు?"

"సరే..ఒప్పుకుంటాను! నీకు ఫొటోలు రేపు ఇవ్వకపోతే అడుగు"

"కోపం వచ్చిందా?"

ఫోనులో ప్రఫుల్ల నవ్వు వినబడింది.

"కోపమా? ఎందుకు??"

''అయితే రాలేదన్నమాట?"

''లేదు"

"నిజంగానా?"

"నువ్వు ఇదే విధంగా తర్కిస్తుంటే కోపం తెచ్చుకోక తప్పేట్టు లేదు"

"అయితే వుంటాను" ప్రఫుల్ల నవ్వేస్తూ ఫోన్ పెట్టేసింది.

"డామిట్ !" చేతిలోని రిసీవర్‌ని క్రెడిల్ చేస్తూ అనుకున్నాడు భవానీ శంకర్.

* * *

మోటార్ సైకిల్‌పై వెళుతున్న భవానీశంకర్‌ని చూసి 'పలకరించాలా? వద్దా?' అని సందేహించింది శైలజ.

ట్రాఫిక్ రద్దీ వల్ల బండి నెమ్మదిగా నడుపుతున్న అతను అంతలోనే శైలజను చూసి పలకరించాడు.

ఆమె చిరునవ్వుతో బదులు పలికింది.

''నాతో మా లాబ్‌కి రాకూడదూ?'' అన్నాడు మోటార్ సైకిల్ ఆమె పక్కన నిలిపి.

"లాబ్‌కా?"

"మీ పనిమీదే నండీ! ఫొటోలు ఉన్నాయి కదా?"

"ఫొటోలు..."

"మొన్న ముగ్గురమూ కలసి తీసుకున్నవి. ప్రింట్లు వేశాను. ఇప్పుడు మీరు నాతో లాబ్‌కి వచ్చి పట్టుకెళ్లడమే ఆలస్యం... ఏమంటారు?"

''ప్రఫుల్లతో కలిసి...''

అతను గ్రహించేశాడు. ఆమె తన ఆహ్వానానికి సందేహిస్తోంది. మొహమాట పెట్టి ఒప్పించాలని నిర్ణయించుకున్నాడు.

"అలా అంటే కష్టమండీ! చెప్పండి... మీకిప్పుడు నాతో వచ్చేందుకు అభ్యంతర మేమిటి? నన్ను చూసి నాకు విలువ ఇవ్వకపోవచ్చు మీరు! పోనీ, ప్రఫుల్లకి ఫ్రెండ్‌గానైనా...''

అతని నిష్ఠూరం పనిచేసింది.

"ఛ ఛ! అదేంకాదు" అంది శైలజ నొచ్చుకుంటున్నట్లు.

"మరి నాతో వస్తున్నట్టే కదా?''

''ఎలా?'' శైలజ తోచనట్టు చూసింది.

"ఎలా ఏమిటండీ? వాహనం మీద నన్ను చూస్తూ కూడా...! వెనక కూర్చోండి"

శైలజ కొన్నిక్షణాలు తటపటాయించింది.

కాని, తప్పదు! అప్పుడు మళ్లీ సందేహించడం అతని దగ్గర ఎబ్బెట్టుగా వుంటుంది!

వెనక ఎక్కిందికాని, ఏం పట్టుకుని కూర్చోవాలో అర్థంకాలేదు.

ఆమె సందేహం తెలిసినట్టు, ''భుజంపై చెయివేసి పట్టుకోండి. లేకపోతే పడిపోగలరు!'' అన్నాడు.

ఆమెకు అయిష్టంగా అయినా, అతని భుజంపై చెయివేసి కూర్చోవడం తప్ప లేదు.

ట్రాఫిక్ కాస్త తగ్గగానే అతను మోటార్ సైకిల్ వేగం పెంచాడు.

అతని రాజదూత్ లేబ్ దగ్గరికి చేరుకునే వరకూ శైలజకి భయంభయంగానే వుంది.



7

ఓ రెండంతస్తుల భవంతిలో ఫస్ట్‌ఫ్లోర్‌లో వుంది భవానీశంకర్ కలర్ లాబ్.

అతనితోపాటు మెట్లుఎక్కి పైకివెళ్ళి లాబ్‌లో ప్రవేశించింది శైలజ.

వీరిని చూసి అక్కడ స్టూల్‌మీద కూర్చున్న పన్నెండేళ్ళ కుర్రాడు నమ్రతగా లేచి నిలబడ్డాడు.

''ఏం తీసుకుంటారు? కాఫీ, టీ, కూల్ డ్రింక్?''

భవానీశంకర్ అడిగాడామెని.

"అహ...ఏమీవద్దు''

''అలా అంటేకాదు! మీరిక్కడికి రావడం ఇదే ప్రథమంకదా! నా సంతోషం కొద్దీ కూల్ డ్రింక్ చెబుతాను''

ఆమె వారించలేకపోయింది.

''వేణూ! రెండు థమ్సప్''

అతని ఆర్డర్ అందుకుని వేణు అనే ఆ కుర్రాడు బైటకు వెళ్ళిపోయాడు.





"నిలబడే వున్నారే!ప్లీజ్.. టేక్ యువర్ సీట్!''

ఆమె సోఫాలో కూర్చుని ఆ గదినో సారి కలియజూసింది.

వాల్ టు వాల్ కార్పెట్! గదికో మూలన తను కూర్చున్న ఇంగ్లీషు 'ఎల్' ఆకారపు సోఫా! దానిముందు టీపాయ్!

గుమ్మానికి ఎదురుగా కస్టమర్స్ వచ్చినప్పుడు కౌంటర్‌లా వుపయోగపడే రోజ్‌వుడ్‌తో చేసిన గ్లాస్ టాప్ టేబిలూ, దాని వెనక రివాల్వింగ్ ఛైరు!

ఒకవైపు గోడకి నగ్నంగా కళాత్మకమైన భంగిమలోవున్న 'బోడెరెక్' నిలువెత్తు పోస్టర్, మరోవైపు ఓ జీన్స్ కంపెనీ ప్రకటనలో వయ్యారంగా నిలబడ్డ బ్రూక్ షీల్డ్స్!

భవానీశంకర్ టెక్స్‌టైల్స్ ప్రకటనల కోసం ఎడ్వర్‌టైజింగ్ ఏజెన్సీలకి తీసిచ్చిన కొందరు 'మోడల్‌గర్ల్స్' ఫొటోలు కూడా గోడలకి వున్నాయి.

''మురళి అని ఓ ఫ్రెండ్ ఈ లాబ్ వ్యవహారాలు సమస్తం అతనే చూసుకుంటాడు. చాలా మంచివాడు! నేనెంత కేర్‌లెస్‌గావున్నా మురళి వల్ల లాబ్ మంచి లాభాలతో నడుస్తోంది. ఈరోజు వంట్లో బాగోలేదని సెలవుతీసుకున్నాడు. ఇంపార్టెంట్ వర్క్ అనుకున్నది మటుకే డెవలపింగ్, ప్రింటింగ్‌తోసహా అంతా నేనే స్వయంగా చేస్తాను. మీ ఫొటోలు ప్రింట్లు వేసింది నేనే!"

చెబుతూ భవానీశంకర్ టేబిల్‌సొరుగు లాగి ఫొటోలున్న కవరు తెచ్చి శైలజకు అందించి సోఫాలో ఆమెకు కొంచెం దూరంలో కూర్చున్నాడు.

శైలజ కవరులోంచి ఒక్కొక్క ఫొటో తీసిచూసి టీపాయ్‌మీద పెడుతోంది. అతను కూడా తలకొద్దిగా ముందుకు వంచి ఆమెతోపాటు ఫొటోలుచూస్తూ ఏదో ఒకటి అంటున్నాడు.

'ఫొటోలు తీయడమేకాదు, ప్రింట్లు వేయడంకూడా టెక్నిక్‌తో కూడిన అంశమే' అని శైలజ ఒకసారి ఎందులోనో చదివింది. అది నిజమేనన్పించిందామెకి. భవానీశంకర్ ఫొటోల ప్రింటింగ్‌లో మంచి టెక్నిక్ ప్రదర్శించాడు.

శైలజ సహజంగానే తన ఫొటోను కాస్త ఎక్కువసేపు చూసుకుంది.

"అందానికి నిర్వచనంలా వున్నారు'' అన్నాడతను.

ఆమెకా సమయంలో అతని కాంప్లిమెంటుకి 'థాంక్స్' చెప్పాలని గాని, మరేమైనా అనాలనిగాని తోచలేదు. ఏకాంతంలో అతని పొగడ్త! పట్టించుకోనట్టుగా వూరుకుంది.

మరో రెండు ఫొటోల తర్వాత ఆమె, ప్రఫుల్ల కలిసివున్న ఫొటో!

తర్వాత ప్రఫుల్ల, భవానీశంకర్‌ల ఫొటో!

''మీరు తీసిన ఫొటో కదూ! బ్రహ్మాండంగా వుంది'' అన్నాడతను.

"నా ప్రతిభ ఏముంది? మీరు అంతా 'ఫిక్స్' చేసిఇస్తే 'క్లిక్' చేయడమేకదా!" అంది శైలజ.

ఫొటోలు చూడటం పూర్తయేటప్పటికి వేణు కూల్‌డ్రింక్స్ తెచ్చి, టీపాయ్‌మీద పెట్టాడు.

''తీసుకోండి"

భవానీశంకర్ బాటిల్ అందిస్తూ వేళ్లు తగిలించాడామెకు.

ఆమె యధాలాపంగా తీసుకుందేతప్ప అతని ప్రయత్నాన్ని గుర్తించలేదు.

వేణు ఖాళీసీసాలు పట్టుకుపోతుండగా గుమ్మం బయటవరకూ వెళ్ళి, తిరిగివచ్చి సోఫాలో కూర్చున్నాడు.

"శైలజా! మీది అత్యద్భుతమయిన సౌందర్యం"

అతను అసందర్భంగా తన అందం గురించి ప్రస్తావించడం ఆమెకు ఇబ్బంది కలిగించింది.

"బ్యూటీ కాంటెస్టుల్లో పాల్గొంటే మీరు 'మిస్ ఇండియా'గా ఎన్నికవడం తథ్యం! 'మిస్ యూనివర్స్' అయే అవకాశాలూ లేకపోలేదు!"

'అతని వుద్దేశం ఏమిటి? అందం గురించి ప్రశంసిస్తే మైమరచిపోతాననా?' శైలజ అర్థంకానట్టు చూసింది.

"మీరు మోడలింగ్ చేస్తే త్వరలోనే ఇప్పుడున్న వాళ్ళందరినీ మించిపోయి 'లీడింగ్ మోడల్' అయిపోతారు. నేను ఇంతమంది మోడల్స్‌ని చూశాను కానీ, ఎవరూ అందంలో మీ దరిదాపులకి కూడా రాలేరు. అంతా మేకప్‌తో మెరుగులు దిద్దుకునే అందమే! వాసనలేని కాగితపు పువ్వులు ఎలాగో, వాళ్ళలాగ! ఎన్ని తళుకుబెళుకులు ప్రదర్శిస్తే మాత్రం ఏం ప్రయోజనం? అయ్ ఫైండ్ ఎ పర్‌ఫెక్ట్ మోడల్ ఇన్ యూ! సహజ సౌరభంతో గుబాళించే గులాబీలాంటి వాళ్ళు మీరు! అందానికి అందం..." అతను ఏదో ఆవేశించినట్టు ఉద్వేగపూరితంగా ఏదేదో చెప్పుకుపోతున్నాడు.

శైలజకి అతన్ని ఎలా ఆపాలో తెలియలేదు. ఆ ప్రేలాపన వినలేనట్టు లేచి నిలబడింది.

"ఆగండి శైలజా! మీరు వెళ్ళవద్దు. నేనుచెప్పేదివినండి! అయ్‌వాంట్ యూ!"

శైలజ పదునుగా చూసింది. 'అయ్ వాంట్ యూ?'

"ఏ వుద్దేశంతో నన్ను కోరుకుంటున్నట్టు?" సూటిగా ప్రశ్నించాయి ఆమె కళ్ళు.

"అయ్...అయ్...అయ్ వాంట్ టూ మేరీ యూ!" అతను తడబడ్డాడు.

"............"

"మీరు ఓకే అనండి!" ఆమె చేయి పట్టుకున్నాడు.

శైలజ ఓ క్షణం నిర్ఘాంతపోయింది. మరుక్షణమే పరిస్థితిని అర్థంచేసుకుని బలంగా అతని చేతిని విదిలించి విడిపించుకుంది.

అతను తిరిగి ఆమె చేయి పట్టుకునే ప్రయత్నం చేస్తుండగా-

టేబిల్ మీది ఫోను గణగణా మోగింది.

శైలజ ఆలోచనారహితంగా ఒక్క ఉదుటున ఫోన్‌దగ్గరికి చేరుకుని రిసీవర్ అందుకుని వింది.

"భవానీ శంకర్?"

ఆ కంఠాన్ని గుర్తుపట్టింది.

"ప్రఫుల్ల...!"

మౌత్‌పీస్‌కి చెయ్యి అడ్డుపెట్టి అతనికి చెప్పింది.

ఆవేశంతో కందిపోయిన మొఖంతో చూస్తున్న అతను గభాలున వచ్చి ఫోన్ అందుకున్నాడు.

అతను ఫోన్‌లో "అవును. అయ్యాయి సరే.. అలాగే..." అన్నాడు ముక్తసరిగా. తర్వాత ఫోన్ పెట్టేశాడు.

శైలజ చూస్తూ నిలబడింది.

ఆమె మనసు స్తబ్దుగా వుంది. భవానీ శంకర్ అంతవరకూ మాట్లాడిన పద్ధతి, ప్రవర్తించిన తీరులకి మనసులో ఇదమిద్ధమయిన భావాలేమీ కలగలేదు. ఏదో అస్పష్టత... అంతా గజిబిజిగా...

ఆమె అతనితో చెప్పేందుకు మాటల్ని పేర్చుకుంటోంది.

"చూడండి భవానీశంకర్! ఇంతకు ముందు మీరు మాట్లాడిన మాటల్ని నేను అర్థంచేసుకోగలను. అందంపై వ్యామోహంతో అలా మాట్లాడివుంటారు. అందగత్తెననే వుద్దేశంతో నన్ను మీరు పెళ్ళి చేసుకుంటాననేయడం నాకు హాస్యాస్పదంగా అన్పిస్తోంది.

జీవితాంతం ఒకరికొకరు తోడుగా బతికేట్టు చేసే వివాహబంధంలో అందచందాలకి ప్రాధాన్యత ఇవ్వడం అవివేకం కదూ! అక్కడ కావలసింది ముఖ్యంగా మనసుల కలయిక! జీవితమంతా ఒకరి సాహచర్యం మరొకరికి కావాలన్పించే తపన!

మీకు తెలీదేమో.. మిమ్మల్ని ప్రఫుల్ల హృదయపూర్వకంగా ప్రేమిస్తోంది. మీరూ ఆమెను అలా ప్రేమించండి. కనీసం అందుకు ప్రయత్నించమని నా అభ్యర్థన! మీరు ప్రేమించినవారితోకాక మిమ్మల్ని ప్రేమించేవారితో పంచుకునే జీవితం అత్యంత సంతోషకరంగా సాగుతుందని గుర్తుంచుకోండి!"

అతను తన ప్రవర్తనకు ఫీలవుతున్నవాడిలా తల కొద్దిగా వంచుకున్నాడు.

శైలజ ఎలాంటి ఉపోద్ఘాతం లేకుండా తను చెప్పదలచుకున్నదంతా స్పష్టంగా తడబాటు లేకుండా చెప్పేసింది.

భవానీశంకర్ తల వంచుకుని అంతా విన్నాడు. అతను పశ్చాత్తాప పడుతున్నాడనుకుంది శైలజ.

"మీ మాటలకి నేనేమీ వేరుగా భావించడంలేదు. మీరూ మర్చిపోండి" అంటూ గుమ్మంవైపు అడుగులేసింది.

"శైలజా"

అంతవరకూ మాట్లాడని అతను గొంతు పెగల్చుకుని అన్నాడు.

అప్పటికి గుమ్మం దగ్గరికి చేరుకున్న ఆమె భుజం మీదుగా తలతిప్పి వెనక్కి చూసింది.

"ఈ సంగతి ప్రఫుల్లకి తెలియనివ్వరుకదూ!"

అతని జంకును ఎలా అర్థంచేసుకోవాలో తెలియలేదామెకి.

"చెప్పను" అంది అతనికి నమ్మకం కలిగేందుకు నవ్వే ప్రయత్నంచేసి.

వచ్చేస్తోంటే శైలజకి హఠాత్తుగా తట్టింది—తను బైటపడేంతవరకూ ఆ కుర్రాడు వేణు లాబ్‌కి తిరిగిరాకపోవడం 'అది భవానీశంకర్ పనేనా?'

'ప్రఫుల్ల ఎలాంటి వ్యక్తిని ప్రేమించింది?' అనుకోకుండా వుండలేకపోయింది. ఆమె మనసుకి చేదు తిన్నట్టుగా అయింది.

* * *

భవానీశంకర్ అలా తొందరపడి ప్రవర్తించినందుకు తనను తనే నిందించుకున్నాడు.

'ప్చ్...

తన తొందరపాటువల్ల అసలుకే బెడిసికొట్టింది!

మొదలుకే మోసం వచ్చినట్టయింది!'

సిగరెట్టు వెలిగించి గుండెల నిండుగా పొగపీల్చి వదులుతూ కుడిచేతి వేళ్ళతో జుట్టును దువ్వుకుంటూ సోఫాలో కూర్చున్నాడు.

'ఇంతవరకూ తను ట్రైచేసినవాళ్ళంతా వెంటనే "ఓకే" అనడమో, కొత్తలో వ్యతిరేకించినా కొంత ప్రయత్నం తర్వాత క్రమంగా తన దారికి రావడమో జరిగేది!

కాని, శైలజ విషయంతో తన అంచనా

తలకిందులైంది.

ఏమిటిలా అయింది?

లోపం ఎక్కడుంది?

తను ఎక్కడ పొరపాటు చేశాడు?

మామూలుగానే ఆమె సౌందర్యాన్ని పొగిడాడు. అది తను అందరివిషయంలో అనుసరించే పద్ధతే! తన అందానికి సంబంధించిన ప్రశంసలకి పొంగిపోని ఆడది వుండదనే తన నమ్మకం అనుభవ పూర్వకంగా రుజువవుతూ వస్తోంది.

అయితే మిగిలినవారిని మభ్యపరచినట్టుగా, ఆమెను వుట్టిగా పొగడలేదు. శైలజ విషయంలో మనస్ఫూర్తిగా తను ఫీలయిందే చెప్పాడు.





తను ఓ సంగతి విస్మరించాడు.

ఆమె ఇంతవరకూ తనకు తారసపడ్డ యువతులాంటిది కాదు.

ఆమె ప్రత్యేకతను తను మొదట్నించీ గమనిస్తూనేవున్నాడు.

దాన్నిబట్టి ఆమెను అప్రోచ్ అయే విధానాన్ని మార్చుకోకుండా ఇతర యువతులతో ప్రవర్తించిన పద్ధతినే అనుసరించాడు.

అదే తనుచేసిన తప్పేమో?

కరెక్ట్!

అదే తను చేసిన తప్పు'

''డామిట్'' తల విదిలిస్తూ గొణుక్కున్నాడు.



ఇపుడు చింతించి లాభం లేదు.

దీన్ని కవర్ చేసుకోవడం ఎలా అనేదే ఆలోచించాలి.

సిగరెట్ పీకను యాష్ట్రేలో కుక్కుతూ అనుకున్నాడు.

* * * *

ఫొటోలు చూడ్డం ముగించి కవరులో పెట్టేసింది ప్రఫుల్ల.

''థేంక్యూ శంకూ''

''మోస్ట్ వెల్‌కమ్'' అన్నాడతను చిరునవ్వుతో.

''ఎలా వున్నాయ్?''



''బ్రహ్మాండం అంటే సరిపోతుందా''

''చెవులకైతే అది చాలు కాని,మనసు సంతృప్తిపడాలంటే...''

''అంటే?'' ప్రఫుల్ల ఆసక్తిగా చూసింది.

''స్పెషల్ స్వీట్!''

''స్పెషల్ స్వీట్?''

ప్రఫుల్ల ముఖంలో అదేమిటనే జిజ్ఞాస కదలాడింది. ఎప్పుడూ వినని పదం!

"స్పెషల్ స్వీట్ అంటే చక్కెర తేనెలతో తయారుచేసే వంటకంకాదు. పరస్పరం ప్రేమించుకుంటున్న స్త్రీ పురుషులు ఒకరి పెదవులనుంచి మరొకరు తమ పెదవులతో గ్రోలేది"

అతను నిర్వచిస్తున్నట్లుగా చెప్పాడు.

"యూ మీన్ కిస్?'' అంది ప్రఫుల్ల.

"యా! అయ్ మీన్ ఇట్ "అన్నట్టుగా కళ్ళు ఆర్పి, తల పంకించాడు భవానీ శంకర్.

అతను వూహించలేదు-అంత త్వరగా తను కోరుకున్నది లభిస్తుందని!

ప్రఫుల్ల అతని మెడవెనుక చేతులేసి అతని పెదవులను తన పెదవులతో సున్నితంగా స్పృశించింది!

ఆ చనువు చాలు అతనికి- తనకను గుణంగా మలచుకునేందుకు!

ఆమె ముఖాన్ని చేతులతో పట్టుకుని పెదవులను గాఢంగా చుంబించాడు.

కొన్ని క్షణాలు ఆ పారవశ్యంలో కరిగాక-

''అయ్ లవ్ యూ!'' చెప్పాడతను.

"సో డూ అయ్!''

* * *

ఓ నవల పట్టుకుని సోఫాలోకూర్చుని వుంది ప్రఫుల్ల.

పేరుకి నవల పట్టుకుందే తప్ప దాన్ని ఆమె చదవడం లేదు. రెండు మూడు వాక్యాలు చదువుతుంది. తర్వాత నవలను అలాగే వళ్లో పెట్టుకుని, సోఫాపై తల ఆన్చి పైకి, తిరుగుతున్న ఫాన్‌వైపుకి చూస్తూ ఏవో గుర్తు తెచ్చుకుంటుంది.

ఓరోజు...

భవానీశంకర్ అనుకోకుండా రోడ్డు మీద కలిశాడు.

''యూ లుక్ లైక్ ఏన్ ఏంజెల్'' అన్నాడు తన ముఖాన్ని తదేకంగా చూస్తూ.

''థేంక్యూ'' అంది అతని కాంప్లిమెంటుకి చెక్కిళ్లు అరుణిమను పులుము కుంటుంటే.

''ఏమిటీ... ఈరోజు ద్విగుణీకృతమైన అందంతో కనిపిస్తున్నావు?''

''ఇపుడే బ్యూటీ పార్లర్ నుంచి వస్తున్నానులే'' అంటూ నవ్వేసింది.

''లెటజ్ హేవ్ సమ్ స్నాక్స్''

''ష్యూర్''

మోటార్‌సైకిల్ వెనక కూర్చుని అతని భుజంపై చెయి వేసింది. అతను స్టార్ట్ చేసి హోటల్ దారి పట్టించాడు.

''ప్రఫుల్లా''

''ఊ...''

"నువు మోడలింగ్ చేయకూడదూ?"

"మోడలింగా?"

అతను తన ముఖంలోని అయిష్టాన్ని చూడలేకపోయినా గొంతులో విన్నాడు.

"ఏం... తప్పేమిటి?"

''తప్పని కాదు గాని నాకిష్టంలేదు''

''ఎందుకని'?'

''నా మనసుకి సరిపడదు''

''అదే ఎందుకంటాను?''

''నేను అలంకరించుకునేది, అందంగా వుండాలనుకునేదిసౌందర్యంపైఆరాధనతో తప్ప దాన్ని ప్రదర్శించాలని కాదు !''

''ప్రదర్శించడం తప్పా?''

''తప్పని నేను చెప్పలేను. కాని, దానికి




ఒప్పుకోను''

అతను మోటార్‌సైకిల్‌ని ఓ ఏసీ హోటల్‌ముందు నిలపడంతో తమ సంభాషణ అంతటితో ఆగిపోయింది.

ప్రఫుల్ల వూహాలోకంనుంచి విడివడి, సోఫాలో మామూలుగా కూర్చుని నవల చదివేందుకు ప్రయత్నించింది.

ఇంతలో ఫోన్ మోగింది.

ఆమె ముఖంలోకి ఉత్సాహం వురికినట్టుగా వచ్చింది.

అక్కడ కూర్చుని నిరీక్షిస్తున్నది ఆ ఫోన్‌కాల్ కోసమే!

చప్పున రిసీవర్ అందుకుంది.

''హలో....ప్రఫుల్ల హియర్!''

''మీ నాన్నగారిని పిలుస్తావామ్మా!''

అవతలనుంచి ఓ పెద్దమనిషి కంఠం అడిగింది.

ఆమె ముఖంలోని వెలుగు 'ఉఫ్'మని వూదేసినట్టు క్షణంలో అదృశ్యమైంది.

''డాడీ ఇంట్లో లేరండీ!''

''అరె! ఈ టైంలో వుంటాను ఫోన్ చేయమన్నాడే!''

''మీరెవరండీ?''

''శేషగిరిరావుని!''

''మీరేనా? అయితే డాడీ వెళ్ళేముందు మీనుంచి ఫోన్ వస్తుందని, తను వేరే పని మీద అర్జెంటుగా వెళ్లాల్సివచ్చిందనిచెప్పి, ఈ నెంబరుకి ఫోన్ చేస్తే దొరుకుతానని నెంబర్ ఇచ్చారు''

ఫోన్ పక్కనేవున్న పాడ్ మీద రాసివున్న ఫోన్ నెంబర్ ఆయనకి చెప్పింది.

''సరేనమ్మా!'' ఫోన్ పెట్టేశాడాయన.

ప్రఫుల్ల నీరసంగా రిసీవర్ క్రెడిల్ చేసింది.

నవల చదవడంపైధ్యాసమరల్చేందుకు ప్రయిత్నించింది. కాని ఆమెకు సాధ్యం కాలేదు.

నవలను అలా పట్టుకుని ఫోన్‌కేసి చూడసాగింది.

ఆమె మనసు తెలిసినట్టుగా పది నిముషాలు గడిచేలోపే మళ్ళీ ఫోన్ మోగింది.

ఆమె ఈసారి కాస్త నెమ్మదిగా ఫోను అందుకుంది.

''ప్రఫుల్ల స్పీకింగ్!''

''హాయ్...ప్రఫుల్లా!''

భవానీశంకర్ కంఠం వినగానే ఆమె మానసం ఉత్సాహంతో పరవళ్ళుతొక్కింది.

''నీ ఫోన్ కోసం అరగంటనుంచీ వెయిట్ చేస్తున్నాను తెలుసా?''

''మ్చ్....''

ఫోన్‌లో అతను చేసిన శబ్దం ప్రఫుల్లకి అర్థం కాలేదు.

''ఏమిటది?''

''అర్థంకాలేదూ?''

''ఊహూఁ!''

''కమ్యూనికేషన్ ఆఫ్ లవ్! ఎ వెరీ ఇంపార్టెంట్ వర్డ్ ఇన్ ది లాంగ్వేజ్ ఆఫ్ లవ్!''

''అంటే?''

''ఇటీజెస్వీట్ వర్డ్ విచ్ హేజ్ 'ఈజ్' ఇన్ ది మిడిల్ అండ్ 'కె' 'ఎస్' ఎట్ ది ఎండ్స్...స్పెషల్‌స్వీట్!''

''సంతోషించాం గానీ, సినిమాకి టిక్కెట్లు సంపాదించావా?''

''భవానీశంకర్ ప్రయత్నించాక, సాధించకపోవడం ఎప్పుడైనా చూశావా?''

''థియేటరుకి ఫోన్‌చేస్తే, వారంవరకూ ఎడ్వాన్స్ ఇచ్చేసినట్లు చెప్పారు. నీకెలా దొరికాయబ్బా!''

''అది ట్రేడ్ సీక్రెట్... చెప్పకూడదు''



''సొంత డబ్బాలకేం గానీ నన్ను బైలుదేరమంటావా?''

"సత్వరమే!"

''మ్చ!!...''

''అరె... ఏమిటది?'' అన్నాడతను ఏమీ తెలియనట్టు అల్లరిగా.



8

శైలజ కళ్ళు విప్పార్చి చూసింది.

భవానీశంకర్ పక్కన ఎవరో అమ్మాయి!

జీన్స్, టీషర్టుల్లో వుంది!

ఇద్దరూ ఆ హోటల్ లోంచి నవ్వుకుంటూ బైటకొచ్చారు.

అతను బైట పార్క్ చేసివున్న తన వాహనాన్ని ఒక్క కిక్ తో స్టార్ట్ చేశాడు.

ఆమె వెనక కూర్చొని అతని నడుము చుట్టూ చేయివేసి పట్టుకుంది.

మోటార్ సైకిల్ ముందుకు కదలగానే అతని వీపుపై తల ఆన్చి ఏమో చెబుతోందామె!

శైలజ చూస్తూండగానే వారు కనుమరుగయ్యారు!

బాధో, సంతోషమో తెలియని మనఃస్థితిలో పడిందామె.

తను ప్రేమించిన వ్యక్తి మోసగాడని తెలిస్తే ప్రఫుల్ల పడే బాధ తలచుకుంటే దిగులు, 'అతని కపట ప్రవర్తన త్వరగా బైటపడటం ద్వారా ప్రఫుల్లకు మేలే జరిగింది కదా' అని ఆలోచిస్తే సంతోషం... ఈవిధమైన ద్వంద్వ భావాలతో ఆమె మనసుకి కొంతసేపు ఎటూ తోచకుండా అయింది.

భవానీశంకర్ నిజ స్వరూపం ఈరోజు వెల్లడయింది.

అతనికి ఆడపిచ్చి వున్నట్టు ఈ సంఘటనతో అర్థమవుతోంది.

తను ఆరోజు అతను తనపై కోరికను వ్యక్తపరచినప్పుడు మరోలా అర్థం చేసుకుంది.

తన సౌందర్యంపై వ్యామోహంతో ఆవేశపడి అలా ప్రవర్తించాడనుకుందే గాని, అతని స్వభావాన్ని గ్రహించలేదు.

ప్రఫుల్లతో ఆ సంఘటన గురించి 'చెబుదామా? వద్దా?' అని రెండు రోజుల పాటు తీవ్రంగా ఆలోచించింది.

ఇది ఆమె మనసుకు విఘాతంలా వుంటుందేమో...

ఈ మోసం ఆమెను కృంగదీస్తుందేమో...

తననో వ్యక్తి మోసగించబోయాడన్న తలంపుతో ఆమె ఎలా ప్రవర్తిస్తుందో...

ప్రఫుల్ల సంగతి అలా వుంచితే...

భవానీశంకర్ మనస్తత్వం గురించి కూడా శైలజ ఒక నిర్ధారణకు రాలేకపోయింది.

అతను తన ఒక్కదాని విషయంలోనే అలా ప్రవర్తించాడా? లేక అది అతనికి అలవాటేనా??

తాడును పాముగా భ్రమసినట్టు తను అతన్ని అనవసరంగా అనుమానించడం లేదు కదా?

ఏమో!

అతను ప్రఫుల్లను ప్రేమిస్తున్నట్టు అయితే, తను అతని గురించి చెడుగా

ప్రఫుల్లకు చెప్పడం జరిగితే, నిష్కారణంగా ఆమె మనసు విరిచినట్టవుతుందేమో!

ఆ విధంగా తనవల్ల ప్రాణస్నేహితురాలు నష్టపోవడం తను భరించగలదా?

ఎంతో ఆలోచించి, ప్రఫుల్ల దగ్గర ఆ విషయం దాచడమే నయమనే ఆలోచనకి వచ్చింది శైలజ. పోనీ, కొన్నాళ్లు వాయిదా వేసి చూద్దామనుకుంది.

కాని, ఇప్పుడు భవానీశంకర్ మరో అమ్మాయితో కనబడటం...

సందేహం లేదు!

అతను స్త్రీని భోగవస్తువుగా చూసే ఉమనైజర్!

ప్రఫుల్లకు ఈసంగతి చెప్పకపోతే తనే స్వయంగా ఆమెకు జరిగే అన్యాయానికి దోహదం చేసినట్టవుతుంది.

కష్టమో, నిష్ఠూరమో ఇది ఆమెకు తెలియాలి!

ఆమెనా మోసగాడిబారి నుంచి తప్పించాలి.

అది స్నేహితురాలిగా తన బాధ్యత!

శైలజ వెంటనే ప్రఫుల్ల దగ్గరకి బైలుదేరింది.

ఆమెను చూసి ప్రఫుల్ల యథాప్రకారం స్నేహపూర్వకమైన చిరునవ్వుతో ఆహ్వానించింది.

కిందికెళ్లి టీ తెచ్చింది.

టీ తాగుతూ ఏవో కబుర్లు!

ప్రఫుల్లే మాట్లాడుతోందిఉత్సాహంగా!

ఆమె సంతోషం చూస్తుంటే మరింత దిగులేసింది శైలజకి.ఆఉత్సాహపుపొంగుపై నీళ్ల చల్లేందుకు కదూ తను వచ్చింది? తను చెప్పే విషయాన్ని ప్రఫుల్ల ఎలా స్వీకరిస్తుందో?

మాటల మధ్యలో, "భవానీశంకర్ నాకు మోటార్ సైకిల్ నడపడం నేర్పుతానన్నాడు. బదులుగా నేను తనకి కారు డ్రైవింగ్ నేర్పాలట!'' అంది ప్రఫుల్ల.

అతని గురించి చెప్పేయడానికి ఇదే తగిన సమయమనుకుంది శైలజ.

"ప్రఫూ! నీకో నిజంచెబితే బాధపడ్తవు కదూ?" అంది.

ప్రఫుల్ల భృకుటి ముడిపడింది.

''బాధా? ఏమిటది??"

"ముందు బాధపడనని మాటివ్వు!"

శైలజ చేయి చాచింది.

ప్రఫుల్ల ఆమె చేతిని తన రెండు చేతులతో పట్టుకుని, "హూ డూ యూ థింక్ అయామ్? ప్రఫుల్లనికదా!ఇలా సస్పెన్స్‌తో బాధపెట్టక అదేదో చెప్పేయ్!" అంది.

"భవానీశంకర్ నువ్వనుకుంటున్నంత మంచివాడు కాదు. అతను స్త్రీ విషయంలో 'సిన్సియర్' కాదు"

ప్రఫుల్లకళ్లు అపనమ్మకంగాచూశాయి.

"నిజమా శైలూ?"

"అవును"

ఆమె ముఖాన్ని చూడలేక తలవంచుకుంది శైలజ. తను చెప్పబోయే చేదునిజం వల్ల స్నేహితురాలి ముఖంలో ఏర్పడే బాధావీచికలను గమనించడం ఆమెకిష్టం లేకపోయింది.

ప్రఫుల్లకు నెమ్మదిగా అంతా వివరించింది.

అతను తనతో ప్రవర్తించిన తీరు....తను అది ప్రఫుల్లకు చెప్పాలనుకుని, ఏవో సందేహాలతో ఆగిపోవడం... ఇప్పుడతను మరో అమ్మాయితో కులాసాగా తిరగడం...దాన్నిబట్టి తను అతని గురించి ప్రఫుల్లకు తెలియజేయడమే మంచిదనే నిర్ణయానికి రావడం...

ప్రఫుల్ల అంతా విని, అదిజీర్ణించుకోవ

డానికన్నట్టు కొంతసేపు మౌనంగా వుండిపోయింది.

శైలజ ఆమెకేసి బాధగా చూసింది.

'భవానీశంకర్ తనను ప్రేమించలేదు. కేవలం ఒక 'ఎఫైర్'లా అనుకుని తనతో కలిసి తిరిగా'డనే భావన ప్రపుల్లను అంతగా బాధపెట్టలేదు.

అతని అభినయాన్ని తను గ్రహించలేకపోయిందే, అతని కపట ప్రవర్తనను గుర్తించలేకపోయిందే అన్నదే ఆమెకు బాధగా వుంది.

తన తెలివితేటలన్నీ ఏమైనాయి?

అతని విషయంలో తనెందుకింత తెలివిహీనురాలైంది?

ఇదే ఆమె వ్యాకులపాటుకి కారణం!

అతను తన పరిచయాన్ని ఎందుకు, ఎలా కోరుకుంటున్నాడనే అనుమానం ఏకొద్దివున్నా తను అతని ప్రవర్తనను పరిశీలించి, స్వభావాన్ని అంచనా వేయ గలిగివుండేది!

ఆలోచనల నుంచి తెప్పరిల్లి శైలజ తన వంకే చూడ్డం గమనించి "ఏమిటలా చూస్తున్నావు?" అంది చిరునవ్వుతో.

అది తెచ్చిపెట్టుకున్నది కాకపోయినా ఆ నవ్వులో ఏదో లోపించినట్టు అనిపించింది శైలజకి.

"ఫర్‌గెట్ హిమ్!"

"......."

"టేకిట్ ఈజీ!" అంది మౌనంగా వుండిపోయిన ప్రపుల్లను చూసి సముదాయిస్తున్నట్టు.

'అది నువ్వు చెప్పాలా?' అన్నట్టు నవ్వింది ప్రపుల్ల.

"ప్రపూ...జీవితమన్నాక ఇలాంటివి సహజమే! అలాంటి మోసగాళ్ళని గుర్తించి దూరంగావుంచడమే మనంచేయవలసింది! నీవు దీని గురించి మనసు పాడుచేసుకుని, అనవసరంగా తొందరపడి ఏమీ చేయవు కదూ? అలా అని నాకు మాటివ్వు" అంది శైలజ ఆమె భుజంపై చేయి వేసి.

"పిచ్చి శైలూ! నామీద ఎంత ప్రేమ వున్నా నువ్వు ఇలా మాట్లాడటం చూస్తే నవ్వొస్తోంది" అంది ప్రపుల్ల.

'హూడూయూ థింక్ అయామ్? నేను అంత బలహీనమైన మనసు గలదాన్ని అనుకుంటున్నావా? తొందరపడి ఏం చేస్తానని? దీని గురించి ఇక ఆలోచించనని నువ్వే నాకు మాటివ్వాలి అసలు! అలా వుంది నీ వాలకం?'' అంది నవ్వేస్తూ.

శైలజ ఆమె ధోరణికి సంతోష పడింది! తేరుకుందన్నమాట!

''మరి నేను వెళ్ళిరానా?'' అంది ప్రపుల్లతో.

''వెళ్ళిపోవాలా? నీఇష్టం'' అంటూ ఆమెను గుమ్మం వరకూ నడిచి సాగనంపింది.

ఒంటరిగా మిగిలిన ప్రపుల్ల మనసులో తిరిగి భవానీశంకర్‌కి సంబంధించిన ఆలోచనలు ఆవరించాయి.

తనతో పరిచయం, కావాలని అతను పెంచుకున్నదే...తనకూ క్రమంగా, సరదాగా వుండే అతని స్వభావం నచ్చి అతని పట్ల ఆకర్షితురాలైంది! ఆ ఆకర్షణ పెళ్ళి గురించి సైతం ఆలోచించేంత గాఢంగా రూపొందింది...ఈలోపు అతను ప్రస్తావిస్తే సరే, లేకుంటే తన పోస్ట్‌గ్రాడ్యుయేషన్ పూర్తికాగానే అతన్నే పెళ్లి చేసుకుంటానని ఇంట్లో చెప్పాలనుకుంది...

ఒకందుకు తనను తాను అభినందించుకోవాలన్పిస్తోంది. ఆ విషయంలో తను జాగ్రత్తగా వుంది! అతను మొదటి

ముద్దు పెట్టుకున్నపుడు మరి కాస్త చొరవ చేయబోతే తను వారించింది. అటుపైఅతను అవకాశం కోసం ఎప్పటికపుడు ప్రయత్నిస్తూనే వున్నా, తను ఆ సందర్భం రాకుండా జాగ్రత్తపడుతుండేది. ఎపుడూ ముద్దుకి మించి హద్దుల్ని దాటనివ్వలేదు!

ఇప్పుడా ముద్దులు కూడా తలచుకుంటే ఎంతో వెగటుగా అనిపిస్తోంది!

ఇంత చేసిన అతన్ని వూరికే వదిలి పెట్టడమా?

ఎందుకు వదలాలి?

కాని, ఏం చేస్తుంది?

ఇపుడు అతని మొహం చూడ్డం కూడా తనకిష్టంలేదు.

అతను ఎదురుపడితే ఏం చేస్తుందో తనకే తెలియనంత ఆగ్రహంగా వుంది.

అన్ని మాయమాటలు చెప్పిన అతని నోరు తిరిగి పలక్కుండా గొంతు నులిమేస్తుందేమో!

కాని, అలా చేసి హంతకి కాలేదు తను.

ఓ రాస్కెల్ గురించి తన జీవితాన్ని ఎటూ కాకుండా చేసుకుంటుందా?

కర్ర విరక్కుండా పాము చచ్చే ధోరణిలో అతనికి బుద్ధి చెప్పాలి!

ఎలా?

ప్రఫుల్ల ఆలోచించి, చివరికి ఫోన్ చేసి అతన్ని ఛడామడా తిట్టెయ్యాలనుకుంది.

ఆమె తన గదిలోంచి కిందికి వెళ్లి నెంబర్ డయల్ చేసింది.

భవానీశంకరే ఫోన్ ఎత్తాడు.

"గర్ల్ ఫ్రెండ్‌తో షికార్లు అప్పుడే అయిపోయినాయా?" అంది ప్రఫుల్ల కసిగా.

"జోక్ చేస్తున్నావేమిటి ప్రఫూ? నువ్వుండగా వేరే గర్ల్‌ఫ్రెండ్ ఏమిటి?"

నిజం తెలియకపోతే ఆ అమాయకత్వానికి, అతని అభినయానికి పరవశించిపోయేదే!

"నయాగరా హోటలుకి వెళ్ళింది ఎవరితో?" గద్దించింది ప్రఫుల్ల.

"నువ్వెప్పుడు చూశావు? ఆమె నాకు సిస్టర్!" కంఠాన్ని ఇంకా అమాయకత్వం అంటిపెట్టుకునేవుంది.

"నీకు అక్కాచెల్లెళ్ళెవరూ లేరని ఒకసారి నాకు చెప్పేశావు...గుర్తులేదా?"

"సిస్టరంటే స్వంతనికాదు...కజిన్"

"ఛీ...సిగ్గులేదూ? ఇంకా బుకాయిస్తున్నావా?"

"ప్రఫుల్లా... నువ్వేం మాట్లాడుతున్నావో..."

"షటప్.. యూ రాస్కెల్! ఏమాత్రం పౌరుషమున్నా నోరెత్తి నాచేత తిట్టించుకోకుండా నేను చెప్పేది విను! నీ నీచమైన బుద్ధి తెలియదనుకున్నావు కదూ? మోసమనేది ఎంతో కాలం దాగదని తెలుసుకో! అఫ్‌కోర్స్...ఇప్పటికే నీవల్ల అమాయకురాళ్ళు కొందరు మోసపోయి వుండొచ్చు! ఆ ధీమాతో ఇదే పద్ధతి కొనసాగించావంటే త్వరలోనే నీకు ఆయువు మూడుతుంది...జాగ్రత్త!

యూజ్‌లెస్ ఫెలో! స్త్రీ అంటే నీకెంత చులకన?

మొగాడ్! శైలజ ద్వారా నీ భయంకరమైన స్వరూపం తెల్సుకుని రక్షింపబడ్డాను. లేకపోతే నీ కామదాహానికి నేనుకూడా ఒక ఎరనై వుండేదాన్నిగా. థాంక్ గాడ్! దేవుడనేవాడుంటే త్వరలోనే నీకు తగిన ప్రాయశ్చిత్తం జరగకపోదు..గుర్తుంచుకో!"

గుక్కతిప్పుకోకుండా మాట్లాడి ఫోన్ పెట్టేసిన ప్రఫుల్ల కాసేపు వేగంగా

శ్వాసిస్తుందిపోయింది!

ఆమె హృదయంలో రగిలిన బాధ, ఆగ్రహంలాంటి భావాలకు కొంత ఉపశమనం కలిగినట్టు అయింది.

* * *

మరుసటిరోజు శైలజ ప్రఫుల్లకి ఫోన్ చేసింది.

"ప్రఫూ! కలిసేందుకు వీలుపడక ఫోనుచేస్తున్నాను! ఎలా వున్నావు?"

"ఏమిటి నీ కంగారు?" ఫోన్‌లో విసుక్కున్నా ఆమె స్నేహవాత్సల్యాలకు మనసులో సంతోషపడింది ప్రఫుల్ల.

"ఏమీలేదు. ఇంకా అదే మనసులో పెట్టుకుని బాధపడుతున్నావేమోనని!"

"నేను నీ అంత 'సెన్సిటివ్' అనుకుంటున్నావా? అదే తలచుకుంటూ జీవితంపై విరక్తి పెంచుకోవడానికి! డోంట్‌వర్రీ మై డియర్ శైలూ! నౌ అయామ్‌ఓకే! అయ్ హోప్ ది సేమ్ విత్ యూ!"

"అతనితో ఏమీ గొడవపెట్టుకోవు కదూ?"

"ఏమిటి నీ భయం?"

"భయమని కాదు. అలాంటి చికాకు లెందుకని "

"నాకూ ఇష్టంలేదులే! కానీ, కొంత అయినా గడ్డి తిన్పించాలని నిన్న ఫోన్‌చేసి చచ్చేట్లు చివాట్లు పెట్టాను! కిక్కురుమనలేకపోయాడు తెలుసా?"

"పోనీలే ప్రఫూ! ఏమైనా నువు మోసపోలేదు. అందుకు నాకు ఎంతో సంతోషంగా వుంది"

"ఆ పుణ్యం నీదేకదా!"

"ఇందులో నేను చేసిందేముందని?"

"అదేమిటో నా హృదయానికి తెలుసు గాని, నువు భుజాలు తడుముకోవద్దు" బిగ్గరగా నవ్వేసింది ప్రఫుల్ల.

శైలజ ఆ ప్రసక్తి తప్పించి కాసేపు ఇతర విషయాలు మాట్లాడి ఫోన్ పెట్టేసింది.

తర్వాత కొన్నిరోజులకి భవానీశంకర్ రోడ్డుమీద కన్పించాడు ప్రఫుల్లకు.

రియాక్షను గమనించడానికన్నట్టు ఆమెకేసి చూశాడు.

ప్రఫుల్ల అతని మొహం చూడ్డంకూడా ఇష్టంలేనిదానిలా విసురుగా తల తిప్పేసింది!

అతను అర్థంచేసుకుని తల వంచుకుని మెదలకుండా తన దారిన పోయాడు.

* * *

భవానీశంకర్ నిజస్వరూపాన్ని తెలిపి శైలజ తనను పెద్ద ఆపదనుంచి రక్షించినట్టుగా భావించింది ప్రఫుల్ల. లేకపోతే ఆ రాస్కెల్ 'ఎఫైర్స్'లో తనూ ఒక 'విక్టిమ్' అయివుండేది. అది ఎంత అసహ్యకరమైన పరిస్థితి!

శైలజ తనకు చెప్పలేని మేలు చేసిందని ప్రఫుల్ల పదేపదే అనుకుంటుంది. అప్పటినుంచే ఆమెతోటి స్నేహం ప్రఫుల్లకి ప్రాణప్రదమైంది!




మనసు నిలువక చూస్తున్న ఇంగ్లీష్ మేగజైన్‌ని టీపాయ్‌మీద పడేశాడు శ్రీనివాస్.

సిగరెట్ పెట్టె, అగ్గిపెట్టె అందుకుని ఒక సిగరెట్ వెలిగించి తిరిగి వాటిని టీపాయ్‌మీద వుంచేశాడు. సిగరెట్ తాగుతూ వెళ్ళి కిటికీదగ్గర పరదాలు పక్కకు జరిపి బైటకుచూస్తూ నిలబడ్డాడు.

అతనికి చిరాకుగావుంది.

బోర్‌కొడుతోందని వెళ్ళి ఫ్రెండ్స్‌ని కలపబుద్ధి వెయ్యటంలేదు. వాళ్ళను కలుసుకుంటే, ఎప్పుడూ ఒకే గొడవ!

బిజినెస్, స్టేటస్, అమ్మాయిలు, బార్‌లు!

వాటిని తప్పించి మాట్లాడుకోవడం వుండదు.

ఆ కంపెనీలో తను ఎంతోసేపు ఇమడలేడు.

అలాగని ఒంటరిగా వుండటానికి కూడా విసుగ్గానే వుంది.

ఏం చెయ్యాలి?

మనసులో తర్కించుకోసాగాడు.

హఠాత్తుగా అతని మనోఫలకంపై శైలజ ప్రత్యక్షమయింది.

ఎందుకు అహర్నిశలూ ఈ మనసు ఆమెను గుర్తుతెస్తుంది?

ఆమె ప్రత్యేక వ్యక్తిత్వమే అందుకు కారణమా?

మరేదన్నా...?

"నమస్తే వాసూ సాబ్!" హాస్యంగా అంటున్నట్టున్న ఆ కంఠం శ్రీనివాస్ ఆలోచనల్ని చెదరగొట్టింది.

గుమ్మంవైపు చూశాడు.

ద్వారానికి ఒకవైపు చేరబడి నిల్చుంది.

ఆమెను వెంటనే గుర్తుపట్టలేకపోయాడు– మొదటిసారి కల్సినప్పుడు వేరే డ్రెస్‌లో వుండటంతో. ఇప్పుడు చీర కట్టుకుంది. స్లీవ్‌లెస్ బ్లౌజు!

జయ!

చేతులు జోడించి నిల్చుంది పెదిమ కొసలపై చిరునవ్వుతో.

"హలో" అన్నాడు శ్రీనివాస్.

"గదిలోకి రావచ్చా?" అందామె.

"వైనాట్...రండి"

అతనికి పార్టీలో పరిచయమైన ఆమె జోక్స్ చెప్పడం తన హాబీ అంటూ అసందర్భమైన ఓ జోక్ చెప్పడం గుర్తొచ్చింది.

లోపలికి వచ్చి "కూర్చోమని అనేంత వరకూ కూర్చోగూడదనే మొహమాటం నాకేమీలేదు" అంటూ సోఫాలో చతికిల పడ్డది.

శ్రీనివాస్ చిరునవ్వు నవ్వాడు.

జయ అతని విగ్రహాన్నే చూస్తోంది.

వత్తయిన నొక్కుల జుత్తు, రాజసంతో మెరిసే ముఖం, ఠీవిగా వుండే ఆకారం! 'రియలీ హేండ్‌సమ్' అనుకుంది.

"ఏమిటి...అక్కడ నుంచున్నారు?"

"ఏం తోచక" అన్నాడు పూర్తయిన సిగరెట్‌ని ఆర్పి విసిరేస్తూ.

"మీకూ బోర్ కొడుతోందా? నాకూ అంతే! అందుకే ఇలా వచ్చాను. ఇలా వచ్చేయమంది...జోక్స్ చెప్పుకోవచ్చు" అందామె.

శ్రీనివాస్‌ని చూసిన మొదటిక్షణంలోనే జయ అతనిపట్ల క్రేజ్ పెంచుకుంది. సహజంగానే కన్నెపిల్లలు మోజుపడే రూపం అతనిది!

'బాప్‌రే! చచ్చానన్నమాట...!' అను కున్నాడు శ్రీనివాస్.

'ఎలా తప్పించుకోవడం?'

"కానీ నాకిప్పుడు బైటకు వెళ్ళవలసిన అవసరం వుందే!" అన్నాడు హఠాత్తుగా స్ఫురించిన ఆలోచనతో.

"అలాగా" అంది జయ నిరాశగా.

"ఏమిటి పని?"

"ఏమిటంటే...." శ్రీనివాస్ చెప్ప లేకపోయాడు.

"వాయిదా వేసే వీ లు లే దా?" అందామె మధ్యలో.

"అబ్బే...వీ లేదు. అంత అర్జెంట్" అన్నాడు సీరియస్‌గా,

"ఎక్కడికి వెళ్లాలి?"

'ఎక్కడి పీడరా బాబూ?' అనుకున్నాడతను.

"హిమాయత్‌నగర్" అన్నాడు.

"అయితే రవీంద్రభారతివరకూ నేనూ వస్తాను. ఇక్కడ ఒక గంటయినా వుండవచ్చని మా కారుని పంపేశాను, డ్రైవరుని మళ్ళీ రమ్మని చెప్పి. మీరు అక్కడి వరకూ డ్రాప్‌చేస్తే ఒక ఫ్రెండ్‌ని కలిసి, ఆటోలో ఇంటికి పోతాను" అందామె.

'బాప్‌రే...బతికానన్నమాట! గంట చంపుదామని వచ్చిందా? సాకుచెప్పి తప్పించుకోబోవటం ఎంత మంచిదయింది?' అనుకుంటూ సంతోషించాడు అతను.

"సరే" అన్నాడు.

రవీంద్రభారతి దగ్గిర జయ కారు దిగిపోయాక శ్రీనివాస్ ఎంతో రిలీఫ్‌గా ఫీలయ్యాడు. ఎక్కడా ఆపకుండా ఒకటే మాట్లాడటం! అతనికి విసుగొచ్చేసింది. జోక్స్ అంటూ భలే వూదర గొట్టేసింది.

కారును హిమాయత్‌నగర్‌వైపు పోనిస్తుండగా శైలజను కల్సుకోబోతున్న ఆనందంతో మనసులో ఉత్సాహం వెల్లువ కాసాగింది!

* * *

"అక్కా...ఎవరో అబ్బాయి కారులో వచ్చి నిన్నడిగాడు"

పక్కవాటాలో వుంటున్న వాళ్ళ పాప జ్యోతి వచ్చి చెప్పింది.

చేస్తున్నపని అలా వదిలేసి పాపననుసరించి వీధి గుమ్మంలోకి వచ్చింది శైలజ.

కారులో స్టీరింగ్‌ముందు శ్రీనివాస్!

నయం! సమయానికి అక్క పనిమీద బైటకు వెళ్ళబట్టి సరిపోయింది!

లేకుంటే?

అప్రయత్నంగా ఆమె చేయి గుండెల మీదకు వెళ్ళింది.

"ప్రఫుల్ల థియేటర్ దగ్గరుంది. మిమ్మల్ని సినిమాకు తీసుకురమ్మని నన్ను పంపింది" అన్నాడతను శైలజను చూసి.

"నాకిప్పుడు...."

"మీరేవో సాకులుచెప్పి తప్పించుకోను ప్రయత్నిస్తే కుదరదు. మీరు వచ్చే వరకూ మీ ఇంట్లో కూర్చుని అయినా మిమ్మల్ని వెంటబెట్టుకుని తప్పితే రావద్దన్నది"

భాగ్యం కొద్దిసేపట్లో వచ్చేయొచ్చు! వచ్చి ఇతన్ని చూసిందంటే?

శైలజ గుండె గతుక్కుమంది.

"ఏమిటి? పనయ్యేవరకూ లోపలికొచ్చి కూర్చోమంటారా?"

ఆమె మౌనం చూసి రెట్టించాడు శ్రీనివాస్.

"వద్దులెండి! కారులోనే కూచోండి. ఒక్క నిమిషంలో వచ్చేస్తాను!"

చెప్పిన ప్రకారం కొద్దిసమయంలోనే తయారై గుమ్మంలో ప్రత్యక్షమైన ఆమెకేసి అభినందిస్తున్నట్లు చూశాడు.

ఆకాశపు నీలిరంగు చీర! మాచింగ్ బ్లౌజు!

ఆభరణాలు లేని కంఠం వెలితిగా ఏమీ కన్పించడం లేదు. వాస్తవానికి ఆమె కంఠాన్ని అలంకరించడం ద్వారా ఆభర

 

ణాలే నూతన అందాన్ని సంతరించు కుంటాయేమో!

తలుపులు దగ్గరికి లాగి గొళ్ళెంపెట్టి తాళం వేసింది శైలజ. అంతవరకూ తన తోడే వున్న జ్యోతికి తాళంచెవి ఇచ్చి, తను పనిమీద వెళ్లినట్లు భాగ్యంతో చెప్పమని చెప్పి, వెళ్లి కారులో కూర్చుంది.

కొంత దూరం వెళ్లాక, "మీరు నన్ను క్షమించాలి" అన్నాడు శ్రీనివాస్.

"ఏమిటి?!" అంది శైలజ.

ఆమెకు ఎంతో విస్మయం కలిగింది. అయోమయంగా చూసింది.

"ముందు మీరు క్షమించానని చెప్పండి" అన్నాడతను తిరిగి.

"ఏమిటో వివరం చెప్పకుండా మీరు ఇలా కంగారుపెట్టేస్తే ఎలా?"

శైలజ కోపగిస్తున్నట్లు చూసింది.

"ప్రఫుల్ల కోరిన మీదటకాదు మిమ్మల్ని ఇలా తీసుకొచ్చింది! ఇంతకుముందు నేను మీకు చెప్పినదంతా అబద్ధం!"

"అంతేనా?"

తేలికగా అనేసి నవ్వింది శైలజ.

మరుక్షణం—

అతని మాట అప్పటికి అర్థమైనట్లుగా "అంటే?" అంది.

ఆమె ముఖంలో కోపం అస్పష్టంగా తెలుస్తోంది. ముఖంలో స్వల్పంగా అరుణిమ చోటుచేసుకుంది.

"మీరిలా కోపగిస్తారనే భయంతోటే మీకు ఎడ్వాన్స్‌గా సారీచెప్పేసుకున్నాను. ఏం చెయ్యమంటారు? ప్రఫుల్ల ఇంట్లోలేదు. బోర్ బాధిస్తుంటే చటుక్కున మీరు గుర్తొచ్చారు.అంతే! ఇలా వచ్చేశాను. నేను తీసుకున్న చొరవ మీకు సరైనదికాదన్పిస్తే సారీ! నాతో ఈ విధంగా రావడం మీకిష్టం లేకపోతే చెప్పండి. మిమ్మల్ని ఇంటి దగ్గర డ్రాప్ చేసెయ్యమంటారా?" అతనికంఠం మర్యాదతో కూడుకునివుంది.

అతని మాటలు వింటుంటే శైలజలో ఏవేవో ఆలోచనలు!

చిరాకుగా వున్నప్పుడు ఇష్టమైనవాళ్ల సన్నిధిలో గడపాలన్పిస్తుంది!అలా మనసు సేదదీరి,ఆ చిరాకు మటుమాయమవుతుంది.

అతనుతనను అంత సన్నిహితురాలిగా భావిస్తున్నాడా?

శైలజకి వెంటనే పార్టీకి అతని ఆహ్వానం, వెళ్లనందుకు ప్రశ్నించడం, సినిమా ప్రోగ్రాంలో తనను కలపటం, రోడ్ పైన తారసపడి లిఫ్ట్ ఇవ్వడము... అంతా గుర్తొచ్చింది.

ఇదంతా ఏమిటి?

సమాధానం స్పష్టమవటం లేదు!

శ్రీనివాస్ జవాబు కోసమన్నట్లు ఆమె వైపు చూశాడు.

అది గ్రహించి, "స్టీరింగ్ మీ చేతిలో వుంది" అంది.

ఆమె అంగీకారము కలిగించిన సంతోషాన్ని పట్టలేకపోయాడు.

"థేంక్ యూ.. థేంక్ యూ వెరీమచ్"

ఆమె చేతిని అందుకుని మృదువుగా నొక్కాడు.

శైలజ విస్మయంగా అతనికేసి చూసింది. అతని స్పర్శ గమత్‌గా,ఆమెకు మునుపు ఎన్నడూ కలుగని విధమైన ఫీలింగ్ కలుగజేసింది.

"సారీ" అన్నాడు తప్పు గుర్తించినట్లు.

"ఇట్సాల్‌రైట్" మృదువుగా అంది.

"ముందు హోటల్‌కిపోయి ఏమైనా తిని తర్వాత సినిమాకి"

ప్రోగ్రామ్ చెబుతున్నట్టు అన్నాడు.

"ఇప్పుడేమీ వద్దు"





"ఓన్లీ ఐస్‌క్రీమ్!? కాదనరాదు!"

"సరే!" అప్పటికి నిరాకరించడము బాగుండదని ఒప్పుకుంది.

హోటల్‌లో—

"ఫ్రెండ్లీగా అడుగుతున్న ఈ ప్రశ్న లకి మరోలా భావించకుండా జవా బిస్తారా?" అన్నాడు.

అతని ఉపోద్ఘాతానికి భృకుటి ముడి పడగా "అడగండి" అంది మామూలుగా.

"రోజంతా ఏం చేస్తూంటారు?"

"ఇంటి పనుల తోటే సరిపోతుంది! మీలా మాకు కదిలినా, మెదిలినా సౌకర్య ముండదుగా" అంది నవ్వుతూ.

"మీ అక్కగారున్నారేమో?!" అతని ప్రశ్నలో ఆశ్చర్యం సందేహం మిళితమై ధ్వనించాయి.

"......"

ఇబ్బందిగా నవ్వి తల వంచుకుంది.

ఆమెకు తనపై గల ద్వేషం, తద్వారా తమనడుమ చోటుచేసుకున్న అంతరం, శిక్షిస్తున్న ధోరణిలో పనులన్నీ తనపై వదిలేసి,ఇరుగుపొరుగుమహిళలతో ఉబుసు పోక కబుర్లతో కాలం వెళ్లబుచ్చే భాగ్యం తరహా గురించి అతనికి ఎలా చెబుతుంది?

ఎంతైనా కుటుంబ విషయాలు!

"సారీ... నా ప్రశ్న ఇబ్బంది కల్గించి నట్టయితే......" అని,

"ఇంటిపనులు కాక తక్కిన సమయంలో ఎలా గడుపుతుంటారు?" అన్నాడు.

"పుస్తకాలు చదువుతాను" చెప్పింది శైలజ.

"ఎవరివి చదువుతారేమిటి?"

కొందరి పేర్లు చెప్పిందామె.

"మంచి టేస్టే!" అని కాంప్లిమెంట్ ఇచ్చాడు.

చిన్నగా నవ్వి వూరుకుంది.

"పుస్తకాలు లైబ్రరీనుంచి తెచ్చు కుంటారనుకుంటాను"

"అవును"

"లైబ్రరీకి ఏ టైంలో వెళతారు?"

శైలజకి ఇవన్నీ అతనికెందుకో అర్థం కాకపోయినా, అనవసరమన్పించినా చెప్పి నందువల్ల తనకు నష్టమేమిటన్నట్టుగా చెప్పింది.

హోటల్ నుంచి కారుని థియేటరుకి. పోనిచ్చాడు.

వీరు వెళ్ళేసరికి సినిమా ప్రారంభమై పోయింది.

చీకటిలో తడుముకుంటూ వెళ్ళి సీట్లలో కూర్చున్నారు.

సినిమా కొంత నడిచాక శైలజ మనసులో అనుమానం తలెత్తింది.

'శ్రీనివాస్ ఏ ఉద్దేశంతో నన్నీ సినిమాకు తీసుకొచ్చినట్టు?'

సెక్స్‌వేవ్‌లో వచ్చిన మలయాళపు సినిమా అది!

యువలోకంలోని బలహీనతలను రెచ్చగొడుతూ, ఆడ - మగ మధ్యగల సంబంధాలను అసభ్యంగా చిత్రీకరిస్తూ తీయబడింది.

శైలజ కూర్చున్న సీటుమీద చాచి వుంచిన శ్రీనివాస్ చేయి కొంతసేపటికి ఆమె భుజంమీదకి చేరుకుంది.

అలా యధాలాపంగా జరిగివుంటుం దన్న అభిప్రాయంతో శైలజ అంతగా పట్టించుకోలేదు.

తెరమీద నడుస్తున్న సెక్స్‌సీన్ శ్రీనివాస్‌లో వుద్రేకాన్ని రగిలిస్తున్నది!

అతనికి ఈ సినిమా నడుస్తున్నట్టు తెలియదు. శైలజతో కలిసి సినిమా చూడటమనే ధ్యాసతప్పితే, అతను సినిమా

ఏమిటో పట్టించుకోలేదు.

నెమ్మదిగా శైలజ ముఖంవైపు తలవంచాడు శ్రీనివాస్! సినిమా అతన్ని ఏం జరుగుతోందీ విస్మరించి ప్రవర్తించే రకంగా ప్రభావితంచేసింది. హఠాత్తుగా అతను పెదవులతో శైలజ పెదవులను గాఢంగా చుంబించాడు!

శైలజకి ఒక తప్పిదం జరిగింది ఏమిటో గ్రహించలేని మైమరపుకు లోన యింది. ఆ అనుభవం ఆమెకూ తియ్యదనాన్నే అందించింది.

కానీ, ఏం జరిగిందీ తెలిశాక ఆమె ముఖం ఎర్రబడింది.

బుగ్గల్లోకి వెచ్చటి ఆవిరి చిమ్మింది.

'అతను తనను ఎలాంటి వ్యక్తిగా వూహించుకున్నట్టు?'

చివాలున లేచినిలబడి విసవిసా బైటకు నడిచింది.

అపుడు శ్రీనివాస్‌కి తన పొరపాటు అర్థమయింది.

ఆమెను పిల్చేందుకు నోరు పెగల్లేదు. వెళ్ళి అడ్డుకునేందుకు ధైర్యం చాలలేదు.

నిర్విణ్ణుడై అలా చూస్తూండిపోయాడు.

శైలజ బైటకు వచ్చాక గుర్తించింది-తన దగ్గిర డబ్బులు లేని విషయం. బస్‌లో వెళ్ళడం కుదరదు.

అందుచేత ఆటో ఎక్కి అడ్రస్ చెప్పింది.

ఆమె మదినిండా ఆలోచనలు ముసురుకున్నాయి!

'ఛీఛీ! అతన్ని గురించి ఎంత వున్నతంగా వూహించుకుంది?'

తన వూహల్ని తలకిందులుచేస్తూ చాలా సాదాగా, మామూలు మగాడిలా ప్రవర్తించాడు.

బాహ్యప్రవర్తననుబట్టి వ్యక్తుల మనస్తత్వాలను అంచనా వెయ్యరాదేమో!?

తనపట్ల ఇంత చనువుగా ప్రవర్తించడంలో అతని అసలు వుద్దేశం ఏమై వుంటుంది?

తనతో ఒక ఎఫైర్ సాగిద్దామన్న ఆలోచనా?

ఛఛ! ఏమిటి?

ఈరోజు తన కేమయింది?

మనసు ఇంత అడ్డదిడ్డంగా ఆలోచిస్తోందేమిటి?

శైలజ ఆలోచనల్ని అరికట్టేందుకు ప్రయత్నించింది.

ఊహూఁ! ఆమె శక్యం కాలేదు.

ఆమె మనసును పట్టలేకపోతోంది!

అది వశంతాకుండా, కళ్ళెంలేని గుర్రంవలె పరిపరివిధాల పోతోంది!

తను పొరపాటున అతను తనపట్ల కనపరుచుతున్న ఆసక్తి, చనువులను ప్రేమగా అర్థంచేసుకుందా?

అతను తనను ప్రేమించడం ఎంతవరకూ నిజం?

లేదు. అదెలా సాధ్యం?

అతనికీ, తనకూ నడుమ కోట గోడలాంటి అంతస్తుల అడ్డుగోడ వుంది.

ఇక ప్రేమకు తావెక్కడిది?

ప్రేమ వున్నా అది పెళ్ళివరకూ దారి తీస్తుందా?

ప్రేమకు పర్యవసానం పెళ్ళేనా?'

"ఎట్లా పోవాలమ్మా?" ఆటో డ్రైవర్ అడిగాడామెను - వీధి మలుపు దగ్గరికి వచ్చాక.

శైలజ ఆలోచనల్ని అదిమిపెట్టి అతనికి తమ వీధి చూపించింది.

* * *

మరునాడు-





పుస్తకాలు మార్చుకునేందుకు లైబ్రరీకి వెళ్లింది శైలజ.

తను చదివినవాటిని ఇచ్చేసి, కొత్త పుస్తకాలు సెలెక్ట్‌చేసి తీసుకుని, కాసేపు మేగజైన్స్ చదువుతూ కూర్చుంది. ఇంతలో నీరజ వచ్చి పలకరించింది. ఇద్దరూ వెళదామనుకుని లైబ్రరీ బైటకు వచ్చారు.

నీరజ చెబుతున్న కబుర్లు వింటూ నడుస్తున్న శైలజ చకితురాలయింది, మెయిన్‌గేటుదగ్గిర నిలుచున్న వ్యక్తిని చూసి.

శ్రీనివాస్!

ఆమెకేసి చూస్తున్నాడు దీనంగావున్న ముఖంతో. అతని కళ్లు క్షమార్పణను అర్థిస్తున్నట్టు వున్నాయి.

ఒకక్షణం ఆమె అడుగు ముందుకు పడలేదు. మరుక్షణంలోనే ఆ తడబాటు నుంచి సర్దుకుంది, పక్కనున్న నీరజ తనలోని ఈ హఠాత్పరిణామాన్ని గుర్తు పట్టిందంటే అన్న విచక్షణతో. లేనిపోని ఆరా మొదలెట్టి అసలుసంగతి చెప్పేవరకూ వదలదు.

తలవంచుకుని నీరజ మాటలను అవసరానికిమించిన ఏకాగ్రతతో వింటూ, శ్రీనివాస్‌ని దాటుకుని ముందుకు సాగిపోయింది.

"శైలజా... ఒక్కమాట!" అన్న పలుకులు శ్రీనివాస్ పెదవుల్ని దాటలేదు.

పక్కన ఎవరోవుండగా ఇలా పలకరించి మాట్లాడటం, ఆమె ఆగ్రహాన్ని రెట్టింపుచేస్తే అన్న సంశయం అతన్ని మౌనమూర్తిని చేసింది.

అందంగా కదులుతూ దూరమవుతున్న ఆమె తనూలతను చూస్తూ విగ్రహంవలె నిలబడ్డాడు.

పలకరించనందుకు నిజంగానే శైలజ తనను మనసులో అభినందించుకుంటున్నట్టు అతనికి తెలియదు.

ఇంటికెళ్ళిన కొంతసేపటివరకూ శ్రీనివాస్ తలపులు వీడలేదు శైలజ మనసుని.

వాలకాన్నిబట్టి అతనలా వచ్చింది క్షమార్పణ కోరేందుకని స్పష్టమవుతోంది.

కానీ నిన్నటి అతని చర్య ఎందుకో తన మనసుని మెత్తబడనీయటంలేదు. తిరిగి అతనికి తారసపడటం అయిష్టంగా వుంది.

రేపుకూడా అతను ఈవిధంగానే లైబ్రరీ దగ్గర ఎదురుచూడవచ్చు. అతన్ని తప్పించుకోవాలంటే తప్పదు, కొన్ని రోజులు తను లైబ్రరీకి వెళ్ళడం మానుకోవాలి. పుస్తకాలు మార్చాలంటే జ్యోతి వెళ్లివస్తుంది. చూసిచూసి అతనే విసిగిపోయి తన నిరీక్షణని విరమించుకుంటాడు.

శైలజ వూహించినట్టే శ్రీనివాస్ రోజూ అదేవేళకు లైబ్రరీకి వెళ్ళి, నిరాశతో తిరిగిపోవటం జరుగుతోంది.

నాలుగురోజులు గడిచాక-

ఆ రోజు జ్యోతి పుస్తకాలతో పాటు చిన్న చీటీ కూడా తెచ్చి ఒంటరిగావున్న శైలజకి ఇచ్చింది.

"ఏమిటిది?" అంది శైలజ చీటీని చూడగానే.

"ఏమో... నాకేంతెలుసు? మొన్నొకసారి కారులో వచ్చిన అబ్బాయి ఇచ్చాడు లైబ్రరీలో కనపడి" అనేసి వెళ్లిపోయింది జ్యోతి.

శైలజ చీటీ విప్పి చదివింది.

సంబోధన ఏమీలేదు.

"మీకు నా ముఖం చూడటం కూడా ఇష్టంలేదని లైబ్రరీకి రాకపోవడం ద్వారా తెలియపర్చుతున్నారని నేను గుర్తించా

న్లేండి!

కనీసం మీనుంచి క్షమార్పణపొందే అర్హతకూడా నాకులేదా?"

అని మాత్రం రాసివుంది.

చదివి ఆలోచనల్లోపడిందామె.

'అతని ప్రవర్తన పొరపాటే!

అందుకు తనకు కోపం రావడమూ సహజమే!

కానీ, అతను తన తప్పు గుర్తించి, అలా ప్రవర్తించినందుకు మన్నించమని క్షమార్పణను అర్థిస్తుంటే...? ఇంకా ఆ కోపాన్ని కొనసాగించడం...మూర్ఖత్వం కదూ?

క్షమించడంలోవున్న ఔన్నత్యం, మనశ్శాంతి, శత్రువుమీద పగతీర్చుకోవ డంలో వుండదంటారు!

శ్రీనివాస్ తనకి శత్రువుకూడా కాడే!

ప్రేమించినవాళ్ళని అంత తేలికగా క్షమించలేము అన్న మాటలో నిజముం దన్పిస్తుంది!

చూస్తుంటే తను స్వల్పవిషయానికి అనవసరమైన ప్రాధాన్యతను ఆపాదించి పెద్దది చేస్తున్నట్టు కన్పిస్తూంది!'

ఈ రకమైనఆలోచనల్లతో శైలజ మనసు శ్రీనివాస్‌తో తిరిగి మామూలుగా వుండే సంకల్పానికి వచ్చేసింది.

* * *

ప్రఫుల్ల గదిలో కూర్చుని ఆమెతో మాట్లాడుతోంది శైలజ.

అంతలో శ్రీనివాస్ ఆ గదిలోకి వచ్చాడు.

గుమ్మానికి ఎదురుగావున్న సోఫాలో కూర్చున్న శైలజ పిడుగొచ్చినట్టు టక్కున మాట్లాడటం ఆపేసింది.

ఆమెకు అభిముఖంగా కూర్చున్న ప్రఫుల్లకి కారణం తెలియక, తల తిప్పి చూస్తే - గదిలోకి వస్తున్న శ్రీనివాస్ కన్పించాడు.

అతడు శైలజను పలకరించకపోవడం, కనీసం పలకరింపుగా నవ్వనైనా నవ్వక పోవడం గమనించింది ప్రఫుల్ల.

తలవంచుకుని గదిలోకి వచ్చి తన పని చూసుకుని తిరిగి తలవంచుకుని వెళ్ళిపో తున్నాడు.

ప్రఫుల్లకి ఏమీ అర్థంకాలేదు.

భాష తెలియని సినిమా చూస్తున్నట్టు వుంది.

చూపుల్ని కిందకు వాల్చేసిన శైలజ ముఖాన్ని ఒకసారి పరిశీలిస్తున్నట్టు చూసి, గదిలోనుంచి వెళ్ళిపోతున్న శ్రీనివాస్ వైపు తల తిప్పింది.

"వాసూ!"

గుమ్మం వరకూ వెళ్ళిన శ్రీనివాస్ ప్రఫుల్ల పిలుపుకి ఆగాడు.

తల తిప్పి ఏమిటన్నట్టుగా చూశాడు.

"ఇలారా"

"ఏమిటి?" అన్నాడు కదలకుండా.

"రా..చెప్తాను"

కనుబొమలు చిట్లిస్తూ దగ్గరికివచ్చాడు.

"మీట్ మై డియరెస్ట్‌ఫ్రెండ్ మిస్ శైలజ"

వారికి పరిచయంచేస్తున్నట్టుగా అంది.

"శైలూ...ఇతను మా అన్నయ్య శ్రీనివాస్"

ఆమె ధోరణికి తడబడ్డాడు శ్రీనివాస్.

శైలజ చివ్వున తలయెత్తి ప్రఫుల్లకేసి చిరుకోపంగా చూసింది.

ప్రఫుల్ల చొరవగా శ్రీనివాస్ చేయి అందుకుని, శైలజ చేతిని అతడికి అందించింది.

శైలజ చప్పున తన చేతిని వెనక్కి లాక్కుంది.




"ఏమైంది మీకు? ఒకరికొకరు తెలియనట్టుగా ప్రవర్తిస్తున్నారు?" ప్రఫుల్ల ఆరా తీస్తున్నట్టు అంది.

శ్రీనివాస్‌కి కంగారుపుట్టింది.

ప్రఫుల్ల గట్టిగా ఆరాతీసి ఆరోజు జరిగిన విషయం తెల్సుకుందంటే...?

"ఏంలేదు ప్రఫూ! కాస్త అర్జెంట్ పనుంటే..."

కంగారుని కప్పిపుచ్చుకునే ప్రయత్నం చేశాడు. కానీ, కొంతవరకే సఫలమయ్యాడు.

"ఏమిటా పని?"

ప్రఫుల్ల గ్రహించేసింది- కేవలం సాకుగా చెబుతున్నాడని.

"... ..."

ప్రఫుల్ల ప్రశ్నకు శ్రీనివాస్ బదులేమీ ఇవ్వలేకపోయాడు.

ప్రఫుల్ల లేచి నిలుచుంది.

"గొప్ప అర్జెంట్ పనే అని తెలుస్తోంది గానీ, ముందు నువ్విక్కడ కూర్చో"

"అరె... ప్రఫూ!"

"నథింగ్ డూయింగ్ డియర్!"

అతడిని భుజాలుపట్టి, తను అంతవరకూ కూర్చున్న సోఫాలో కూర్చునేట్టు చేసింది.

"నేనిపుడే టీ తెస్తాను. అంతవరకూ నా ఫ్రెండ్‌కి చక్కటి కంపెనీ ఇవ్వడం నీ డ్యూటీ! తెల్సిందా?"

శ్రీనివాస్‌కి తర్జని చూపిస్తూ ఆగదిలో నుంచి వెళ్ళిపోయింది.

శైలజ తల వంచుకు కూర్చుంది. శ్రీనివాస్ ఎటో చూస్తున్నట్టు కూర్చున్నాడు.

వారిద్దరూ మాటలు మర్చిపోయినట్టు వున్నారు.

ఇరువురిలోనూ కలవరపాటు!

ఇద్దరికీ ఆ మౌనం భరింపరానిదిగా వుంది. అదే సమయంలో మౌనాన్ని ఛేదించడానికి ఇద్దరూ వెనుకాడుతున్నారు

"ఆ చీటి చదివి కోపంపోయి, నన్ను అర్థం చేసుకుంటారనుకున్నాను. అందుకే ఈరోజు తప్పక లైబ్రరీకి వస్తారని ఎంతో ఎదురుచూశాను. కానీ, రాలేదంటే మీకు కోపం అలాగే వుందన్నమాట" అనిఅడగాలని అతను.

"లైబ్రరీ దగ్గిర మీరు ఎదురుచూస్తారని తెలుసు. కానీ, కలిసి మిమ్మల్ని క్షమించానని చెప్పడం ఎందుకో గిల్టీగా అన్పించి, నాకు మనస్కరించలేదు. కానీ, ఎప్పటికైనా మీపైన ఎటువంటి కోపమూ లేదని చెప్పేందుకు మిమ్మల్ని కలుసుకోవాలనుకున్నాను.అందుకేలైబ్రరీకి రాకపోవడం" అని చెప్పాలని ఆమె.

చివరికి శ్రీనివాస్ మనసుని వ్యక్తీకరించేందుకు సిద్ధమయాడు.

"ఆరోజు సినిమా థియేటరులో జరిగిన దానికి తర్వాత చాలా సీలయ్యాను. ఏదో తెలీని ఆవేశంతో మీ మనసు కష్టపడేట్టు, మీకు కోపం వచ్చేట్టు ప్రవర్తించాను. సారీ... నన్ను క్షమించండి"

అతను క్షమార్పణను అర్థిస్తున్న ధోరణికి శైలజ విచలితురాలైంది.

"నేను కూడా విపరీతంగా ప్రవర్తించాను'' అంది నెమ్మదిగా.

"తప్పు నాదే."

"లేదు... మీకు సున్నితంగా చెప్పవలసిందిపోయి మొరటుగా, మానర్స్ తెలియనట్టుగా చేసిన నాది"

టీ కప్పులున్న ట్రేతో గదిలోఅడుగు పెట్టిన ప్రఫుల్ల ఆ సంభాషణ వింది.

వారిద్దరి మధ్య ఏదో చిన్న అపార్థం జరిగినట్టుగా అర్థం చేసుకుంది.

"తప్పు నిజానికి మీ ఇద్దరిదీను! లేకుంటే ఏదో విషయంలో చిన్న పొరపాటు జరిగి వుండవచ్చు. అంత మాత్రానే మాటలు మానేస్తారా? ఏం మనస్తత్వాలు? బొత్తిగా ఎడ్జస్ట్‌మెంట్ తెలియని మనుషులు...బతుకలేరమ్మా ఈ కాలంలో" మందలిస్తున్నట్టుగా, హెచ్చరిస్తున్నట్టుగా అంటూ ట్రేను టీపాయ్ మీద వుంచింది.

"ఊఁ! శైలజా... నువ్వు శ్రీనివాస్‌కి కప్పు అందించు. వాసు నీకు ఇస్తాడు" చెప్పింది.

ప్రఫుల్లమాటని అమలుపరిచారు వాళ్లు. నవ్వు ముఖాలతో ఒకరికొకరు కప్పులు అందించుకున్నారు.




రెండు జతల కళ్లు! చూపులు ఆర్తిగా పెనవేసుకున్నాయి.

ముఖాల్ని గమనించుకుంటున్నాయి తదేకంగా!

అవి ఏదో వెదుక్కుంటున్నట్టు... తమకు కావలసిన దేనికోసమో ...

అది దొరికినట్టయి ఆ భావనతో కనులలో కాంతిపుంజాలు ... ముఖాన సంతృప్తితోకూడిన దీప్తి!

అలా ఎన్నో క్షణాలు నిశ్శబ్దాన్ని జతచేసుకుని కాలవాహినిలో కరగిపో తుంటే...అతనిలో చిలిపి ఆలోచన!

కుడి కంటి రెప్ప ఒక క్షణంలో కంటిని మూసేసి వెంటనే తెరుచుకుంది!

ఆ అల్లరికి సిగ్గు ఆమె చెక్కిళ్ళ యందు అరుణిమను ప్రతిఫలించింది! కను రెప్పలు సోగగా వాలి,కనులు అరమోడ్పు లయినాయి!

ఆ భంగిమ ఆమె ముఖానికి సంత రించిన మరింత సమ్మోహనత్వానికి ముగ్ధుడై...

అతని ముఖం ముందుకు వంగి ఆమె ముఖానికి చేరువఅయి...అతని పెదిమలు సున్నితంగా ఆమె కనురెప్పలను స్పృశించి ముక్కుపైనుంచి, ఇంకా జారితే...?

పెదిమలు!

కల్సుకున్నాయి...

మొదట సున్నితంగా... తర్వాత,

ఇంకా గాఢంగా...

రెండు జతల పెదిమల కలయికలో ఇంత తియ్యదనం ఎక్కడిది?

అంతే!

శ్రీనివాస్‌కి మెలకువొచ్చేసింది!

కల!

కళ్ళు విప్పగానే కల్ల అయిపోయే కల!

"కాలమిలా ఆగిపోనీ

కల నిజమై సాగిపోనీ...."

ఈ పాటలో ఎంత మ ధు రం గా వుంటుంది ఆ కవి భావన!

బహుశా ఇటువంటి కలనుంచే స్ఫూర్తి పొందాడేమో!

శ్రీనివాస్ తన ఆలోచనలకు నవ్వు కున్నాడు.

"శైలూ....!మైడియర్ శైలూ...!" ఆమె పేరు స్మరిస్తూ,

స్వప్నాన్ని నెమరువేసుకుంటూ, తిరిగి నిదురలోకి జారుకునే ప్రయత్నంచేశాడు.




రెండు రోజుల తర్వాత, సిటీ సెంట్రల్ లైబ్రరీలో....

శైలజ పీరియాడికల్స్ సెక్షన్‌లో కూర్చుని పత్రికలు చూస్తోంది.

"హలో!" పలకరింపు వినబడి చూసింది.

శ్రీనివాస్! చిరునవ్వుతో నిలబడి వున్నాడు.

తనకోసం వచ్చాడా? ఆమె నిల్చునే ప్రయత్నం చేయబోయింది.

"అహ..వద్దు!చదువుకోండి!మిమ్మల్ని చూసి పలకరించానంతే!"

అతను తగ్గుస్థాయిలో చెప్పి, మరొక టేబిల్ వద్దకు వెళ్ళిపోయాడు.

శైలజకి చూస్తున్న పత్రికపై ఆసక్తి తగ్గిపోయింది.

ఉమెన్స్ రీడింగ్ రూమ్‌లో చదువుకునేందుకు కొత్త పత్రికలేవీ లేక ఇక్కడికి వచ్చి కూర్చుంది. రోజూ అయితే అక్కడే కాసేపు చదువుకుని వెళ్ళిపోయేది.

ఆమె కళ్ళు శ్రీనివాస్‌కోసం వెదికాయి.

కొంచెం దూరంలోని టేబిల్‌వద్ద కూర్చుని ఏదో పత్రిక తిరగేస్తున్నాడు.

అతని ధోరణిచూస్తే పత్రికను చదువుతున్నట్టుకాక, యధాలాపంగా పేజీలు తిరగేస్తున్నట్టుంది.

శైలజ చూపులు మరల్చుకుని,కాసేపు చేతిలోని పత్రికపై దృష్టి, ధ్యాసల్ని నిలిపేందుకు ప్రయత్నించింది.

ఊహుఁ..ఆమెకు సాధ్యంకాలేదు.

ఇక వెళ్ళిపోవాలని నిర్ణయించుకుని శ్రీనివాస్‌కి చెప్పేందుకు అటు వెళ్ళింది.

ఆమె తన టేబిల్‌వేపు వస్తుండటం గ్రహించి అతను తలతిప్పి అడిగాడు.

"ఏమిటి? వెళ్ళిపోదామనా?"

"అవును" అన్నట్టు తల వూపింది.

"పదండి...నేను డ్రాప్ చేస్తాను"

అతను కుర్చీలోంచి అప్పటికే లేపడంతో, ఆమె వారించబోయిందే ఆగిపోయింది.

ఇద్దరూ పక్క పక్కనే నడుస్తూ బైట పార్క్ చేసివున్న ఫియట్ దగ్గరికి వచ్చారు.

అతను ఆమెకోసమన్నట్టుగా ఫ్రంట్ డోర్ తెరిచి పట్టుకున్నాడు. ఆమె కూర్చున్నాక డోర్ వేసి చుట్టూ తిరిగివచ్చి డ్రయివింగ్ సీటులో కూర్చుని కారును స్టార్ట్ చేసి రోడ్డుమీదికి పోనిచ్చి నెమ్మదిగా నడపసాగాడు.

అతను ఇక్కడికి రావడం, తనను కలవడం యాదృచ్ఛికమా? లేక తనను కలిసేందుకే లైబ్రరీకి వచ్చాడా? ఆలోచిస్తే అతను తనను కలిసేందుకే పనిగట్టుకుని వచ్చాడనిపిస్తోంది. కాకుంటే, తనను పలకరించడం, వెళ్ళిపోతానన్నప్పుడు కారులో దింపుతాననడం ఎందుకు?

శైలజ ఆలోచనలమధ్య "ఏమిటలా వున్నారు?" అన్నాడతను.

"ఏమీలేదు" అంది పరధ్యానంగా.

"ఏమీలేదా?" అతను రెట్టిస్తున్నట్టుగా చూశాడు.

"........."

మౌనంగా అతనికేసి చూసి 'అవు' నన్నట్టు తల పంకిస్తూ కళ్ళు కిందికి దించుకుంది.

"మీరు అబద్ధం చెబుతున్నారు. నిజానికి మీరేదో బాధ పడుతున్నారు కదూ! నిజంగా ఏమీ లేకపోతే నేను 'అలా వున్నారేమిటి?' అని అడగగానే 'ఎలా?' అని ఎదురుప్రశ్న వేసి వుండేవారు. కాదా?" అన్నాడు శ్రీనివాస్.

శైలజ మౌనంగా వినడే తప్ప ఏమీ మాట్లాడలేదు.




నిజమే! ఈరోజు పొద్దున్నే భాగ్యం చిన్న కారణానికే పెద్దగా రాద్ధాంతంచేసి చుట్టుపక్కలవారంతా వినేలా, చూసేలా తనను ఏడిపించింది. ఇరుగుపొరుగువాళ్ళు పైసాఖర్చులేని ఆ వినోదాన్ని చోద్యంగా చూసి విని ఆనందించారు. ఆ అవమాన భారంతో మనసంతా ఏదోగా అయి పోయింది.

"మీ మనసులో బాధేమిటో నాకు చెప్పండి. సంతోషాన్ని ఇతరులతో పంచుకుంటే రెట్టింపు అవుతుందట. బాధ ఇతరులతో చెప్పుకుంటే సగమవుతుం దట" అంటున్నాడు శ్రీనివాస్.

మౌనం.

"ఫ్రెండ్స్, సన్నిహితులు వుండేది మన వేదనను అర్థంచేసుకుని ఓదార్పు, సహాయాలు అందించేందుకు కూడా అని మీకు తెలియదా? సందేహిస్తున్నా రెందుకు?"

శైలజ అప్పటికీ పెదవి విప్పలేదు.

"ఓ! నేను మీ మనసు తెలుసు కోకుండా మీకు దగ్గరివాడిలా ఫీలయి పోయి మాట్లాడేస్తున్నాను. మీకది ఇష్టం లేదన్న మాట...సారీ! నేనేమో అనుకు న్నాను" అన్నాడతను అపాలజెటిక్‌గా.

ఈ మాటతో ఆమెలో చలనం కలిగింది

"ఊహూ! అదేంలేదు. దయవుంచి అలా అనుకోకండి! నాకు ప్రఫుల్ల ఎంతో మీరూ అంతే!" అంది కంగారుగా.

"థేంక్యూ!" అతను సంతోషపడి పోతూ "ఇప్పుడైనా చెప్పండి..మీ బాధకు కారణమేమిటో" అన్నాడు.

"బాధకాదు. కొద్దిగా మనసు బాగో లేదు. చెప్పదగ్గ కారణం కాదుగనక చెప్పుకోవడంలేదంతే!"

ఆమె మనసులోని మాటను చెప్పే సింది.

"ఆల్‌రైట్!" అంటూ కారును ఓ హోటల్ దగ్గిర ఆపాడు శ్రీనివాస్.

"కాఫీ తాగుదాం. మీకేమీ అభ్యం తరంలేదుకదూ?" అన్నాడు ఆమెకేసి చూస్తూ.

ఆమె లేనట్టు తల వూపింది.

ఇద్దరూ కారు దిగి హోటల్‌లోకి నడిచారు.

చిన్న హోటల్! ఫేమిలీ రూమ్‌లో కెళ్ళి కూర్చున్నారు.

మిగిలిన టేబిల్స్‌వద్ద ఎవరూ లేరు.

"ఏమన్నా తిందామా?"

బేరర్‌కి ఆర్డర్ చేసేముందు అడిగాడు శ్రీనివాస్.

"వద్దు. ఓన్లీ కాఫీ ప్లీజ్!"

ఆర్డర్ తీసుకుని వెళ్ళిపోయాడు బేరర్.

మౌనం!

ఆ మౌనం వారికి ఇబ్బందికరంగా లేదు.

తమ మధ్య మాటల అవసరం లేనట్టు, ఆ సాహచర్యమే చాలు అన్నట్టు, ఆ మౌనమే ఎంతో బాగున్నట్టు, ఇరువురిలో ఎవరూ పెదవి మెదపడంలేదు.

కాఫీ కప్పులతో వచ్చిన బేరర్ వారిద్దరినీ ఆశ్చర్యంగా చూశాడు.

అతను ఎన్నో జంటల్ని చూశాడు– ఫామిలీ రూముల్లో ఏకాంతం దొరికితే చాలు, దూరాన్ని భరించలేనట్టుగా ఒకరి మీద ఒకరు వాలిపోయి మాట్లాడుకునే వాళ్ళూ, పరిసర ప్రపంచాన్ని మరచి ముద్దులు కూడా పెట్టుకునే ప్రేమికులూ..

అలాంటిది, వీళ్ళు మౌనంగా వూసు లాడుకోవడం అతన్ని విస్మయపరచింది.



కాఫీ కప్పులు టేబిల్ మీద పెట్టి అక్కడినుంచి వెళ్ళిపోయాడు!

ఒకరికేసి మరొకరు చిరునవ్వుతో చూస్తూ కప్పులు అందుకున్నారు వాళ్లు.

కాఫీ తాగాక "కాసేపు వుందామా? వెంటనే వెళ్ళిపోవాలా?" అన్నాడు శ్రీనివాస్.

"ఫర్లేదు!" అంది శైలజ.

అతని సమక్షంలో ఇంతవరకూ మనసును కలతపెడుతున్న భావం నుంచి సేదదీరినట్టు వుంది శైలజకి. ఒంటరితనంలో మళ్ళీ ఆ దిగులు ప్రవేశిస్తుంది.

అందువల్ల అతనితో మరికాసేపు గడపాలన్పించింది.

అతనికీ అంతే! అప్పుడే విడిపోవాలని లేదు!

ఇలా వాళ్లు పరస్పరం ఒకరి సమక్షాన్ని మరొకరు అభిలషిస్తున్నా, చిత్రంగా, మాటలకి అవకాశం లేని మౌనంతోనే కాలం గడిపారు.

భాషకందని భావమేదో మనసును ఆవరించివుండగా వారికి మాటలతో పనేముంది?

ప్రేమికుల హృదయాల్ని పెనవేసే శక్తి మాటలకంటే మౌనానికే ఎక్కువ!

నిజం!

ఎందుకంటే – మౌనం మనసు భాష కనుక.

* * *

"శైలజా!"

"ఊఁ!"

"ఏమిటి, రావడం లేదు?"

"......"

ఆమె ఏమీ చెప్పలేకపోయింది.





సమాధానం ఆమెకైనా స్పష్టంగా తెలిస్తే కదా చెప్పడానికి!

"నేను కలవడం ఇష్టంలేకా?"

"లేదు...లేదు" కంగారుగా అంది

"మరి?"

మౌనం.

ఇంతవరకూ ప్రఫుల్ల కోసం వెళ్ళేది వాళ్ళింటికి. వారానికొకసారైనా వెళ్లక పోతే ఆమె వూరుకోదు.

ఆమె కూడా అంతే! వారంలో ఓ పర్యాయం తను కూడా శైలజను కలుసుకుంటుంది.

ఇప్పుడు ప్రఫుల్ల కోసం వెళితే అతను కూడా వుంటాడనే...

ఆ భావం ఏమిటో అవగతం కాదు.

అది ఇష్టమా? అయిష్టమా?

ఏమో!

అందుకే శైలజ వెళ్లాలనుకుంటూనే, వాళ్లింటికి వెళ్లకుండా గడిపేసింది.

ఇంతలో ఈ ఫోను!

"వారమైంది"

"ఆ!?"

"మీరు కన్పించి వారం రోజులైంది"

"......"

ఏమంటుంది?

అతని కంఠంలోని ఆర్తికి స్పందిస్తున్న హృదయంతో మౌనం వహించింది.

"మీకేం అన్పించలేదా?"

"......"

ఎందుకు అన్పించలేదు.

అతను గుర్తురాని రోజు వుందా?

అతని స్మరణతో మైమరచని క్షణాలున్నాయా?

కాని,

అది ఎలా చెబుతుంది?

ఎందుకు చెబుతుంది?

"ఏమీ మాట్లాడవేం?"

"ఏం మాట్లాడమంటారు?"

"ఏదైనా చెప్పు!"

మనసుకే మాటలు వస్తే 'నిన్ను ప్రేమిస్తున్నా' అని చెబుతుంది. అలా మనిషి హృదయంలోని ప్రతి భావన బహిర్గతమవకూడదనేమో మాట్లాడే విధి నోటికివ్వబడింది!

"సారీ, ఫోన్ పెట్టెయ్యమంటావా?"

"అహ.... ఎందుకు?"

"దేనికి...నువ్వేం మాట్లాడనప్పుడు!"

అంతలోనే గుర్తించినట్టుగా, "ఓహ్.... సారీ" అన్నాడు.

"సారీయా?"

"మిమ్మల్ని నువ్వు అనేస్తున్నాను"

"ఫర్లేదు"

ఈ దగ్గరితనమే బావుందని చెప్ప లేకపోయింది.

"థేంక్యూ! ఈరోజైనా కలవకూడదూ? ఇప్పుడు వచ్చేందుకు వీలుపడుతుందా?"

"ఎక్కడికి?"

"సెంట్రల్ లైబ్రరీ దగ్గరుండు. నేను ఓ పది నిముషాల్లో వచ్చేస్తాను"

"అలాగే"

"ఈ వారంరోజులు నిన్ను మిస్సయి నట్టు ఎంతగా అన్పించిందో తెలుసా? ప్రఫుల్ల దగ్గరికి వచ్చి వెళ్ళిపోతావని, నేను కూడా తను ఇంట్లో వున్న సమయంలో ఎక్కడికీ వెళ్ళకుండా నిరీక్షించాను"

"సారీ! నిరాశపరచానా?"

"నిరాశా? ఇంతటి ఆశాభంగం ఇన్నేళ్ళ జీవితంలో ఎన్నడూ అనుభ వంలోకి రాలేదు"

శైలజ హృదయ స్పందనలో ఏదో మార్పు!

తనను కోరుకున్న పురుషుడి నుంచి ఇలాంటి మాటలు వినడంకంటే స్త్రీకి ఇంకేం కావాల్సివుంది?

"ఇక పెట్టేస్తాను శైలజా! పది నిముషాల్లో లైబ్రరీ దగ్గరుంటాను. తప్పక వస్తావుకదూ"

"ఊఁ"

'రాకుండా వుండగలనా?' అని చెప్పలేకపోయింది.

అతను ఫోన్ పెట్టేశాడు.

మెదడు మధురమైన పదార్థమేదో నింపుకున్నట్టుగా ఆమె హృదయమంతా తీయటి భావం అలుముకుంది!

కారు ఎంత వేగంగా నడిపాడో, శైలజ నడిచి కొద్ది నిముషాల్లో లైబ్రరీకి చేరు కునేటప్పటికే శ్రీనివాస్ వచ్చేసి అక్కడ వెయిట్ చేస్తున్నాడు.

శైలజను చూడగానే అతని ముఖం చిరునవ్వుతో వెలుగు నింపుకుంది.

ఆమె పెదవులు విడివడని నవ్వుతో పలకరించింది!

"కూర్చో"

ఆమె డోర్ తెరిచి వెనుక సీట్లో కూర్చుంది.

"ఎక్కడికి తీసుకెళ్ళమంటారు? ఫర్మాయియే మేమ్ సాబ్"

శ్రీనివాస్ స్టీరింగ్ పైనుంచి తీసేసి, చేతులు కట్టుకుని సీరియస్‌గా అడిగాడు.

శైలజకి అతని భావం అర్థమైంది. తన ప్రవర్తనకు సిగ్గుపడింది.

"సారీ" అంటూ కారు దిగి ముందు సీటులో అతని పక్కన కూర్చుంది.

"దట్స్ గుడ్" శ్రీనివాస్ నవ్వుతూ కారు స్టార్ట్ చేసి పోనిచ్చాడు.

"ఎక్కడికి వెళ్దాం?" కారు నెమ్మదిగా నడుపుతూ అడిగాడు.

"మీ ఇష్టం"

"నేను 'నువ్వు' అంటున్నప్పుడు నువ్వు 'మీరు' అనడమేమిటి? వద్దు... ఐడోంట్ లైకిట్"

"కాని, నాకలాగే బావుంటుంది"

"భక్తి, గౌరవాలా?"

"అహ ... అదేంకాదు"

"అంటే, నేనంటే గౌరవం లేదన్న మాట"

శైలజ నివ్వెరపాటుగా అతని ముఖం లోకి చూసింది.

అతను తమాషా చేస్తున్నట్టు గుర్తించి నవ్వేసింది.

"నీ ఇష్టప్రకారమే కానీ! నేను స్నేహం లాంటి తీయటి బంధాల్లో బహువచనాన్ని హర్షించను.స్నేహంలో మర్యాద, గౌరవా లాంటి భావాలకు స్థానంలేదు. నువ్వు వీలైనంతవరకూ ఏకవచనాన్ని ఉప యోగిస్తే సంతోషిస్తానని గుర్తుంచుకో" చిరునవ్వుతో చెప్పాడు.

శైలజ మనసులో మధురమైన భావమేదో నెలకొంది.

"చెప్పు ... సినిమాకా, మరెక్కడి కైనానా?"

"అవేమీ వద్దు"

"నాకూ ఇష్టం లేదు. నీ ఇష్టమేమో కనుక్కుందామని అడిగాను".

"......"

"సరే...ఓ పనిచేద్దాం. యూనివర్శిటీ కాంపస్ వైపు వెళ్దాం. ఈ జంట నగరాల్లో నాకిష్టమైన ప్రదేశాల్లో అది ఒకటి. చాలా కాలమైంది అటుగా వెళ్ళి... సరేనా?"

"మీ ఇష్టం"

కారు ఆ దారి పట్టింది.

విద్యానగర్‌లో ఒకచోట కారు ఆపాడు.

శైలజ ప్రశ్నార్థకంగా చూసింది.

"ఇప్పుడే వస్తాను" అంటూ కారు దిగి, పళ్ళ దుకాణం వైపు నడిచాడు.

యాపిల్స్ కొని పట్టుకొచ్చాడు.

విండో లోంచి వంగి వాటిని శైలజ పక్కనే సీటు మీద వుంచాడు.

తర్వాత డోర్ తెరుచుకుని కారులో కూర్చుని, డేష్ బోర్డు లోంచి బటన్ నైఫ్ తీసి, "కోసుకుని తిందాం" అంటూ శైలజకిచ్చాడు.

శైలజ నైఫ్‌తోపాటు ఒక యాపిల్ అందుకుంది.

శ్రీనివాస్ కారు స్టార్ట్ చేసి పోనిచ్చాడు.

కత్తితో సన్నగా పండుపై తోలును చెక్కేసి, ఎనిమిది భాగాలుగా కోసి ముక్కలు అందించబోయింది.

"ముందు నువ్వు తింటే..." అతను వారించాడు.

ఆమె ఒక ముక్క తిన్నాక, తనో ముక్క అందుకున్నాడు.

అలా ఆమె తింటూ, అందిస్తుంటె... అతను ఒక చేతిని స్టీరింగ్‌పై వుంచి కారు నడుపుతూ, మరో చేత్తో ముక్క లందుకుని తింటూ...

శైలజకి అది సహజమైన సన్ని వేశంలా అన్పిస్తోంది.

ఆమె కొత్తగా ఏమీ ఫీలవడం లేదు. మొహమాటం, సందేహం లాంటి భావాలేమీ లేవు ఆమె మనసులో!

పండు కోసి తను తింటూ, అతనికి పెట్టడం ఎప్పటి నుంచో అలవాటయిన క్రియలా, తమ మధ్య ఆ సన్నిహితత్వం మామూలే అన్నట్టుగా వుందామెకు.

శ్రీనివాస్ తింటూ ఏదో మాట్లాడు తుంటే ఆసక్తిగా వింటోంది.

ఇంతలో ఓ కారు రాష్‌గా వీళ్ల కారును డేష్ కొట్టబోయినట్టుగా మీదకు వచ్చి, రాసుకుంటూ వేగంగా ముందుకు





దూసుకుపోయింది.

శ్రీనివాస్ మెలకువగా స్టీరింగ్ తిప్పి, కారును స్ట్రుఫన పక్కకు కోసి సడెన్ బ్రేక్ వేశాడు.

హఠాత్తుగా జరిగిన ఈ ప్రమాదానికి సిద్ధంగా లేని శైలజ భయంతో శ్రీనివాస్ భుజంమీదికి తల వాల్చి, గట్టిగా కళ్లు మూసుకుంది.

అనుకోకుండా అతని చేయి భరోసా ఇస్తున్నట్టుగా ఆమె భుజాన్ని పట్టుకుంది.

"మైగాడ్! తృటిలో ఎంత ప్రమాదం తప్పింది? రాస్కెల్స్! ఫుల్‌గా తాగి పోతున్నట్టున్నారు" అన్నాడతను ఎర్ర బడ్డ మొఖంతో.

దూరంనుంచి ఆ కారులో వాళ్ల వెకిలి నవ్వులు, అరుపులు కీచుగా వినబడు తున్నాయి.

శైలజ చప్పున అతని భుజం మీది నుంచి తలతీసి సరిగ్గా కూర్చుంది. ఆమెకు భయంతో తన గుండె కొట్టుకునే సవ్వడి తెలుస్తోంది.

శ్రీనివాస్ చేయి ఆమె భుజంమీది నుంచి స్టీరింగ్ పైకి మారింది.

"భయపడ్డావా?" అన్నాడు ఆమె ముఖంకేసి చూస్తూ. శైలజ సిగ్గుగా కళ్లు వాల్చేసి, ఏమీ తోచనట్టుగా తల వూపింది.

"ఒకవేళంటూ లేకుండా తప్ప తాగి ఇలా రోడ్లమీదపడి తిరగడం ఓ అల వాటైపోయింది. స్కౌండ్రల్స్!" అన్నాడు కోపంగా

తిరిగి కారు స్టార్టు చేసి నెమ్మదిగా నడప సాగాడు.

అతనికా సన్నిహితత్వం ఎంతో బావుంది! శైలజకి కూడా అలాగే వుంది.

ఆర్ట్సు కాలేజీ దగ్గిర ఖాళీ ప్రదేశంలో శ్రీనివాస్ కారు ఆపేశాడు.

"ఇక్కడ కాసేపు ఆగుదాం!" చెప్పాడామెకి.

డాష్ బోర్డులోని సిగరెట్ పాక్ లోంచి సిగరెట్ తీసి వెలిగించుకున్నాడు.

ఒక పఫ్ లాగి పొగను విండోలోంచి బైటకు వూదాడు.

శైలజకేసి తిరిగేసరికి ఆమె విస్మయంగా తనవంకే చూస్తోంది.

"మీకు సిగరెట్ అలవాటుందా?"

శ్రీనివాస్ అప్పుడు తను చేసిందేమిటో తెల్సినట్టుగా, "ఓహ్...సారీ!" అంటూ సిగరెట్ ఆర్పి బైటికి విసిరేశాడు.

"అరె..పారేస్తారెందుకు?" అందామె.

"నీకు సిగరెట్ వాసన పడక పోవచ్చేమో కదా! అందుకే నీదగ్గిరి కొచ్చేటప్పుడూ,నీతో కలసి వున్నప్పుడూ సిగరెట్ తాగను. దానివల్లే నీకు ఇంత వరకూ నాకు సిగరెట్ అలవాటున్నట్టు తెలియంది!"

శైలజకు సంతోషమన్పించింది. అతను తన గురించి అలవాటు మార్చు కోవడం...

ఎందుకుండాలి అలా? తనను అతని కనుగుణంగా మార్చుకోవచ్చు కదా...!

కాని, అలా చేయలేదంటే...?

ఎంత చిన్న సంఘటన అయితేనేం, ఇష్టాన్ని స్పష్టంచేసేది...

"కాల్చుకోండి! నాకేం అభ్యంతరం కాదు. కాని, అది ఆరోగ్యానికి హాని కరమని తెలిసి కూడా, సిగరెట్ ఎందుకు తాగుతారనే..."

అతను ఒప్పుకుంటున్నట్టు, "నిజమే.. మానేయాలి" అన్నాడు.

కాసేపు గడిచాక-

"ఇకముందు నిన్ను ఇలా ఫ్రీగా

కలిసేందుకు వీలుపడదేమో!" అన్నాడు అతను.

శైలజ ప్రశ్నార్థకంగా చూసింది.

"మా నాన్నగారు ఇక బిజినెస్ అంతా నామీద వదిలేస్తానంటున్నారు. ఆ వ్యవహారాల్ని ఆకళింపు చేసుకోవడానికి రేపటినుంచీ మా కంపెనీలన్నిటికీ తిరగాలి. ప్రారంభంగనుక పూర్తి కాన్సంట్రేషన్‌తో గమనించాలి. మరో ధ్యాస వుండకూడదు. కంపెనీ వ్యవహారాలన్నింటినీ మంచినీళ్ళప్రాయంగా అర్థంచేసుకున్నాక ఇక మన ఇష్టం.మనం స్వయంగా వెళ్ళకుండా ఫోన్లమీదే బిజినెస్ నడిపించవచ్చు" అతను వివరిస్తున్నట్టుగా చెప్పాడు.

ఆమె మౌనంగా వింటోంది.

"ఎంతసేపూ నేను మాట్లాడటమేతప్ప నువ్వు ఏమీ మాట్లాడవేం?" అన్నాడు శ్రీనివాస్ హఠాత్తుగా.

"నాకు వినడమే బావుంటుంది!"

"అదీ కారణం" అని నవ్వాడతను.

శైలజ అర్థంకానట్టు చూసింది.

"ప్రఫుల్ల ఎవరితోనూ ఎక్కువకాలం స్నేహం చేయదు. ఎవరితోనైనా ఆమె స్నేహం కొంతకాలమే! ఆమెకందరూ సీజనల్ ఫ్రెండ్స్! అలాంటిది సంవత్సరం పైనుంచీ నీ స్నేహం ఎలా నిలుపుకుందా అని నాకో సందేహం వుండేది. ఇప్పుడు అర్థమైంది. నువ్విలా వుండటంవల్ల ఛాటర్‌బాక్స్ లాంటి ప్రఫుల్ల వాక్ప్రవాహం అడ్డులేకుండా సాగిపోయే వీలుందన్న మాట! అందుకే ప్రఫుల్లనీతో స్నేహం-అదీ గాఢ స్నేహం చేస్తోంది!" అన్నాడతను నవ్వుతూ.

శైలజ సిగ్గుపడింది.

కాసేపాగి "మీరు మా స్నేహాన్ని తక్కువగా అంచనావేశారు" అంది.

"వూరికే జోక్ చేశాను. మరోలా అనుకోవద్దు" అంటూ అతను చేతికివున్న వాచీలో టైంచూసి "అరె... మనం వచ్చి రెండుగంటలపైనే అయిందే! నాకు తెలియలేదు. నువ్వు తొందరగా వెళ్ళిపోవాలేమో! ఇంటిదగ్గిర దింపెయ్యనా?" అన్నాడు.

"మరో గంటవరకూ నాకు ఫర్లేదు" అంది శైలజ.

భాగ్యం మేట్నీ సినిమాకి వెళ్ళింది. ఆమె తిరిగొచ్చే సమయానికి ఇంటికి చేరుకుంటే చాలు. కొంచెం ఆలస్యమైనా గొడవేం వుండదు. పనులు తనపై పడకపోవడమే ఆమెకు కావాల్సింది. అలా జరిగినంతకాలమూ శైలజ స్వేచ్ఛకు ఏవిధమైన ఆటంకమూ కల్పించదు.

ఆమె సమాధానానికి సంతోషపడ్డాడు శ్రీనివాస్.

ఆమెకు తనతో ఇంకా గడపాలని వుందన్నమాట! ఆమె జవాబు పరోక్షంగా అదే సూచిస్తోంది.

నిజానికి తనకూ అప్పుడే ఆమెను వదలాలని లేకపోయినా మర్యాదకోసం అడిగాడు.

ఆమెనుంచి తనకు అనుకూలమైన సమాధానం రావడం అతనికి ఎంతో వుత్సాహాన్ని ఇచ్చింది.

"అయితే ఈ గంటలో నగరాన్ని ఓ వైపునుంచి చుట్టేద్దాం"

అతను కారు స్టార్ట్‌చేసి ముందుకు పోనిచ్చాడు.

* * *

'అనుకోనిది జరగడమే జీవితం!' అనే సూక్తిని నిజం చేస్తున్నట్టు శైలజ తలవని తలంపుగా ఉద్యోగంలో చేరింది!

అసలు ఆమె డిగ్రీ ఫలితాలు వచ్చి నప్పటి నుంచే ఉద్యోగప్రయత్నాలు చేస్తోంది.

కాని, భాగ్యంకు అది ఇష్టం లేదు.

ఆమె ఉద్యోగస్తురాలైనట్టయితే, ఆమెపై తను చెలాయించే పెత్తనానికి తిలోదకాలివ్వాల్సిందేనని ఆమె భయం!

పైగా, పని భారం తనపై పడుతుంది. ఆమె ఉద్యోగపు పనిమీద వెళ్లిపోతే, రోజంతా ఇంటిపని, వంటపని ఎవరు చేస్తారు? ఆ చాకిరీ తనవల్ల అవుతుందా?

ఇరుగుపొరుగు ఇళ్ల వెంబడి తిరుగుతూ కబుర్లతో కాలక్షేపం చేసేందుకు అసలే వీలుపడదు. అలా తిరగకుండా, ఇంట్లో కట్టిపడేసినట్లు పడి వుండటమే! అంతకు మించిన శిక్ష వుంటుందా?

తనకా భయంకర పరిస్థితి తలచుకుంటేనే ఎంతో దుర్భరంగా అనిపిస్తోంది. అలాంటిది, అనుభవంలోకి వస్తే...?

శైలజను ఉద్యోగం చేయనిస్తే ఆమెకు రెక్కలొచ్చేసినట్లయి, విడిగా స్వతంత్రంగా బతకాలనుకోవచ్చు.

అంతవరకూ రానిస్తే పరిస్థితి చేయి దాటిపోయినట్టే!

అప్పుడిక తను చేయగలిగిందేమీ వుండదు!

అంచేత-

శైలజను ఉద్యోగం చేయనివ్వ గూడదు.

చేస్తానంటే ఒప్పుకోగూడదు.

ఈ ఆలోచనతో అడ్డుపడింది భాగ్యం!

ఒకరోజు పేపర్లో ఓ ప్రకటన చూసి ఆశపడింది శైలజ!

అది ఓ ప్రైవేటు కంపెనీలో ఆఫీస్ అసిస్టెంటు పోస్టు!





తను చదివిన బియ్యే గ్రాడ్యుయేట్ నే కావాలని అడిగారు. టైపు, షార్టుహేండు లాంటి ఎక్స్ట్రా క్వాలిఫికేషన్లు ఏమీ కావాలనలేదు. పూర్వానుభవం అసలే అడగలేదు.

శైలజకి ఆశకలిగింది. అప్లయి చేస్తే ఏం, అదృష్టం బాగుంటే ఆ ఉద్యోగం తనకు రావచ్చనే నమ్మకం చిక్కింది.

పోస్టు ఖర్చులకి, సర్టిఫికెట్ల ఫొటోస్టాట్ కాపీలకీ డబ్బు అవసరమై భాగ్యాన్ని

"అక్కా! ఓ అయిదు రూపాయలు ఇస్తావా?" అని తటపటాయిస్తూనే అడిగింది.

భాగ్యం ఆపెకేసి ఎందుకన్నట్లు చూసి అలవాటైన గద్దింపు స్వరంతో అడిగింది.

ఆమె ఆ సంగతి విచారించకుండా డబ్బులివ్వదని తెలిసి కూడా ముందే ఆమెకు విషయం చెప్పకపోవడం తన పొరపాటేననుకుంటూ,

"ఓ ఉద్యోగానికి అప్లికేషన్ పెడదామని" అని చెప్పింది శైలజ.

"ఉద్యోగమా?" ఆమె కళ్లు గుచ్చి చూశాయి.

"ఇప్పుడు నీవు ఉద్యోగం చేయాల్సిన అవసరమేమిటట?"

"అదేమిటక్కా! డిగ్రీ పూర్తి చేసి..."

శైలజ మాటల మధ్యలోనే— "చదువుకుంటే మాత్రం ఉద్యోగం చేయాలనే రూలెక్కడైనా వుందా? నువు ఉద్యోగం చేసి మమ్మల్ని ఉద్ధరించేదేంలేదుగానీ అలాంటి ప్రయత్నాలు మానుకో!'' నిష్కర్షగా చెప్పేసింది భాగ్యం.

శైలజ మనసు నొచ్చుకుంది.

"అయినా ఈ ఉద్యోగం నీకొస్తుందనే నమ్మకం ఏమిటి?"

భాగ్యం వితండవాదంలోకి మారింది.

"అవకాశం వుంది కదా! అప్లయిచేసి చూస్తే..." శైలజ నసిగింది.

"డబ్బు విలువ నీకేం తెలుసు? ఇలాంటి దండగమారి ఖర్చులు చేస్తుంటే రోజులు వెళ్లినట్టే! ఇప్పటికే ఆయన జీతం ఇంటి ఖర్చులకి సరిపెట్టలేక సతమతమవుతున్నాను. సినిమాలు కూడా తగ్గించి చూడాల్సివస్తోంది"

ఆమె దృష్టిలో సినిమాలకి పెట్టే ఖర్చు దండగ కాదు. అది నిత్యావసరం! దాదాపు విడుదలైన ప్రతి సినిమా వదలనట్టు చూస్తుంది.

"మళ్లీ మళ్లీ ఇలా ఉద్యోగ ప్రయత్నాలకంటూ డబ్బులడగకు, తెలిసిందా?" అనే మందలింపుతో తన తుది నిర్ణయం చెప్పేసింది భాగ్యం.

భాగ్యం తనపట్ల దురుసుగా ప్రవర్తించడం తనకయ్యే ఖర్చు గురించేమో, వాళ్ల ఇంట్లో వూరికే పడి తింటోందని ఆమె కోపమేమో, తను కూడా వుద్యోగం చేసి సంపాదిస్తే ఆ బాధ తీరుతుందేమోనని తను ఆలోచించింది. కాని, ఆమె తను వుద్యోగం చేయడం ఇష్టం లేనట్లు తేల్చేసింది.

శైలజ ఇంకేం మాట్లాడలేక నిర్లిప్తంగా వుండిపోయింది.



# 11

చదువు పూర్తిచేసి కూడా శైలజ ఇంట్లోనే వుండటం చూసి ఇరుగుపొరుగు వాళ్లు, "మీ చెల్లెలి చదువు అయిపోయినట్లుంది కదా! ఉద్యోగం చేయదా, ఏమిటి?" అనసాగారు.

"నేనే వద్దన్నాను!" అంది భాగ్యం కావాలనే! 'ఆ ఇంటికి తనే సర్వాధికారిణి' అనే విషయం వారికి గుర్తుచేయాలని.

"ఎందుకు వద్దనడం?"

"చేసి మాత్రం ఎవరిని వుద్ధరించాలి గనక!" అనేది భాగ్యం మనసు దాచుకోకుండా.

వాళ్లు ఇంకా ప్రశ్నించబోతే ఆ ఆరాలు తనకిష్టం లేనట్లు మాట మార్చేసి, మరో విషయంలోకి సంభాషణను మళ్లించేది.

నగరాలలో ఒకరి సంగతి మరొకరికి పట్టదు! పక్క పక్క ఇళ్లలోనే వుంటూ ఒకరి గురించి ఒకరు తెలుసుకోకుండా, గమనించకుండా బతికేస్తారని చెబుతుంటారు గానీ అది కొంతవరకే నిజం!

పోష్ లొకాలిటీల్లో, బంగళాలలో నివసించే సంపన్న వర్గం అలా ఇతరుల్ని పట్టించుకోకుండా వుండే మాట నిజమే! కాని, నాలుగైదు వాటాలుగా విభజించిన ఒకే ఇంట్లో వుండక తప్పని మధ్యతరగతి కుటుంబాలవారిలో పరులగురించి పట్టించుకునే స్వభావం, పల్లెటూళ్లలో వున్నంత మామూలుగానే వుంటుంది.

పరుల బాగోగులపై అలాంటి కుతూహలం తాయారమ్మలో మరికాస్త అధికం!

ఆమె తన కర్తవ్య నిర్వహణలా భావిస్తూ, శైలజ ఉద్యోగం చేయకపోవడం గురించి కనుక్కుంది.

భాగ్యం అందరికీ ఇచ్చిన సమాధానమే ఆమెకూ చెప్పింది.

అయితే మిగిలినవారు వూరుకున్నట్లు

తాయారమ్మ వూరుకోలేదు. అదే ఆవిడ ప్రత్యేకత!

'అదేం మాట! పిచ్చిదానివా?' అన్నట్టు చూసి,

"ఆమె వుద్యోగం చేయడం నీకే లాభం కాదూ!" అంది తాయారమ్మ.

"నాకు లాభమా? అదెలాగా??'' అని ఆశ్చర్యపడింది భాగ్యం.

"కాదేమిటి మరీ! ఆమె వుద్యోగం చేసి జీతం తెస్తుందా! అదంతా బేంకులో ఎక్కవుంటు మొదలెట్టి నెలనెలా జమచేస్తే సరి! ఆ డబ్బు ఆమె పెళ్లికి కట్నంగా అక్కరకొస్తుంది. మీరు మీ డబ్బును ఆమెకు ధారపోసే అవసరం తప్పుతుంది.. ఏమంటావు? నా సలహా మంచిదేనా? కాదా?" అనడిగింది తాయారమ్మ.

భాగ్యం ఆలోచనల్లో పడింది.

శైలజ పేరున ఒక ఎకరం భూమి వుంది. అది తల్లిదండ్రులు పోతూ మిగిల్చింది. భాగ్యం ఆ సంగతి ఇతరులకి తెలియనివ్వలేదు. తల్లిదండ్రుల మరణంతో శైలజ కట్టుబట్టలతోనే తనకు భారంగా వచ్చిపడ్డదని, ఆమెకంటూ ఏమీలేదని, ఆమె బాధ్యత పూర్తిగా తనపై మోపబడిందని చెప్పి ఇరుగుపొరుగుల నుంచి కావలసినంత సానుభూతికూడా సంపాదించుకుంది ఆమె.

ఇప్పుడామెకు తాయారమ్మ సలహా బాగానేవున్నట్టనిపించింది.

'నిజమే!

శైలజను ఉద్యోగం చేయించి కట్నం డబ్బు ఆవిధంగా కూడబెడితే–

ఆమె పేరునవున్న భూమిని తన పరం చేసుకోవచ్చు.

తనదెంత మొద్దు బుర్ర!

ఇంతవరకూ ఆ ఊహే రాలేదు.

నిజంగా ఎంత చక్కటి ఆలోచన కదూ!' అనుకుంది భాగ్యం.

''మీరు చెప్పింది బాగానే వుంది. చూద్దాం" అంది తాయారమ్మతో.

''ఇంకా ఆలోచించాల్సిందేముందీ! ఉద్యోగమే చూడాలి!'' అని సాగదీసింది ఆవిడ.

''అలాగే!" అంది భాగ్యం.

''మరి నే వస్తానూ" అంటూ లేవబోయింది ఆవిడ.

''కూర్చోండి...కాఫీతాగి వెళ్దురు'' అని వారించింది భాగ్యం.

"రోజూ దాదాపు ఈ వీధిలోని ఇళ్ళన్నీ తిరుగుతుంటాను గాని, నీలా కాఫీ ఇచ్చి ఆదరించేవాళ్లు తక్కువమ్మా!'' అందావిడ మెచ్చుకోలుగా.

భాగ్యానికైనా, ఆవిడ వచ్చిన ప్రతి సారీ కాఫీ ఇచ్చి పంపే అలవాటు లేదు.

ఇప్పుడావిడ తనకు లాభించే సలహా ఇచ్చింది గదా!అందుకు–

ఇలాంటి సలహాలతో చిన్న చిన్న ప్రయోజనాలు పొందడమే ఆవిడ వుద్దేశం కూడా!

కాసేపటి తర్వాత భాగ్యం ఇచ్చిన చిక్కటి కాఫీ తాగి తృప్తిగా వెళ్లిపోయింది.

* * *

అప్పటి నుంచీ భాగ్యం రుసరుసలు ఎక్కువయ్యాయి!

హఠాత్తుగా ఆమెలోవచ్చిన ఈ మార్పు శైలజకి మొదట అర్థంకాలేదు.

'మన వీధిలోని ఫలానా అమ్మాయి చదువు పూర్తిచేసిన రెండు నెలలకే ఉద్యోగం సంపాదించుకుంది. తెలివితేటలంటే అలావుండాలి' అంటుంది– నేరుగా ఆమెతో చెబుతున్నట్లు గాక తనలో తను

అనుకుంటున్నట్లు.

'మొద్దురాచిప్పలా ఇంట్లో కూర్చుంటే, చదివిన చదువుకు సార్థకత ఏముంటుంది? ఇంతోటిదానికి అంత డబ్బు ఖర్చుపెట్టి చదవకపోతేనేం? చిన్నదో చితకదో ఒక వుద్యోగమంటూ చేస్తే ఆ తీరు వేరు! ఆలోచించేవాళ్లకే అర్థమవుతుంది!' అంటుంది.

శైలజకి అర్థమైంది!

భాగ్యం బాధ-తను వుద్యోగం చేయాలని.

ఆమెకు ఎంతో వింతగా అన్పించింది.

ఉద్యోగం వద్దంటూ తన ప్రయత్నాల్ని నిరోధించిందీ ఆమే-

ఉద్యోగం చేయడం లేదంటూ ఇప్పుడు నిష్ఠూరమాడుతున్నదీ ఆమెనే-

'రెండు నాల్కల మనిషి' సామ్యం గుర్తొచ్చింది శైలజకి.

"నా వుద్దేశం ఇది"అంటూ ఏదీ నేరుగా చెప్పదు భాగ్యం.పరోక్షంగా ఆవిషయాన్ని పదే పదే ప్రస్తావిస్తూ, ఇతరులనుంచే ఆ ప్రసక్తి వచ్చేట్లు వ్యవహారం సాగిస్తుంది.

ఆమె స్వభావం తెలిసిన శైలజ, "ఇప్పుడేమంటావక్కా?" అని అడిగేసింది.

"నేను అనేదేమిటి? ఎవరి సంగతి వారికి తెలియాలిగానీ-"

శైలజ మౌనం వహించింది.

ఇక ఆమే చెబుతుంది.

"నీవు ఇంట్లో కూర్చున్నందుకు నేను మాటలు పడాల్సివస్తోంది. అంతా నన్నే అంటున్నారు-నీవు వుద్యోగం చేయడం నాకిష్టం లేదని. ఉద్యోగాలూ సద్యోగాలూ ఇంతవరకు మన కుటుంబంలో లేవు గనక వద్దన్నానే తప్ప నాకేం? ఉద్యోగం చేయాలని నీకు గట్టిగా వుంటే, కాదంటానా? ఆ 'ఇష్టం' నీకు లేకపోవడం నా తప్పా? ఇందులో నా ప్రమేయం లేకపోయినా, లోకులకి నాదే తప్పుగా కన్పిస్తోంది" అంటూ మసిపూసి మారేడు కాయ చేసినట్లుగా తన మనసులోనిమాటను వెల్లడించింది భాగ్యం.

శైలజ తిరిగి వుద్యోగ ప్రయత్నాలు ప్రారంభించింది.

వాటిలో ఓ ప్రయత్నం ఫలించి ఇప్పుడీ వుద్యోగం-

ఒక కాన్వెంటులో తెలుగు టీచర్‌గా-

లీవ్ వేకెన్సీ అది! మూడు నెలల వరకే వుంటుంది.

శైలజ ఉద్యోగం వచ్చిన వెంటనే ప్రఫుల్లకు ఫోన్‌చేసి ఆ విషయం తెలిపింది.

ఆమె అభినందించి, "ఎక్కడ? ఏమిటి?" అని వివరాలు కనుక్కుంది.

తర్వాత, "జీతం ఎంత?" అనడిగింది.

శైలజ చెప్పింది.

"అంత తక్కువా?" అంది ప్రఫుల్ల ఆశ్చర్యపోతూ.

"నెలనెలా నేను ఖర్చుచేసే పాకెట్ మనీ అంతలేదు! ఎందుకు చేరావు,ఇలాంటి వుద్యోగంలో?"

"ఏంచేస్తాం? మాలాంటివారికి అదే పదివేలు!" అంది శైలజ-ఆమె మాటల్ని మామూలుగా తీసుకుంటూ.

"ఓ...అయామ్‌సారీ శైలూ! నీ మనసు నొప్పించేలా మాట్లాడాను కదూ!" అంది ప్రఫుల్ల తన పొరపాటు గుర్తించి.

"ఫర్లేదు!"

"కాని, నాకు నీమీద కోపంగా వుంది తెలుసా?"

"కోపమా?"

"అవును... కోపమే!"

"ఎందుకు?"

"నువ్వీ వుద్యోగంలో చేరినందుకు.

మా డాడీ పలుకుబడితో ఈజీగా ఉద్యోగం సంపాదించుకోవచ్చని నీ కెన్ని సార్లు చెప్పాను? మరోచోట కాకపోతే మా సొంత కంపెనీలలో అయినాచేయవచ్చు అన్నానే! నువు వినలేదుకదూ? నీకసలు ఈ కాలంలో ఎలా బతకాలో తెలీదు. పోజు కొడుతూ దాన్ని ఆత్మాభిమానం అనుకుంటావు. ఇప్పుడంత తక్కువ జీతానికి ఆ కాన్వెంటులో రోజంతా నోరుచించుకుంటూ కష్టపడటం బాగుంటుందన్న మాట!"

ప్రఫుల్ల కంఠంలో బాధ స్పష్టంగా తెలుస్తోంది.

"పాఠాలు చెప్పడం నోరు చించు కోవడం ఎలా అవుతుంది? టీచింగ్ ప్రొఫెషనంటే నాకెంత ఇష్టమో చెప్పాను కదా! పైగా, నిష్కల్మషంగా వుండే పసిపిల్లల మధ్య రోజంతా గడపటం ఎంత హాయిగా వుంటుందో తెలుసా?"

తను సంతోషంగా వున్నట్టు ఆమెకు అర్థమవ్వాలని వుత్సాహంగా, నవ్వుతూ చెప్పింది శైలజ.

"నీకు నేను చెప్పగలదాన్ని కాదుగానీ టాపిక్ మారుద్దాం" అంది ప్రఫుల్ల.

కాసేపు మాట్లాడి ఫోన్ పెట్టేసింది శైలజ. రిసీవర్ క్రెడిల్ చేశాక గుర్తొచ్చిం దామెకి—తను శ్రీనివాస్ గురించి మరచి పోయినట్టు.

"ఫోన్ చేసేటప్పుడు అతనికి చెప్పా లనుకుంది కాని, ప్రఫుల్లతో మాటల్లోపడి తోచలేదు.

అయినా ప్రఫుల్ల చెప్పకుండా వుంటుందా?

కాని, తనే స్వయంగా చెప్పడం వేరు!

దీనికి అతనేమీ అనుకోడు కదా!' అనే సందేహంలో పడింది.

శైలజకి వుద్యోగం వచ్చినందుకు సంతోషించిన భాగ్యానికి అది తాత్కాలిక మైనదని తెలియగానే నిరుత్సాహం ఆవరించేసింది.

"ఇది మూడునెలల ముచ్చటే కాబట్టి నీవు వుద్యోగ ప్రయత్నాలు మానవద్దు. మరో మంచి వుద్యోగంవస్తే ఇదిమధ్యలోనే మానేసి అందులో చేరవచ్చు... అలా జరగకపోతే, ప్రయత్నాలు అలాగే చేస్తుంటే ఈ మూడు నెలలు అయ్యేసరికి మరో ఉద్యోగం రావచ్చు...తెలిసిందా?" అంటూ సలహా పూర్వకంగా ఆమెను ఆజ్ఞాపించింది భాగ్యం.

దానికి శైలజ అలాగేనన్నట్టు తల వూపింది.

* * *

శైలజ వుద్యోగ జీవితంలో మొదటిరోజు.

ఆమె కాన్వెంటు ప్రారంభమయ్యే సమయానికి ఒక అరగంట ముందే అక్కడికి చేరుకుంది. కాన్వెంటు ఇంటికి దగ్గరలోనే వుంది. కాలి నడకన వెళ్లడానికి పావుగంట పట్టింది.

ఆమె వెళ్ళేటప్పటికే ప్రిన్సిపాల్ గిరినాథ్ వచ్చివున్నాడు. అతను కాన్వెంట్ స్థాపకుడు కూడా!

శైలజ ప్రిన్సిపాల్ గదిలోకి వెళ్ళి నమస్కరించి అతను చూపిన కుర్చీలో కూర్చుంది.

"ఎక్స్క్యూజ్ మీ! ఓ పది నిముషాలు కూర్చోండి" ఆమెకు చెప్పి గిరినాథ్ టేబిల్ మీది ఫైలు చూడ్డంలో లీనమయ్యాడు.

అతని వయసు ముప్పయ్, ముప్పయ్ అయిదు మధ్య వుంటుందేమో! నుదుటిని విశాలంగా కన్పింపజేసేలా కొద్దిగా వచ్చిన బట్టతల! కళ్ళజోడు! ఇంకా మధ్యవయసు లోకి ప్రవేశించకపోయినా పెద్దమనిషి




తరహాగా కన్పిస్తాడు.

గిరినాధ్ ఫైళ్లు చూడటం ముగించేసరికి పది నిముషాలు దాటింది.

ఆఖరి ఫైలును టేబిల్‌మీద పెట్టేస్తూ, "బోర్ ఫీలయ్యారా?" అని ఆమె సమాధానంకోసం చూడకుండానే, "పదండి!" అంటూ లేచాడతను.

శైలజ అతన్ని అనుసరించింది.

ఆమెను స్టాఫ్ రూమ్‌లోకి తీసుకెళ్ళి మిగిలిన టీచర్లతో పరిచయాలు చేశాడు.

అందరూ పెళ్ళిళ్ళయిన, ముప్ఫయ్యో పడిలోని ఆడవాళ్ళే! వనిత ఒక్కతే ముప్ఫయ్యేళ్ళ లోపు యువతి. అవివాహిత! అంతా శైలజను యధాలాపంగా పలకరించారు. వనిత మాత్రం నవ్వుతూ మాట్లాడింది.

శైలజను దుర్గ అనే సీనియర్ టీచర్‌కి అప్పగించి తన రూమ్‌లోకి వెళ్లిపోయాడు గిరినాధ్.

"మీరు లంచ్ తర్వాత క్లాసులు తీసుకుందురుగాని" అంది ఆవిడ.

కాసేపు ఏవో ఫార్మాలిటీస్‌తోనూ, కాసేపు ఖాళీగానూ కాలం గడిచింది. అక్కడ ఆమె కూర్చునేందుకు వనిత పక్క కుర్చీనే చూపించింది దుర్గ. వనిత ఆమెతో స్నేహపురస్సరంగా మాట్లాడుతూ కూర్చుని, కొంతసేపటికి తను క్లాస్ తీసుకోవల్సిరావడంతో వెళ్ళిపోయింది. ఆమెలా శైలజతో మిగిలినవారు మాట్లాడలేదు.

లంచ్ సమయమయ్యేసరికి ఆమెను గురించి పట్టించుకోకుండా ఎవరికి వాళ్లు తాముతెచ్చుకున్న టిఫిన్లతోలంచ్ రూమ్‌కి వెళ్లిపోయారు.

శైలజ ఏమీ తోచక అక్కడే కూర్చుంది. క్లాసు ముగించుకుని తన బాక్స్ పట్టుకెళ్ళేందుకు అక్కడికి వచ్చిన వనిత, శైలజను చూసి ఆశ్చర్యపోయింది.

"ఏమిటీ....ఇక్కడే వున్నారు? లంచ్ చేయరా?"

"నాకీ సంగతి గుర్తులేదు. ఏమీ తెచ్చుకోలేదు" చెప్పింది శైలజ.

"ఎవరూ మిమ్మల్ని పిలవలేదా?"

"లేదు" అన్నట్టు తల తిప్పింది.

"వీళ్ళంతే లెండి! మీ అందం చూసి అసూయగా వున్నట్టుంది పాపం! నాతో రండి! వారికి నేనన్నా పెద్దగా పడదు. చిన్నదాన్ని కదా!'' అంది వనిత.

శైలజకి వింతగా తోచింది.

'తను అందగత్తె అయినందుకు వాళ్లు అసూయపడటమా!

అందం ఇలాంటి ఇబ్బందుల్ని కూడా తెచ్చిపెడుతుంది కాబోలు!

తను ఇంకా దానివల్ల పురుషులతోనే తలనొప్పి అనుకుంటోంది. ఇక్కడ మగ టీచర్లు ఎవరూ లేనందుకు సంతోషిస్తోంది!'

ఇద్దరూ లంచ్ రూమ్‌కి వెళ్లారు.

అక్కడ తింటున్నవాళ్లు ఓసారి వారికేసి చూసి తలలు తిప్పుకున్నారు.

వనిత, శైలజలు మూలగా వున్న బల్ల దగ్గరికి వెళ్ళి కూర్చున్నారు. వనిత తను తెచ్చుకున్న చపాతీల్లో సగభాగం బలవంతంగా శైలజకి పంచి ఇచ్చింది.

తింటూ "రేపట్నుంచీ నేను కూడా తెచ్చుకుంటాను" అంది శైలజ.

"తెచ్చుకోకపోయినా ప్రాబ్లం లేదు. నా టిఫిన్ పంచుకోవచ్చు. నేను మరికాస్త ఎక్కువ తెస్తాను" అంది వనిత.

ఆమె స్నేహహృదయానికి సంతోషించినా, "అలా ఏం వద్దు!" అంటూ వారించింది.

లంచ్ తర్వాత శైలజను థర్డ్ స్టాండర్డ్ పిల్లలకి క్లాసు తీసుకోమన్నారు.

ముద్దులు మూటగట్టే ఆ చిన్నారులకి పాఠం బోధించడంలో ఎంతో సంతృప్తిని అనుభవించింది శైలజ.

* * *

ఉద్యోగంలో చేరినా శైలజకి ఇంటి పని తప్పలేదు.

'ఆమె పెళ్ళయి వెళ్ళిపోతే అప్పుడు తనకెలాగూ తప్పదు. ఈలోపు పని వీలైనంతవరకూ ఆమెమీదికి తోసేసి సుఖపడదాం' అన్నది భాగ్యం ధోరణి!

అయితే ఉద్యోగంవలన శైలజ ఒక రకంగారిలీఫ్ పొందింది. ఇంట్లోనే వున్నట్టయితే భాగ్యం ఏదోవిధంగా సూటీపోటీ మాట లంటూనే వుంటుంది. దానికి శైలజ ఏతప్పూ చేయనక్కరలేదు. ఆమెలో ఏ దోషం వుండనక్కరలేదు. శైలజ సవ్యంగా ముగించిన పనిలోకూడా భాగ్యం లోపాలు వెతకగలదు. ఆమె ప్రవర్తన సక్రమంగానే వున్నా భాగ్యం ఏదో ఒక దోషాన్ని చూడగలదు.

ఇప్పుడు కొంత నయమే! శైలజ 10 నుంచీ 4 గంటలవరకూ కాన్వెంటులో వుండటంవల్ల ఆ బాధ తప్పింది.

శైలజ టీచరుగా వుద్యోగంలో చేరాక పది రోజులు గడిచిపోయింది.

ఈ కొద్దిరోజుల్లోనే ఆమె పిల్లల అభిమానాన్ని, మంచి టీచర్‌గా గిరినాథ్ అభినందనలను పొందగలిగింది!

సరళంగా, మృదువైన గొంతుతో మధ్య మధ్య పిట్టకథలు జోడిస్తూ శైలజ పాఠం చెప్పేతీరు కాన్వెంటులోని పిల్లల్ని బాగా ఆకట్టుకుంది. త్వరలోనే ఆమె వారి అభిమాన టీచర్ అయింది.

అది గిరినాథ్ దృష్టికివచ్చి ఒకసారి ఆమెను ప్రత్యేకంగా పిలిచి అభినందించాడు.

శైలజకి, వనితకి స్నేహం బాగా కలిసింది. వనిత మంచి స్నేహశీలి. ఆమె శైలజతో తన విషయాలన్నీ ఓపెన్‌గా చెబుతుంది. అలాగే శైలజ గురించి అడిగి తెలుసుకుంటుంది.

శైలజ పట్ల మిగిలిన టీచర్లు ప్రవర్తించే తీరులో మార్పులేదు. వారు మొదటిరోజునుంచీ అలా ముభావంగానే వుంటున్నారు.

తనపట్ల ఎవరైనా ఆసక్తి ప్రకటించి, ఇష్టాన్ని ప్రదర్శిస్తే అది తనకంగీకారయోగ్యమైనదైతే శైలజ వారితో అలాగే మెలుగుతుంది. తన విషయంలో ఎవరైనా ముభావంగా వుంటే తనూ వారి గురించి పట్టించుకోదు. ఆమె మిగిలిన టీచర్లతో కొలీగ్స్ గనక మర్యాదకోసం విష్‌చేసి వూరుకుంటుంది.

ఆరోజు కాన్వెంటు వదిలాక శైలజ ఒంటరిగా రోడ్డుమీదకొచ్చింది.

వనిత మధ్యాహ్నమే ఏదో పనుందంటూ సెలవుపెట్టి ఇంటికెళ్ళిపోయింది.

గేటు బైట రోడ్డుపక్కన నిలిపిన కారులో కూర్చుని వెయిట్ చేస్తున్నాడు శ్రీనివాస్.

శైలజను చూడగానే సస్నేహంగా నవ్వాడు.

కడలికెరటంలా ఆమెలో సంతోషం ఎగసిపడింది.

"ఎంతసేపయింది వచ్చి?"

"పావుగంట!"

"మరి పిలవలేదేం?"

"ఎలాగూ టైం అయిపోవస్తోంది కదా, మధ్యలో డిస్టర్బ్ చేయడమెందుకని! అదీకాక, వెయిట్ చేయడంలో వున్న

థ్రిల్ చవిచూడాలని!"

ఆమె చెక్కిళ్ళలో అరుణిమ ప్రతిఫలించింది.

"కంగ్రాట్యులేషన్స్!" చెప్పాడతను.

"థేంక్యూ!"

ఆమె ఉద్యోగంలో చేరాక ఇదే కలవడం!

వారు కలుసుకుని పదిరోజుల పైనే అవుతోంది.

"ఇంటి దగ్గిర డ్రాప్ చేస్తాను" అన్నాడతను.

ఆమె కూర్చున్నాక కారు నెమ్మదిగా ముందుకు సాగింది.

"మీకు నేను 'సారీ' చెప్పుకోవాలి" ఆమె మౌనంలోంచి అంది.

"ఎందుకు?"

"ఉద్యోగంలో చేరుతున్నట్టు ప్రఫుల్లకి ఫోన్‌చేసి చెప్పానుగాని మీకు చెప్పలేదు"

అంతవరకూ అతనికా ఆలోచనే రానట్టు "అంతేనా?" అని కొట్టిపారేస్తూ, "నెవర్ మైండ్!" అన్నాడు.

''ప్రఫుల్ల చెప్పింది నీ వుద్యోగం గురించి. కొంచెం ఖాళీ దొరికి ఇలా వచ్చాను!''

"ప్రఫుల్ల కలవడంలేదు?"

"ఏమో ! నేను ఇంటిదగ్గిర సరిగ్గా వుండటంలేదు. ఉన్నప్పుడైనా ప్రఫుల్లతో సరిగ్గా మాట్లాడే అవకాశమే చిక్కడం లేదు. కంపెనీ వ్యవహారాలతో అంతా బిజీ... బిజీ...! ఇంటికొచ్చే ఓపికలేక ఒక్కొక్కప్పుడు కంపెనీ గెస్ట్‌హౌస్‌లోనే వుండిపోతున్నాను. మా నాన్నగారి పార్టనర్ ఒకరు అవకతవకగా ప్రవర్తించడంవల్ల కొన్ని ఇన్‌కంటాక్స్ గొడవలొచ్చిపడ్డాయి. ఇప్పుడు నేను ఆ వ్యవహారాల్ని పరిశీలిస్తుంటే అవన్నీ బైటపడ్డాయి. ఈ పదిరోజుల్లో రెండుసార్లు పని మీద ఢిల్లీ వెళ్ళొచ్చాను తెలుసా....?''

అతను హఠాత్తుగా ఆమెవంక చూస్తూ "అరె! నా గొడవలన్నీ చెబుతూ... నీకు బోర్...'' అన్నాడు.

"ఫర్వాలేదు. ఇంట్రెస్టింగ్‌గానేవుంది... చెప్పండి" అంది శైలజ చిరునవ్వుతో.

"వద్దు. నువ్వే ఏదన్నా మాట్లాడు! ఉద్యోగ జీవితం ఎలా వుంది?'' అడిగాడతను.

ఆమె కాన్వెంట్ వాతావరణం గురించి క్లుప్తంగా చెప్పింది.

కారు ఇంటి సమీపానికి చేరుకుంది.

"ప్చ్! ఎంత నెమ్మదిగా నడిపినా ఇల్లొచ్చేసింది చూడు. కాన్వెంటు, ఇల్లు ఇంతదగ్గిరలో వుండటం నాకేం బాగోలేదు" అన్నాడు నిరుత్సాహపడుతున్నట్టు.

శైలజ అతని మాటలకి చిరునవ్వు నవ్వుతూ, యధాప్రకారం వీధి మొదట్లోనే కారు దిగి, వీడ్కోలు చెప్పింది!



## 12

''శంకర్రావ్!'' అన్న కేకకి బైటకు వచ్చింది శైలజ.

ఆమెను చూసి, "శంకర్రావ్ లేడా?" అన్నాడు బలరాం.

"ఆఫీసునుంచి ఇంకా రాలేదండీ" అంది శైలజ.

"ఇవాళ త్వరగా వచ్చేస్తానన్నాడే!"

సాలోచనగా అని "భాగ్యం?'' అన్నాడు.

''తెల్సినవాళ్ళింటికెళ్ళింది''

"అలాగా!" తల పంకించాడు.

ఆమె లేకపోవడంఅతను వూహించిందే. భాగ్యం ఇంట్లోవున్న పక్షంలో ఆమే బైటకు వచ్చి మాట్లాడుతుంది. అయినా నిర్ధారణ చేసుకునేందుకు అడిగాడు.

"కొంచెం మంచినీళ్ళిస్తారా?'' ఆమె నడిగి, "శంకర్రావు నాతో చెప్పినట్టు ఇప్పటికివచ్చేయాల్సిందే!ఎప్పుడొస్తాడో?'' అన్నాడు తనలో అనుకుంటున్నట్టు.

"తెస్తాను'' అంటూ శైలజ ఇంట్లోకి వెళ్ళింది.

అతని అంచనా తప్పింది.

లోపలకొచ్చి కూర్చోమంటుందను కున్నాడు.

ఆమె తెచ్చిన గ్లాసు అందుకుని,మంచి నీళ్ళు తాగేసి ఇక తప్పదని డైరెక్ట్‌గా- "తను వచ్చేవరకూ ఇక్కడ కూర్చుని వెయిట్ చేయవచ్చా?" అన్నాడు.

"భలేవారే! లోపలికొచ్చి కూర్చోండి"

అతని దగ్గిర గ్లాసు అందుకుంటూ, చిరునవ్వుతో అంది శైలజ.

లోపలికి నడిచి ముందుగదిలో కుర్చీలో కూర్చున్నాడు బలరాం. అతనికి కిటికీ అరుగు మీద వున్న ఆరోజు పేపర్ అందించి శైలజవంటగదిలోకిపోబోయింది.

"పనేమన్నా వుందా?'' అన్నాడు బలరాం పేపరు విప్పకుండా ఆమెను చూస్తూ.

"ఊహూ...లేదు" అంది శైలజ.

''అయితే వుండండి"

"అలాగే. గ్లాసు పెట్టేసి...''

లోపలికి వెళ్ళిన ఆమె మరునిముషం లోనే వచ్చేసి గుమ్మం దగ్గిర కూర్చుంది.

"ఇవాళ మతిమరుపు మీద ఒక మంచి జోక్ చదివాను!'' అన్నాడు బలరాం, అది గుర్తొచ్చినట్టు బాగా నవ్వేస్తూ.

"ఎంత నవ్వొస్తుందో? చెప్పమం టారా?" అన్నాడు ఆమెకేసి చూస్తూ.

శైలజ చెప్పమన్నట్టు తల వూపింది.

''ఓ రైల్వే స్టేషన్‌లో ముగ్గురు 'మతి మరుపు ప్రొఫెసర్లు' రైలుకోసం ఎదురు చూస్తూ ప్లాట్‌ఫారమ్ మీద నిలబడి మాట్లాడుకుంటున్నారట! ఇంతలో రైలు వచ్చి, స్టేషన్‌లో కాసేపు ఆగి బైలుదేరిందట!

అయినా మన ప్రొఫెసర్లు ముగ్గురూ ఇంకా కబుర్లలోనే మునిగివున్నారట! రైలు కదిలి స్పీడు అందుకున్నప్పుడు గుర్తించారుట, అది వెళ్లిపోతోందని.

దాంతో ముగ్గురూ పరుగెత్తి హడావుడిగా రైలు ఎక్కేందుకు ట్రైచేస్తే ఇద్దరు మాత్రమే ఎక్కగలిగారట! వాళ్లు అక్కడ మిగిలిపోయిన మిత్రుడికి చేయి వూపి వీడ్కోలు చెబుతూ వెళ్లిపోయారట!

ఇదంతా చూసిన ఓ వ్యక్తి, ప్లాట్ ఫారమ్ మీద ఏమీ తోచక దిక్కులు చూస్తూ నిలబడ్డ ప్రొఫెసర్ దగ్గిరకెళ్లి, 'అయ్యో, పాపం! మీరు రైలెక్కలేక పోయారే!' అన్నాడట సానుభూతి పూర్వకంగా.

అప్పుడా ప్రొఫెసర్ ఏమన్నాడో తెల్సా...? 'అదికాదయ్యా నా బాధ! ఆ రైల్లో వెళ్లాల్సిన నాకు సెండాఫ్ ఇవ్వ డానికి వచ్చారు వాళ్లిద్దరూ! అది మర్చి పోయి వాళ్ళే రైలెక్కి వెళ్లిపోయారు'

ఇది చెబుతున్నప్పుడు ప్లాట్‌ఫారమ్ మీద నిలబడ్డ ప్రొఫెసర్ మొహాన్ని ఓసారి వూహించుకోండి! మీకు రావల్సి నంత నవ్వు !" అంటూ పగలబడి

నవ్వాడు బలరాం.

శైలజకి నిజంగానే పట్టలేనంత నవ్వొచ్చేసింది. ఎప్పుడూ నవ్వనంతగా నవ్వింది!

కొన్ని నిముషాల తర్వాత "మిమ్మల్ని ఓ విషయం అడగాలనుకుంటున్నాను" అన్నాడు బలరాం.

శైలజ విస్మయంగా, "ఏమిటి" అన్నట్టు చూసింది.

"మీకిష్టమైతే ఫర్వాలేదు. అదే కావాలని ఆశపడుతున్నాను. ఒకవేళ..." అతని కంఠం కొద్దిగా చలించింది.

"ఒకవేళ మీకిష్టం కాకపోతే ఏమాత్రం మొహమాటం లేకుండా చెప్పెయ్యవచ్చు"

ఇంతగా ఉపోద్ఘాతం ఇస్తున్నాడంటే, చాలా ముఖ్యమైన విషయం అయి వుంటుంది. ఏమిటది?

ఏమి అడగబోతున్నాడు?

శైలజ హృదయంలో ఉద్వేగపు కెరటం లేచింది.

"అసలు శంకర్రావు ద్వారా మాట్లాడవలసింది! కానీ, స్వయంగా మిమ్మల్నే అడిగితే మీ పూర్తి ఇష్టం తెలుసుకోవచ్చని..." అతను ఆగాడు.

శైలజకి విషయం స్పష్టమయీ కానట్టుగా వుంది.

అదే కావచ్చా?

"మీకిష్టమైతే మనం పెళ్లిచేసుకుందాం! మా కుటుంబ వివరాలు మీకు తెల్సినవే కదా" అతను కంఠం గంభీరంగా మార్చుకుని చెప్పాడు.

అతని చూపులు శైలజ ముఖకవళికల్ని ఉత్కంఠతో గమనిస్తున్నాయి.

తీరాన్ని తాకి వెనుకకు మరలిన కెరటంలా శైలజ హృదయంలోని ఉద్వేగం సమసిపోయింది. ఆమె ముఖంలోని భావాలు మారకుండా వుంచేందుకు ప్రయాసపడింది. సాధ్యమైనంత భావరహితంగా వుంచుకుని, కొన్ని క్షణాల తర్వాత అంది-

''సారీ''

''......''

అతను మౌనంగా వుండటం ఆమెకు ఏదోగా వుంది.

"అయామ్ ఎక్స్ట్రీమ్‌లీ సారీ'' అంది మళ్లీ.

అతను తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో అన్నాడు- "ఫర్వాలేదు. నేను ముందే చెప్పాను కదా! మీకు ఇష్టం లేకపోవడం మీ తప్పేమీ కాదు. నేనడగటమే పొరపాటు''

''......''

క్షణాలు భారంగా గడుస్తున్నాయి.

వారి మధ్య మౌనం గడ్డ కట్టుకున్నట్టయింది.

కొద్దిసేపు వుండి, ''నేను వెళ్తాను. శంకర్రావుకి నేనొచ్చినట్టు చెప్పండి" అని లేచాడు బలరాం.

అతను వెళ్లిపోయాక గాఢంగా నిశ్వసించిందామె.

"ఎందుకు ఇష్టంలేదు?

నేను నచ్చలేదా?

మీరు మరొకరిని ప్రేమిస్తున్నారా?"

ఇలా అడిగి తనను ఇబ్బంది పెట్టనందుకు అతన్ని మనసులో అభినందించుకుంది.

అడిగితే ఏం చెప్పేది?

ఏం చెప్పినా, చెప్పకపోయినా శ్రీనివాస్‌ని ప్రేమిస్తున్న నిజాన్ని వెల్లడి చేసేది కాదేమో!

శ్రీనివాస్!

అతని తలపుతో పులకించిందామె




హృదయం.

ఈమధ్య అతను తీరిక దొరకక స్వయంగా వచ్చి కలుసుకోవడం తగ్గిపోయింది.

ఎక్కువగా ఫోనుల్లోనే మాట్లాడుకుంటున్నారు.

"ఎలా వున్నావ్?" అని క్షేమం కనుక్కునేందుకు ఫోన్ చేస్తుంటాడతను.

అలా అలా ... ఏవో కబుర్లు!

* * *

మూడు నెలలు ఇట్టే గడిచిపోయాయి!

మెటర్నిటీ లీవు తీసుకున్న సుశీల ఆరోజు కాన్వెంటుకి రావడంతో శైలజను పిలిపించాడు గిరినాథ్.

"మిస్ శైలజా! ఇవాట్టితో మీ వుద్యోగపు గడువు ముగిసిపోయింది" అని చెప్పాడు.

అతని టేబిల్‌కి ఎదురుగా కుర్చీలో కూర్చున్న శైలజ మౌనంగా వింది. తను రేపటినుంచి రానక్కరలేదని సుశీల రాకను బట్టే గ్రహించిందామె.

"ఉద్యోగ నిర్వహణలో మీరు చూపిన శ్రద్ధ, టీచర్‌గా కనబరచిన ప్రతిభ చూసి సంతోషించినవాడిగా మీకు ఓ విషయం చెప్పదలచుకున్నాను" అన్నాడు గిరినాథ్ గంభీరంగా.

"నేను ఇంతవరకూ మీలాంటి ఎఫీషియంట్ టీచర్‌ని చూడలేదు. చాలామంది టీచర్లు పిల్లల్ని భయపెట్టి పాఠం వినేట్టు చేయాలనుకుంటారేతప్ప, వారికి ఆసక్తికరంగా పాఠం బోధించి చదువుపై దృష్టి మళ్ళించాలని ఆలోచించరు. పిల్లలు తమ మాట వినేట్టు చేసుకునేందుకు కొడతారే గాని, వాళ్ళని లాలించి చెప్పినపని వెంటనే చేసేలా మార్చాలి అనుకోరు.

మీలా ఏ టీచరూ ఈ కాన్వెంటులోని పిల్లల్ని ఇంతగా ఆకట్టుకోలేదు. మీలాంటి టీచర్లు చాలా అవసరం! ఇపుడు మీరు మానేస్తే వాళ్ళు బాధపడతారేమో కూడా!

నాకు మీరు ఇక్కడ కొనసాగితే బాగుండుననే వుంది. కాని, మా ఆర్థిక పరిస్థితి దృష్ట్యా అదనంగా ఓ టీచర్‌ని భరించే స్థితిలో లేము. కాని, నేనుమాత్రం ఒకటి చెప్పాలనుకుంటున్నాను. ఇక్కడ ఖాళీలేవైనా వస్తే ముందు మీకే తెలియపరుస్తాను. అప్పటికి మీరు చేరేందుకు సిద్ధంగా వుంటే సరే! అలా కాకుంటే అప్పుడు వేరేవాళ్ళని తీసుకుంటాను. ఏమయినా ఫస్ట్ ప్రిఫరెన్స్ మాత్రం మీకే నని గుర్తుంచుకోండి!" అన్నాడు.

"థాంక్యూ ఫర్ యువర్ కైండ్‌నెస్!" అందామె కృతజ్ఞతగా.

"మీకు రావాల్సిన ఎమౌంట్ రేపు ఆఫీస్‌బాయ్‌చేత మీ ఇంటికి పంపిస్తాను. అయ్ విష్ యూ ఆల్ ది బెస్ట్" అన్నాడు గిరినాథ్.

శైలజ అతనికి నమస్కారం చెప్పి అక్కడినుంచి వచ్చేసింది.

"రేపటినుంచీ రాను" అని చెబితే వనిత దిగులుగా చూసింది.

"అప్పుడప్పుడూ రాకూడదూ?" అనడిగింది.

"రావాలనే వుంటుందిగానీ, వీలుపడదేమో!".

"మా అక్క భాగ్యం కారణంగా" అని చెప్పలేకపోయింది.

"అయితే సరే! నిన్ను చూడాలనిపించి నప్పుడు నేనే వస్తాను" అంది వనిత.

"అలావస్తే నాకూ సంతోషమే!" చెప్పింది శైలజ.

మిగిలినవారికి కూడా చెప్పేసి కాన్వెంటు ఆవరణ దాటిందామె.

పిల్లలకు మాత్రం చెప్పలేదు కావాలనే. ఆ సంగతి వింటే వారి ముఖంలో అలుముకునే నిరుత్సాహపు ఛాయల్ని చూడటం ఇష్టంలేక...

మనసును నిర్వికారంగా వుంచుకోవాలని ప్రయత్నించి విఫలమైంది ఆమె.

కాన్వెంటునుంచి వచ్చేస్తుంటే అస్పష్టమైన భావమేదో హృదయాన్ని నొక్కి బాధ పెట్టింది.

భాగ్యం రెండురోజులు ముభావంగా వుంది-ఉద్యోగం మానడం శైలజ కావాలని చేసిన నేరమన్నట్టుగా!

"ఇంట్లో కూర్చుంటే కాదు. మరో వుద్యోగానికి ప్రయత్నించు" అంది చూస్తూ వుండలేక.

శైలజ మౌనంగా తల వూపింది.

* * *

దగ్గిర బంధువుల్లో జరుగుతున్న ఓ పెళ్ళికి ఆహ్వానం వచ్చింది.

పెళ్ళి విజయవాడలో!

భాగ్యానికి పెళ్ళిళ్ళకి హాజరయే వుత్సాహం మామూలుకంటే అధికమే. పిలిచిన పెళ్ళికి వెళ్ళకపోవడమంటూ వుండదు. నగరంలో జరిగిన పెళ్ళిళ్ళకైతే తప్పనిసరిగా వెళుతుంది. మరో వూళ్ళో అయితే వీలుని బట్టి వెళ్ళేందుకు ప్రయత్నిస్తుంది.

శంకర్రావు రాసన్నాడు. కొడుకును కూడా వదిలేసి కూతురిని మాత్రమే తీసుకుని విజయవాడ వెళ్ళింది భాగ్యం. మరుసటిరోజు సాయంత్రానికిగాని రాదు.

భోజనాలు చేసి శంకర్రావు ఆఫీసుకి, బాబీ స్కూలుకి వెళ్ళిపోయారు.

వాళ్లు వెళ్లిన అరగంటకి తను కూడా భోజనం ముగించుకుని తీరికగా ఓ నవల చదివేందుకు కూర్చుంది శైలజ.

అంతలో పోస్ట్‌మన్ కేక వినిపించి పుస్తకం పక్కన పెట్టి లేచి వీధిలోకి వెళ్ళింది.

ఓ కవరు అందించి వెళ్ళిపోయాడు అతను.

కవరుకేసి చూసిన శైలజ భృకుటి

ముడిపడింది.

అది కంపెనీలు ఇంటర్వ్యూ కాల్స్ పంపే పొడుగాటి కవరు కాదు. కొద్దిగా వెడల్పుగా దీర్ఘ చతురస్రంగా వుంది.

తన పేరునే అడ్రెస్ చేసివుంది.

తన కావిధమైన పర్సనల్ లెటర్స్ రావే! ఎవరు రాసి వుంటారు?

ఆమె ఆశ్చర్యంగా కవరు చింపి లోపలున్న ఉత్తరాన్ని వేళ్ళతో తీసింది.

ఇప్పుడామె ఆశ్చర్యానికి, ఆసక్తి తోడయింది.

అది లేఖ కాదు!

ఓ కాబినెట్ సైజ్ ఫొటోని పైన తెరలా కప్పేస్తూ ఓ తెల్ల కాగితం నాలుగు మూలలా అంటించబడివుంది.

కాగితంపై ఒకే ఒక వాక్యం!

"నువ్వు ప్రేమించిన శ్రీనివాస్‌కి నీపట్ల ఎంత ప్రేమ వుందో ఈ ఫొటో చూసి తెల్సుకో"

ఆమెకు తమాషాగా అన్పించింది.

ఫొటో నాలుగు మూలల్నించి తేలికగా అంటించిన కాగితాన్ని విడదీసి ఫొటో కేసి ఆసక్తిగా చూసింది.

అంతే!

ఆమెకు ఫొటో చూసిన వెంటనే ఏ భావమూ కలగలేదు.

మనసు ఓ క్షణంసేపు శూన్యంగా అయింది.

వ్యక్తావ్యక్తంగా ఏ భావానికీ చోటివ్వని శూన్యత!

తర్వాత

అత్యున్నత పర్వత శిఖరం మీద నుంచి అంతుతెలీని అగాథమైన లోయలోకి నిస్సహాయంగా జారిపోతున్నట్టూ....

అంతవరకూ భూమి అనుకుని నిలుచున్నది పూబిగా మారి అందులోకి కూరుకుపోతున్నట్టూ...

ఉక్కిరిబిక్కిరి చేసిన భావాలతో ఆమెను విపరీతమైన నిస్సత్తువ ఆవరించుకుంది.

ఎలా ఇంట్లోకి వెళ్ళి మంచం మీద పడిందో ఆమెకే తెలీదు.

ఇది...ఇది నిజమా?

శ్రీనివాస్ ... శ్రీ ని వా స్ ఇంత మోసగాడా?

నమ్మలేకపోతోంది!

కాని, నమ్మకుండా ఎలా వుంటుంది?

ఫొటోలో అంతా అర్థమైపోతుంటే నమ్మకేం చేస్తుంది?

కళ్ళు మోసంచేస్తాయా?

మోసగింపబడటమనేది నమ్మకంవల్లే!

శ్రీనివాస్‌నిఫొటోలో ఇలాచూడకపోతే తను ఇంకా అతన్ని నమ్ముతూనే వుండేది.

తను అర్హత మర్చిపోయి అతనిపైన ఆశలు పెట్టుకుందా?

అకారణంగా అతనిపట్ల ఆత్మీయతను పెంచుకుందా?

లేదు.

అతని సమక్షంలో తను ఏదో అస్పష్టమైన భావానికి లోనవుతుంది.

హాయి అయిన అనుభూతి!

ఆ అనుభూతి చాలా తీయనైనది!

అతని మాటలు, చేష్టలు కూడా అతనికి తనపట్ల గల ప్రేమను తెలియజెప్పేవి.

తనది కేవలం 'వన్‌వే లవ్' కాదని నిర్ధారించేవి.

మరిప్పుడు...

ఫొటోలో అతను?

హుఁ...

తను గ్రహించలేకపోయింది.

అతని మునుపటి ప్రవర్తన అంతా

 

నటన!

అతను తనతో మెలగిన విధం, తనకు చెప్పిన తీయటి కబుర్లు అంతా నటనే!

అవును.

అతను తను గ్రహించలేనంత గొప్పగా నటించాడు.

'శ్రీనివాస్' బాధగా అనుకుంది.

హఠాత్తుగా తీవ్రమైన తలనొప్పి మొదలైంది ఆమెకి. ఓహ్...కణతలు చిట్లి పోతాయా అన్పించేంత నొప్పి! అరిచేత్తో నుదుటిపైన గట్టిగా పట్టుకుంది.

మూసుకున్న కనురెప్పల కింద ఉబికిన కన్నీరు కనుకొసలనుంచి జార సాగింది—ఆమెమౌన రోదనకు సాక్ష్యంగా!

* * *

"శైలజకొక సంబంధం చూశా నండోయ్!"

రాత్రి భోజనాలు చేస్తుండగా భర్తతో అంది భాగ్యం.

ఆమె విజయవాడ నుంచి ఆరోజు సాయంత్రమే వచ్చింది.

మంచంమీద పక్కన పడుకునివున్న పాప చెబుతున్న కబుర్లు వింటోంది శైలజ. 'చిన్నీ' అంతవరకూ కబుర్లు చెప్పిచెప్పి నిదరలోకి జారుకుంది.

భాగ్యం తన కంచుకంఠంతో వంట గదిలో మాట్లాడుతున్న మాటలు శైలజకి విన్పిస్తూనే వున్నాయి. తన ప్రస్తావన రావడంతో ఆమెకు ఆసక్తి కలిగింది.

"ఎవరేమిటి?"

యధాలాపంగా అడిగినట్లు వుంది శంకర్రావు కంఠం.

"మా మేనత్త కొడుకు....గోపాలం"

"ఎవరూ? ఆ పెళ్ళాం చనిపోయి సతనా?" శంకర్రావు కంఠంలో మార్పు వచ్చింది.

"పెళ్లాం పోతేమాత్రం? అతనికి వయసు తక్కువే" అంది భాగ్యం.

"పిల్లాడు కూడా వున్నట్టున్నాడు?"

"ఆఁ...వున్నాడులెండి, ఓ రెండేళ్ళ వాడు"

"భాగ్యం...నీకు మతిగాని పోలేదు కదా?" శంకర్రావు అన్నం తినడం ఆపేసి అడిగాడు.

"ఏమిటి?" సాగదీసింది భాగ్యం.

"నువ్వు మతివుండే మాట్లాడుతు న్నావా?" శంకర్రావు కంఠం కొంచెం తీవ్రంగా వుంది.

భాగ్యానికి ఒక్కోసారి భర్త ఏమన్నా కోపం రాదు. అది ముఖ్యంగా తను అను కున్నది సాధించడం భర్త నిర్ణయంపై ఆధారపడివున్న సమయాలలో.

ఆవిధంగానే సౌమ్యమైన కంఠంతో "ఇందులో నేను మతిలేకుండా మాట్లా డింది ఏముందండీ? పిల్లాడున్నాడన్న మాటేగానీ గోపాలానికి ఏమంత వయసు మించిపోయిందనీ? ముప్పయ్‌దాటింది... అంతేగదా! ఇంకా ముప్పయ్‌అయిదేళ్ళు కూడా నిండలేదు. మరీ ముసలాడైతే మీరలాగే అనుకోవచ్చు...నేను మతి భ్రమించి మాట్లాడుతున్నానని" అంది.

శంకర్రావు ఏమీ మాట్లాడలేదు. తిరిగి మామూలుగా అన్నం తినసాగాడు.

"గోపాలానికేం తక్కువ చెప్పండి! ఏమన్నా చెడు అలవాట్లున్నాయా? భార్య చనిపోయిందన్న ఒక్కలోపం తప్పితే, అతనిలో ఏమైనా లోటుందేమో చూపిం చండి. అదయినా లోపంగా ఎందుకు లెక్కెయ్యాలి. ఆ అమ్మాయికి గోపాలంతో కాపురంచేసే అదృష్టంలేక కొడుకుని కని చనిపోయింది.

అంతా మన శైలజ అదృష్టమను

కోవాలి. గోపాలానికి దురలవాట్లేమీ లేవు. అతను చేసే బ్యాంకులో ఎకౌంటెంట్ వుద్యోగానికి మంచి జీతం వస్తుంది. కట్నమనే మాట లేకుండా శైలజని చేసుకునేందుకు అతన్ని ఒప్పించాను. అదే మరొకరైతే ఎంత కట్నం అడిగేవారో ఆలోచించండి" నెమ్మదిగా నచ్చచెబుతున్నట్టుగా అంది.

శంకర్రావు 'నిజమే' అనుకున్నాడు.

అతనిది మంచి మనసే అయినా బొత్తిగా స్వార్థరహితంగా ప్రవర్తించేంత గొప్ప మనిషేమీ కాదు!

తమ కుటుంబాలలో కట్నాలు తప్పని సరి! వరుడి ఉద్యోగం, హోదా ఎలా వున్నా కట్నంమాత్రం భారీగావుంటుంది, మిగతావాళ్ళతో పోల్చితే. అత్తమామలు పోయినపుడు మిగిలింది చాలా స్వల్పం. ఆమొత్తానికి తనకున్న కొద్దిగొప్పా కలిపి శైలజ పెళ్ళికి ఖర్చుచేసేస్తే తన పిల్లల భవిష్యత్తు?

శైలజమీద శంకర్రావుకివున్న సానుభూతిని పిల్లలపట్ల అతనికిగల ఈ స్వార్థం జయించింది.

"మరి శైలజ ఏమంటుందో?" అన్నాడు సాలోచనగా.

"ఏమంటుంది? తనకి పెళ్ళిరాత లేక పోతే ఒప్పుకోవడం మానేస్తుంది" అంది భాగ్యం నిష్కర్షగా.

ఆ అనడంలో 'శైలజ ఈ పెళ్ళికి ఒప్పుకొనకపోతే, ఇక ఆమెకు పెళ్ళి చేయడం మన బాధ్యత కాదు' అన్న ఖచ్చితమైన భావం ధ్వనింపజేసింది.

భాగ్యానికి భర్త అంగీకారం ఎంతో సంతోషం కలిగించింది. శైలజపట్ల శంకర్రావుకిగల సానుభూతి, ఆపేక్ష ఆమెకు తెలుసు. ఆ ఆపేక్షతో శైలజకి అతను మంచి సంబంధంతెస్తే ఆమెకున్న ఎకరం పోవటమేగాక తమ డబ్బు కూడా ఖర్చవుతుందన్న భయం ఇన్నాళ్ళూ ఆమెకు అంతరాంతరాలలో వుండేది. శైలజ ఉద్యోగంచేసి సంపాదించుకుంటుందనుకుంటే అది మూడు నెలల ముచ్చటే అయింది. మళ్ళీ ఆమెకుద్యోగం ఎప్పటికొచ్చేనో? అందుచేతే విజయవాడలో పెళ్ళిలో కలిసిన గోపాలంతో సంబంధం దాదాపు ఖాయం అన్నట్టుచేసుకొచ్చింది.

అంతా విన్నాక శైలజకి బాధగా అన్పించింది-తనను రెండో పెళ్ళి వరుడికి కట్టబెట్టాలనే అక్క ప్రయత్నం తలచుకుని.

కానీ, తప్పదు!

తన నిస్సహాయత్వాన్ని తలపుకు తెచ్చుకుంటే ఆమెకు కనులవెంబడి గిర్రున నీళ్ళు తిరిగినాయి!

కళ్ళు తుడుచుకుంటుంటే, కుడి చేతి వేలికున్న ఉంగరం చెక్కిలికి రాచుకొని తన ఉనికిని తెలిపింది.

అది శ్రీనివాస్ ప్రెజెంటేషన్!

హృదయంలో మధురమైన స్మృతిగా పదిలపర్చుకున్న ఆ సంఘటన మనోయవనికపై ఆవిష్కరించుకుంది.



# 13

ఆరోజు-

శ్రీనివాస్ కాన్వెంట్ కి వచ్చాడు. విజిటర్స్‌రూంలో కూర్చుని తనకోసం

కబురు పంపాడు.

తను వెళ్ళగానే చిరునవ్వుతో లేచి నిలబడి కుడిచేయి ముందుకు చాచాడు.

అతని వేళ్ళమధ్య అరవిసిరిన ఎర్ర గులాబీ!

"విష్ యూ మెనీ హే పీ రి ట ర్న్స్ ఆఫ్‌ది డే!"

"థేంక్యూ!" అంటూ గులాబీని అందుకుంది తను.

'ఈరోజు తన పుట్టినరోజు అనే సంగతి అతనికి ఎలా తెల్సింది? ప్రఫుల్ల ద్వారానా?'

"శైలూ!''

కళ్ళెత్తి అతనికేసి చూసింది.

"ఈరోజు కూడాకాన్వెంటు ఎందుకు? సెలవు తీసుకుని వచ్చేయకూడదూ?''

ఆ అడగటంలోని విచిత్రమైన శక్తి ఏమిటో? తనువెంటనే అందుకు సిద్ధమైంది.

సెలవు కావాలంటే, ఆమెకాన్వెంటులో చేరాక అంతవరకూ అడిగివుండక పోవడంతో, గిరినాథ్ వెంటనే అంగీకరించాడు.

శ్రీనివాస్‌తో కలిసి కాన్వెంటు బైటకు నడిచింది.

కారు దగ్గరికి చేరుకున్నాక-

"ఈ కాశ్మీరు సిల్కుచీరలో నువ్వెంత బాగున్నావో తెలుసా ?" అన్నాడతను ఆగిపోయి.

తను చిరునవ్వుతో చెప్పమన్నట్టు చూసింది.

"ఎంతనేది చెప్పలేనంత అందంగా!" అన్నాడు తనను ఆపాదమస్తకం చూస్తూ.

తన అందం గురించిన ప్రశంస అతని నోటంట వినడం అదే ప్రథమం! తనలో ఏదో అస్పష్టమైన స్పందన!

"శైలూ!" అతను కారులోంచి డోర తెరుస్తూ హెచ్చరికగా అనడంతో తను సిగ్గుపడి, కారులో కూర్చుంది.

"ఎక్కడికి వెళ్దాం?"

"మీ ఇష్టం!"

"పార్టీ ఇవ్వవా?"

"పార్టీ ...?" తను వెలతెలబోతూ చూసింది.

అతను నవ్వేశాడు.

"కంగారుపడకు ! నేనే ఇస్తాను గాని..." కారు స్టార్ట్ చేసి పోనిచ్చాడు.

తను చేతిలోని ఎర్రగులాబీ వంక చూస్తూ కూర్చుంది.

అతను కారు నడుపుతూ ఏమో మాట్లాడుతున్నాడు.

కబుర్లలో కారు జూ పార్కు దగ్గరికి చేరుకోవడం తను గమనించలేదు.

"ఇక్కడికి...?"అందితను అర్థోక్తిగా.

"సరదాగా తిరగవచ్చని!"

అతను వెళ్లి ప్రవేశానికి అవసరమైన టిక్కెట్లు తెచ్చాడు.

కారుతో సహా లోపలికి వెళ్లారు.

జంతువులను చూసే వుద్దేశంతో వస్తే కదా!

శ్రీనివాస్ కారును నడకంత నెమ్మదిగా నడుపుతున్నాడు.

కబుర్ల మధ్యలో అప్పుడప్పుడూ విండోలోంచి తల తిప్పి, కంటపడిన జంతువు గురించి మాట్లాడుకుంటూ... అలా సాగుతోంది!

ఓ ఏకాంత ప్రదేశంలో కారు నిలిపాడు శ్రీనివాస్.

తను ప్రశ్నార్థకంగా చూసింది.

అతను డేష్ బోర్డు లోంచి చిన్న భరిణెలాంటి పెట్టెను తీసి, తెరిచాడు.

అందులో అందమైన డిజైన్‌తో ముత్యం పొదిగి వున్న వుంగరం

మెరుస్తోంది.

"ఎలా వుంది?'' చూపిస్తూ అడిగాడు.

''చాలా బావుంది!''

"ఓ అపురూపమైన వ్యక్తికి కానుకగా ఇచ్చేందుకని తీసుకున్నాను" అన్నాడతను చిరునవ్వుతో.

"నా హృదయంలో అపురూప స్థానం గల 'ఆమె'కు బర్త్‌డే సందర్భంగా ఇవ్వడానికి ఈ కానుక తగినదేనా?''

తను చకితురాలైనట్టు చూసింది. 'అతను మాట్లాడుతున్నది తన గురించేనా? ఎందుకు సందేహం?'

"చెయ్యి ఇలా ఇవ్వు!" అన్నాడు శ్రీనివాస్.

అతను చేయి అందుకుని రింగ్ తన వేలికి తొడుగుతుంటే, అతని వేళ్లనుంచి ప్రేమలాంటి భావమొకటి తన వేళ్లలోకి ప్రవహించి, తనువంతా ఆవరించుకుంటున్నట్టుగా భావన!

అతను వేలికి వుంగరం పెట్టి, తల వంచి చేతిని పెదవులతో సున్నితంగా స్పృశించాడు!

"శైలూ... అయ్ లవ్‌యూ! అయ్ వాంట్ టూమేరీ యూ!''

తన హృదయాన వేయివీణలు ఒక్కసారిగా సంగీతాన్ని ఆలపించినట్టు తీయని పులకింత!

ఉద్వేగంతో పెదవులు కంపించాయి! బుగ్గల్లోకి వెచ్చటి ఆవిరి చిమ్మింది!

జూ నుంచి తిరిగి సిటీకి బైలుదేరారు.

తిరిగొచ్చేస్తుండగా అడిగింది తను– "మీరు చేసింది ఏమిటి?"

''ఏం చేశాను?" అన్నాడు నవ్వుతూ, "నీ బర్త్‌డే సందర్భంగా చిన్న బహుమతి ఇచ్చాను. అంతే కదా?"

పుట్టినరోజున ఫ్రెండ్స్‌కి పార్టీ ఇచ్చే చిన్న వేడుక సైతం జరుపుకోలేని దురదృష్టం తనది.

"మీరు బహుమతి ఇచ్చారు కానీ నేను పార్టీ ఇవ్వలేకపోతున్నాను'' సంజాయిషీలా అంది.

"పోనీ, నేనిస్తాను"

కారును తీసుకెళ్లి ఓ ఖరీదైన హోటల్ ఆవరణలో నిలిపాడు.

కారు దిగి లోపలికి నడిచారు.

ఒక కార్నర్‌లో టేబిల్ చూసుకుని కూర్చున్నారు.

బేరర్ వచ్చాడు.

మెనూ కార్డ్ తనవైపు జరుపుతూ, "ఆర్డరివ్వు'' అన్నాడు.

"లేదు... మీరు చెప్పండి" తను సంశయించింది.

అతను కొన్ని పేర్లు పైకి చదివి, "ఇవి చెబుదామా?'' అన్నాడు.

తల వూపింది తను - ప్రతి విషయంలోనూ తన సమ్మతిని కోరే అతని ధోరణికి సంతోషిస్తూ.

ఆర్డర్ తీసుకుని బేరర్ వెళ్లిపోయాడు.

"శైలూ!" టేబుల్‌మీద వున్న తన చేతిపై అతను చేతిని ఆనించి గుప్పిటలా పట్టుకున్నాడు.

తనకు అతని చేతినుంచి ఏదో ఆత్మీయతా భావం ప్రవహిస్తున్నట్టు తోచింది.

అస్పష్టమైన ఉద్వేగం! కాలం ఇక్కడే నిలిచిపోయి ఈ క్షణాలు శాశ్వతమైతే బావుండుననే పిచ్చికోరిక.

మనసు లోతులు మాటలకు అందడం లేదు. పెదిమలు విడివడటంలేదు.

అప్పటివరకూ అతని ముఖం కేసి చూస్తున్నది, కళ్లు కిందికి వాల్చేసింది.




"శైలూ! ఆరోజు మొదటిసారి నిన్ను చూసిన వెంటనే నాలో ఏదో అస్పష్టమైన భావం, అర్థంకాని స్పందన కలిగినాయి! నా జీవితంలో తోడుగా పయనించేందుకు ఇలాంటి అమ్మాయినే ఎన్నుకోవాలని పించింది.

నేను 'లవ్ ఎట్ ఫస్ట్‌సైట్'ని నమ్మే వాణ్ని కాదు! కాని, ఇపుడు నమ్మాలని పిస్తోంది!"

అతని పలుకులు తన చెవులకి అమృతపు సోనలవలె సోకుతున్నాయి.

మనసు ఉత్సాహంతో సాగరతరంగం వలె ఉప్పొంగుతోంది. మయూరంవలె ఆనందనాట్యం చేస్తోంది.

తనకూ చెప్పాలనిపిస్తోంది.

"శ్రీనివాస్! నేను నీదాన్ని! నిజంగా, ఎప్పటికీ నీదాన్ని!"

కానీ, ఆ మాటలు పెదిమల్ని దాటడం లేదు. మానస విపంచి మూగపోయినట్లు వుంది. భావాలను స్వరాలుగా మార్చి భాషలో పలికించే నోరు తన విధిని మరచి నట్టుగా సహకరించడంలేదు.

తన పురుషుడి సమక్షంలో ప్రతి స్త్రీకీ ఇది సహజమేనా?

అందరూకూడా ఇటువంటి తడబాటుకు లోనవుతుండటం సాధారణమేనా?

ఏమిటి?

ఏమిటి దీనికి కారణం?

ఎందుకిలా అనిపిస్తోంది?

తన జీవితంలో ప్రవేశానికై ఎందరో యువకులు తపించారు. ప్రయత్నించారు.

చదువుకునేరోజుల్లో తోటి విద్యార్థుల నుంచి ఆ రకమయిన తలనొప్పి తనకు మనశ్శాంతి లేకుండా చేసేది. ప్రేమ లేఖలు, పరోక్షంగా రాయబారాలు, అభ్యర్థ నలు...

అరుదుగా సంతోషాన్ని, రవ్వంత గర్వాన్ని కలిగించే వారి ప్రయత్నాలు అధికంగా చికాకునే తెచ్చిపెట్టేవి. ఎంతో జాగరూకతతో వ్యవహరించి, యవ్వనం లోని ఆవిధమైన ఆకర్షణపు నెగడుకి శలభంలా బలికాకుండా తనను తాను రక్షించుకుంది. అందుచేతే తన మనసు పొలిమేరల్లోకి ఎవరికీ ప్రవేశం లభించలేదు.

కానీ, శ్రీనివాస్...?

ఇట్టే హృదయాన్ని ఆక్రమించుకుని, తన స్థానం సుస్థిరం చేసుకున్నాడు.

తను ఇంతకాలమూ వేచియున్నది అతని కొరకే అన్నట్టు, తన మనో ప్రాంగణంలోనికి అతనికి సులభంగా ప్రవేశం లభించింది.

'మేరేజెస్ ఆర్ మేడిన్ హెవెన్' అనే సూక్తి నిజమే కాబోలు! తను స్వర్గంలోనే శ్రీనివాస్‌కి నిర్ణయించబడిందా?'

ఏదియేమైనా ఇపుడు మాత్రం తను మనసా, వాచా శ్రీనివాస్‌ని తనవాడుగా, తను అతని మనిషిగా ఫీలవుతోంది!

బేరర్ రావడంతో తన చేతిని మృదువుగా నొక్కి వదిలేశాడు శ్రీనివాస్.

బేరర్ ప్లేటులవీ టేబిల్‌మీద సర్ది వెళ్ళిపోయాడు.

అవి చూసి, "బాప్‌రే! అన్నీ స్వీట్లే!!" అంది తను కళ్ళు పెద్దవిచేసి.

"ముందు ముందు నాతోటి నీ జీవితం ఇంత తియ్యగా సాగిపోతుందని చెప్పడానికన్న మాట!''

శ్రీనివాస్ నవ్వుతూ అన్నాడు.

* * *

ఆరోజు తన జీవితంలో మరపు రానిదిగా, మరువలేనిదిగా గడిచింది అనుకుంది.







ఎంత పిచ్చిది తను?

శ్రీనివాస్ ఆడిన కపట నాటకాన్ని నిజమనుకుని భ్రమపడ్డది.

ఆ క్షణాలను శాశ్వతం చేసుకోవాలని వెర్రిగా భావించింది.

వెళ్లాలి.... రేపు వెళ్ళి శ్రీనివాస్‌ని అడగాలి.

తన జీవితంతో ఇలా ఆడుకునేందుకు అతనికా హక్కు ఎవరు ఇచ్చారో? తనను ఇలా మోసంచేసి, తనతోటి సాహచర్యం ఒక ఎఫైర్‌గా ఎందుకు మిగుల్చుకోవాలనుకున్నాడో? గద్దించి అడగాలి.

అతను 'కానుక' అని మభ్యపెడుతూ ఇచ్చిన ఈ ఉంగరాన్ని అతని మొహాన విసిరికొట్టాలి.

ఇటువంటి కానుకలతో తన ప్రేమను, కాదు తన శీలాన్ని కొందామనుకున్నాడు కాబోలు!

'శ్రీనివాస్!' బాధతో విలవిల్లాడింది శైలజ హృదయం. 'నువ్వెంత మోసగాడివి?'

హృదయంలోంచి ఎగసి కళ్ళ వెనుక దాగిన దుఃఖం కన్నీళ్ళుగా ప్రవహించ సాగింది.

* * *

"ఏమిటీ... నీ పెళ్లా?"

ప్రఫుల్ల నివ్వెరపోయింది. అదే భావం కంఠంలో స్పష్టమవగా, భృకుటి ముడివేసి శైలజకేసి చూసింది.

శైలజ తల వూపింది.

ఆమె శ్రీనివాస్‌ని కల్సుకోవాలన్న నిర్ణయాన్ని మార్చుకుంది.

దానికి తోడు అతను వూళ్ళో లేడు కూడా. ప్రఫుల్లకి తన పెళ్లి విషయం చెప్పి, ఉంగరం ఇచ్చేయాలన్న ఆలోచనతో వచ్చింది.




శైలజ పెళ్లి కబురు విని నిర్విణ్ణురాలైన ప్రఫుల్ల ఒక నిముషం ఏం మాట్లాడకుండా వుండిపోయింది.

ఆమెకు ఈరోజు శైలజ ధోరణి వింతగా, అంతుబట్టకుండా వుంది. తమ ఇన్నాళ్ళ స్నేహంలో శైలజ ఎప్పుడూ ఇలా కన్పించలేదు. ముఖంలో విషాదం,

కళ్లలో దైన్యం స్పష్టంగా తెలుస్తున్నాయి. స్నేహితురాలిలోని ఈ వింత మార్పుకి కలవరపడుతోంది ప్రఫుల్ల మనసు.

"శైలూ....ఏమిటి? ఎందుకుఎన్నడూ లేనిది ఇలా వున్నావ్! నీ బాధేమిటో ఈ స్నేహితురాలికి చెప్పవూ?'' అంది ఆమె చేతులు పట్టుకుంటూ.

శైలజ తల కిందకు దించేసుకుంది చెమర్చిన కళ్లను ప్రఫుల్లకు కనపడనీ కుండా. కానీ, ప్రఫుల్ల చూడనే చూసింది.

"శైలూ!?" గాయపడినట్టు అంది.

శైలజ హేండ్‌బాగ్ తెరచి, ఉంగరం చుట్టిన కాగితం తీసి ఇస్తుంటే ప్రఫుల్ల విస్మయంతో అందుకుంది.

"ఇది మీ అన్నయ్యకు అందజేయి"

"ఏమిటి?" అంది ప్రఫుల్ల కాగితం విప్పకుండా.

మీ అన్నయ్యా నాకు కానుక అంటూ ఇచ్చిన రింగ్"

"కానుకను వాపసు చేస్తున్నావా?''

ప్రఫుల్ల కంఠంలో బాధ స్పష్టమైంది.

"పరాయివాళ్ల దగ్గిర కానుకలు తీసుకునే అలవాటు నాకు లేదు"

ప్రఫుల్ల మాట్లాడలేనట్టు చూసింది. వెళ్లి నిస్సత్తువగా తన బెడ్ మీద కూర్చుంది.

కాసేపటికి నోరు పెగల్చుకుని అంది-"శ్రీనివాస్ నిన్ను ప్రేమిస్తున్నాడు తెలుసా?"

చివ్వున తలఎత్తి ప్రఫుల్లకేసి చూసింది శైలజ.

''పెళ్లి పర్యవసానం కాని ప్రేమను ఈ లోకం లాగే నేనూ అంగీకరించలేను. మా ఇద్దరి మధ్యా పెళ్లికి అంతస్తులు అడ్డంకిగా వున్నాయని నాకు తెలుసు''



"శైలూ!నువ్వొకటి అర్థంచేసుకోవడం లేదు. శ్రీనివాస్ నీకంటే పై అంత స్థులో వున్నవాడేం కాదు. ఈ ఆస్థి అంతా ఎవరిదంటావా? ఇదంతా మా నాన్నగారు బిజినెస్‌లో సంపాదించింది. అంతా ఆయన స్వార్జితమే! శ్రీనివాస్‌కి ఇంతవరకూ తన సంపాదనంటూ ఏమీ లేదు. అటువంటప్పుడు అతను నీతో సమానస్థాయిలో వున్నవాడవుతాడే తప్ప నీకంటే ధనవంతుడు ఎలా అవుతాడు?'' అనునయంగా చెబుతున్నట్టు అంది ప్రఫుల్ల.

శైలజ తల అడ్డంగా వూపింది.

"నీ మాటలతో నన్ను మభ్యపరచేం దుకు ప్రయత్నించకు ప్రఫూ! ఈమాటలు శ్రీనివాస్ నోటినుంచి కదా రావల్సింది!"

"శైలూ.. నువ్వు మనసులో ఏం పెట్టుకుని బాధపడుతున్నావో? కాస్త వివేకంగా ఆలోచిస్తే శ్రీనివాస్ నిన్ను ప్రేమిస్తున్నాడనే నిజం నీకే అర్థమవు తుంది'' ప్రఫుల్ల కంఠంలో నెమ్మదిగా అసహనం చోటు చేసుకుంటోంది.

''అదంతా పోనీ ప్రఫూ! నువ్వు మాత్రం నా పెళ్లికి తప్పకుండా రావాలి. నా కోరిక అదే. నీకోసం ఎదురు చూస్తాను''

కుర్చీలోంచి లేచి రివ్వున వెళ్లిపో తున్న శైలజ కేసి విస్తుబోయి చూసింది ప్రఫుల్ల.

* * *

"శైలజా! ఈ పెళ్లి మీకిష్టమేనా?''

శైలజ ఒంటరిగా వున్నప్పుడు చూసి అడిగాడు బలరాం.

అతను శంకర్రావు ద్వారా శైలజ పెళ్లి కబురు విని నిర్ఘాంతపోయాడు. ముఖ్యంగా పెళ్లికొడుకు వివరాలు అతన్ని ఆశ్చర్యపరచినాయి.

తనను తిరస్కరించినందుకు శైలజ పైన అతనేమీ కోపగించుకోలేదు. అదీ జరిగిన తర్వాత ఒకసారి అతను ఓ యువకుడు శైలజను కారులో వీధి చివర వరకూ డ్రాప్ చేయడం చూశాడు. ఆమె కారు దిగాక కూడా, వాళ్లిద్దరూ ఒకరి నొకరు వదలలేనట్టు కొద్దిసేపు మాట్లాడుకుని గాని వీడ్కోలు చెప్పుకోలేదు. దాన్ని బట్టి వాళ్ల మధ్య వట్టి పరిచయమే కాదు, 'ప్రేమ' వున్నట్టు వూహించాడు. అలా భావించడం వల్లనే ఆమెను ఈవిధంగా ప్రశ్నించడం! అతని బదులు ఈ పెళ్లికి ఎందుకు ఒప్పుకుందని-

శైలజ వెంటనే సమాధానం ఇవ్వలేదు.

కొన్ని క్షణాలు అతని ముఖాన్ని పరిశీలిస్తున్నట్టు చూసింది. ఆ ముఖంలో తేలిక భావాలు ఏమీ లేకపోగా అతని సిన్సియారిటీ కన్పిస్తోంది.

ఆమె తల వంచుకుని చెప్పింది,

"ఇష్టమే"

అతను ఏమీ మాట్లాడలేదు.

"ఇష్టం వుండదని మీరెలా అనుకున్నారు?"

అతను కొన్ని క్షణాల తర్వాత సమాధానం చెప్పాడు.

"మీరు నా ప్రపోజల్‌ని కాదన్నప్పుడు బహుశా మీ మనసులో మరొకరు వున్నారేమో అనుకున్నాను. అందుకే అప్పుడు మిమ్మల్ని కారణం ఏమిటని తరచి ప్రశ్నించలేదు." కారులోని యువకుడి ప్రసక్తికావాలనే తేలేదు.

"......"

"ఏదేమైనా, ఈ పెళ్ళివల్ల మీకు సంతోషంలభించాలనికోరుకుంటున్నాను"

అతను వెళ్ళిపోయాడు.

తను మనసులో రాజీ పడటంవల్ల దుఃఖంనుంచి ఉపశమనంకలగవచ్చునేమో గానీ, నిజమైన సంతోషాన్ని పొంద గలుగుతుందా?

అది ఎప్పటికీ శ్రీనివాస్‌తోనే!

వింత ఏమిటంటే–తనను కోరుకున్న బలరాంకి తను దక్కలేదు. తను కోరుకున్న శ్రీనివాస్‌కి తనపై మనసులేదు. ఎండమావిలాంటి ఈ నిరాశ ఎంతోమంది జీవితాల్లో సహజమేనేమో?

గమ్యంలేని ఆలోచనలతో ఆమె మనస్సు గమనం సాగిస్తోంది.




శైలజ పెళ్ళి దగ్గరపడుతోంది.

భాగ్యంచాలా హడావుడి పడుతోంది. ఆమెకు శైలజ ఈ పెళ్ళికి ఎటువంటి ప్రతిఘటనా లకుండా, తేలికగా ఒప్పుకోవడం విస్మయాన్నీ, అంతకుమించి ఆనందాన్నీ కలిగించింది. అది శైలజ మీద ఆప్యాయతగా సహితం మారింది.

భాగ్యం యధారీతిగా తననేమీ అనకపోగా, లేనిపోని ఆప్యాయతను ప్రదర్శించడం చూస్తుంటే, నరకబోతున్న గొర్రెపట్ల కసాయి ప్రదర్శించే ఆర్భాటం గుర్తుకొస్తోంది శైలజకి. పేలవంగా నవ్వుకుంటోంది.

'తనేమైనాతొందరపడిందా? పొరపాటు నిర్ణయం తీసుకుందా??'

శైలజ మనసు అప్పుడప్పుడూ సంశయిస్తోంది.

'లేదు...నేను తొందరపడి, పొరపడి నిర్ణయం తీసుకోలేదు. ఈ నిర్ణయం సరియైనదే! నా జీవితానికి ఇది తప్పితే వేరు గత్యంతరంలేదు' తనకు తనే నచ్చ చెప్పుకుంటుంది.

తన వ్యక్తిత్వం చాలామంది ఆడపిల్లల నుంచి తనను వేరుచేసి చూపినా, వివాహం విషయంలో మాత్రం తన మనస్తత్వం సగటు ఆడపిల్లదే!

పెద్దవాళ్ళు నిశ్చయించిన ఎవరినో భర్తగా స్వీకరించడం!

అతనితో సర్దుకుపోగలదు! అతన్ని లతలా అల్లుకుపోగలదు.

కానీ, నిశ్చల తటాకంలాంటి తన మనసులో శ్రీనివాస్ లేనిపోని కల్లోలాన్ని రేపాడు. ఆ కల్లోలాన్ని అణుచుకుని, అతనికిచ్చిన తన మనసును తిరిగి తన స్వాధీనంలోకి తెచ్చుకునేందుకు ఎంతో ప్రయత్నం,పట్టుదల అవసరమవుతోంది.

స్త్రీ జీవితానికి పురుషుడి అండ, సంసారమనే ఆలంబన అవసరం!

పెద్ద చదువులు చదివినా, ఉన్నత పదవులు చేపట్టినా; కొండలు కోనలు, లోయలు, మైదానాలు దాటి ఆఖరికి సముద్రంలో కలిసే నదిలా స్త్రీ కూడా పురుషుడి పంచన చేరక తప్పదు. రోజూ చూస్తున్న ఈ నిజాన్ని, ప్రతిస్త్రీ జీవితం లోనూ జరుగుతున్న ఈ వాస్తవాన్ని తను ఎలా కాదనగలదు?

అందుకే ఈ పెళ్ళికి ఒప్పుకుంది!

శ్రీనివాస్‌కి తన మీద మనసు వుందని తెలిస్తే ఈ పెళ్ళికి అంగీకరించేదా?

ససేమిరా అలా చేసేదికాదు.

ఉద్యోగమో, మరో జీవనోపాధినో చూసుకుని అతని కొరకు అవసరమైనంత కాలము వేచియుండేది! అది జీవితపర్యంత మైనా సరే!

కానీ శ్రీనివాస్‌కి అటువంటిదేమీలేదు.

అది ఆరోజు పోస్టులో వచ్చిన ఫొటో చూసిన వెంటనే స్పష్టమైపోయింది.

శ్రీనివాస్!

ఇంతవరకూ నేను ఎక్కువ హాయిని, సంతోషాన్ని అనుభవించింది నీ సమక్షం లోనే!

అలాగే ఎక్కువ వేదనపొందుతున్నదీ నీ వల్లనే!

ఆ ఆనందానికి, ఈ విషాదానికి సరిపోయింది.

ఇక చాలు!

నా ఆలోచనల్లోంచి వెళ్ళిపో!

నా మనసు వీడి వెళ్ళిపో!

బాధగా దిండులో ముఖం దాచుకుంది శైలజ.

కారువచ్చి ఇంటిముందు ఆగిన శబ్దానికి అన్ని వాటాల వాళ్ళూ బిలబిల్లాడుతూ బైటకి వచ్చారు. ఆరోజు ఆదివారం కావడంతో అందరూ ఇంటి పట్టునే వున్నారు.

"ఎవరికోసం?", "ఎవరు కావాలి?"

అందరి గొంతులూ ఒక్కసారే ఆరాతీసినయ్!

"అక్కా...నీకోసం ఇదివరకోసారి వచ్చాడే...ఆ అబ్బాయొచ్చాడు"

జ్యోతి పరుగెత్తుకుంటూ వచ్చి చెప్పడంతో చివ్వున తలయెత్తి చూసింది శైలజ.

"ఏమిటి?" అంది నమ్మశక్యంకాక.

"ఇదివరకు వచ్చిన అబ్బాయి వచ్చి, నిన్నడిగాడు" అనేసి వెళ్ళిపోయింది జ్యోతి.




శైలజ చప్పున లేచి ఉరికినట్టుగా మంచందిగి, గబగబా వీధి వాకిలిలోకి వచ్చింది.

గుమ్మంలోకొన్నిక్షణాలుఅచేతనురాలై నిలబడింది.

అక్కడ నిలబడిన అందరికీ ఇదొక పెద్ద విడ్డూరమైపోయింది. ముఖాముఖాలు చూసుకుంటున్నారు.

విషాదం అలుముకునివున్న శ్రీనివాస్ ముఖం శైలజ హృదయాన్ని కలచి వేసింది.

ఆమె మనసు ఆలోచనారహితంగా అయింది. మెదడు మొద్దుబారినట్టుగా వుంది.

"రా శైలూ ... కానెక్కు!"

శ్రీనివాస్ మాటలు మాత్రమే విన్పించి నాయి ఆమె చెవులకి.

అంతే !

అపుడే వచ్చి వెనుక నిలబడి వురిమి చూస్తున్న భాగ్యాన్ని గమనించలేదు. "ఎక్కడికీ?" అని గద్దిస్తున్న ఆమెను పట్టించుకోలేదు.

"ఎదురుచూడండి. ఒక గంటలో వచ్చి చెబుతాము"

గంభీరంగా భాగ్యానికి సమాధానం ఇస్తూ ముందు డోర్ తెరిచాడు శ్రీనివాస్.

శైలజ మంత్రముగ్ధలా వెళ్ళి అతని పక్కన కూర్చుని డోర్ వేసింది.

మరుక్షణంలో స్టార్టయి వేగంగా ముందుకు కదిలింది ఫియట్.

కారు మాయమయాక అక్కడివారిలో సంచలనం మొదలైంది.

"ఏమిటిది?" "ఏమైంది?"

కారు పోనిస్తూ శ్రీనివాస్ కాసేపు గంభీరంగా వుండిపోయాడు.

అతని కళ్ళల్లో ఎంతో ఆందోళన పడిన వాలకం తెలుస్తూంది. తల దువ్వ న్నట్టు చిందరవందరగా వుంది.

"నువ్విలా తెలివితక్కువగా ప్రవ రిస్తావనుకోలేదు. నా ప్రేమను అర్థం చేసుకుంటావనుకున్నాను"

గంభీరంగా, కొంచెం చిరాకుగా విన్పిం చిన అతని మాటలకి శైలజ ముఖం రోషంతో ఎర్రబడింది.

"ఎందుకిలా చేశావు? ఏమిటి నీ వుద్దేశం? – అనే ప్రశ్నలతో నీ సంజా యిషీని కోరడం నా అభిమతంకాదు"

"నేను అర్థంచేసుకోగలను. నేను ఈమధ్య కలిసి చాలాకాలమైంది. ఫోను, ఉత్తరాల్లాంటి వర్తమానాలు కూడా లేవు. ఇదంతా చూసి నీ మనసు పిచ్చిపిచ్చిగా ఆలోచించి వుంటుంది. ఎంత పొరపాటుగా ఆలోచించినా మరోపెళ్ళికిఒప్పుకోవడమా? అలా ఒప్పుకునేముందు నా మనసేమిటో తెలుసుకోకపోవడం నువ్వు చేసిన అసలైన తప్పు! సరే...లీవిట్!

ఈ దూరం మనసు చేరువచేస్తుం దని నేను ఈమధ్య ఇలా ప్రవర్తించాను గాని ఈవిధంగా నీ అవివేకంతో నన్ను శాశ్వతంగా దూరం చేసుకుంటావని వూహించలేదు.

మైగాడ్! ప్రేమ విషయంలో పెద్ద విలన్ 'అపార్థమే!' కులమతాలు, అంత స్తులు, తల్లిదండ్రులు కాదు. ప్రేమికులు ఒకరినొకరు పరిపూర్ణంగా అర్థంచేసు కుంటే, పైకారణాలేమీ నిజానికి వాళ్ళు ఏకమయేందుకు ఏవిధంగానూ ఆటం కాలు కాబోవు!

'ఆలస్యం చేయకు. వెంటనే వచ్చి శైలజను సీదాన్ని చేసుకో!' అంటూ ప్రఫుల్ల ఢిల్లీలో నా అడ్రెస్‌కి ఇచ్చిన టెలిగ్రామ్‌చూసి ఎంత కంగారుపడ్డానో

తెలుసా? ఫ్లైట్‌ని మించిన వేగంగల వాహనం మరొకటి ఏదైనావుంటే, అందులోనే వచ్చివుండేవాణ్ని! ఇంటికి చేరుకోవడంతోటే ప్రఫుల్ల ఆదుర్దాగా నీ సంగతి చెప్పింది. వెంటనే కారు తీసుకుని బైలుదేరాను"

శ్రీనివాస్ అలుకగా చూశాడు. శైలజకి అతనిమాటలు సితార్ సంగీతంలా విన్పిస్తున్నాయి.

"అయామ్ సారీ! నేను మిమ్మల్ని సరిగ్గా అర్థంచేసుకోలేకపోయాను"

శైలజ స్టీరింగ్‌పైవున్న అతని చేతి మీద చేయివేసి చెప్పింది.

"శైలూఅయ్‌లవ్ యూ! అయ్‌వాంట్ యూ వెరీమచ్"

కారు స్లోచేసి ఆమె నుదుటిమీద మృదువుగా ముద్దుపెట్టుకున్నాడు శ్రీనివాస్.

అతని ముద్దుకు కలిగిన పారవశ్యం అరమోడ్పులైన ఆమె కళ్ళల్లో ప్రతిఫలించింది.

"నాకు...నాకు ఈ అదృష్టం నమ్మశక్యం కాకుండావుంది" తగ్గు స్వరంతో అంది.

"అలాగేం?"

అతను కారును తీసుకెళ్ళి ఒక పూల దుకాణంముందు నిలిపాడు.

"ఏం కావాలాస్సార్?" అంటూ కారు దగ్గరికివచ్చినకుర్రాడికి యాభైరూపాయల నోటు అందించి చెప్పాడు.

"రెండు గులాబీ పూలదండలు"

కుర్రాడు తెచ్చిన పెద్ద గులాబీ దండలను అందుకున్నాడు. అతను చిల్లర నోట్లు ఇవ్వబోతుంటే "ఉంచుకో" అని చెప్పాడు.

అంత మొత్తం టిప్‌గాఇచ్చినశ్రీనివాస్‌కేసి విచిత్రంగా, కృతజ్ఞతగా చూసి వెళ్ళిపోయాడు ఆ కుర్రాడు.

శైలజ విస్ఫారిత నేత్రాలతో చూస్తోంది.

ఒక దండ ఆమె మెడలో వేసి, మరొక దండ ఆమెకు అందించి తల వంచాడు శ్రీనివాస్.

సిగ్గు ఆమె చెక్కిళ్ళలో గులాబీ రంగులో ప్రతిఫలించింది. దండ అతని మెడలో వేసి కళ్ళు వాల్చేసింది.

"ఇప్పుడు కలుగుతోందా నమ్మకం?"

ఆమె చుబుకాన్ని పట్టి ముఖం లేవనెత్తాడు.

"........." మౌనంగా తల వూపింది.

కారు స్టార్ట్‌చేయబోయి మళ్ళీ ఏదో గుర్తొచ్చినట్టు ఆగాడు శ్రీనివాస్.

పేంట్ జేబులోంచి ఏదో చిన్నవస్తువు తీశాడు. అది శైలజకి కన్పించగూడదన్నట్టు గుప్పిట మూసి వుంచాడు.

ఆమె భృకుటి ముడిపడింది.

ఏమిటది?

"ఏది నీ చేయి?"

అతని మాటకి మంత్రముగ్ధలా కుడి చేయి చాచింది.

అతను గుప్పిట తెరిచాడు.

అతని అరచేతిలో శైలజకు కానుకగా ఇవ్వగా, ఆమె తిరిగి ఇచ్చేసిన ముత్యపు వుంగరం!

ఆమె చేయి అందుకుని, ఉంగరం వేలికి పెడుతూ, "ప్రఫుల్లనువ్వు ఇచ్చేశావంటూ నాకు ఈ రింగ్ ఇచ్చినప్పుడు నేనెంత బాధపడ్డానో తెలుసా?నా ప్రేమను నీవు నిరాకరించినట్టు, ఈ రింగ్‌తోపాటే నా ప్రేమను నాకు తిరిగి ఇచ్చేసినట్టుగా ఫీలయ్యాను.ఇదుగో! ఇపుడు నా ప్రేమను దీంతోపాటు ఇస్తున్నా! ఈ వుంగరం




జీవిత పర్యంతం ఈ వేలికి వుండవలసిందే! నామీద నీకు ప్రేమ నశిస్తే..."

ఆ పైన మాటలు వెలికి రాకుండా ఆమె తన చేతిని అతని నోటికి అడ్డుగా ఉంచింది.

ఆ చేతిని పట్టుకుని చేయి వెనుక గాఢంగా చుంబించి వదిలేశాడు శ్రీనివాస్. ఎడమ చేతిని ఆమె చుట్టూ పెనవేసి, కారును స్టార్ట్ చేసి ముందుకు పోనిస్తూ ఆమె ఫాలభాగంపై తన పెదవులతో సున్నితంగా స్పృశించాడు.

ఆవిధంగా అతని దృష్టి డ్రైవింగ్ పై నుంచి మరలడం వల్ల స్టీరింగు కంట్రోల్ తప్పింది. ఎదురుగా వేగంగా వస్తున్న లారీ వారి కారుని బలంగా తాకింది.

శైలజ కెవ్వుమంది.

గుండె కొట్టుకుంటున్న సవ్వడి ఆమె చెవులకు స్పష్టంగా వినబడుతోంది!

దండకోసం మెడలో తడుముకుంది. లేదు! వేలికి ఉంగరం కూడా! ఆమెకు అర్థమైంది!

కల!

ఎన్నటికీ వాస్తవం కాని కలగన్నది తను!

లేకుంటే, ఈ కలకేమన్నా అర్థం వుందా?

శ్రీనివాస్ జీవితంలో మరో యువతి వుందనేకదా తను అతని నుంచి దూరం కావాలనుకుంది. అలాంటి తనకోసం శ్రీనివాస్ ఎందుకు వస్తాడు?

ఈ ఆలోచనతో ఏదో తెలీని నిస్సహాయత్వ భావన ఆమె హృదయాన్ని మెలిపెట్టి, కన్నీళ్లు తెప్పించింది.

ఆ అశ్రువులు ముఖాన్ని తడుముతూ దిండులోకి జారి ఇంకిపోతున్నాయి!

* * *

"జోక్ చేస్తున్నావా ప్రఫూ?"

శ్రీనివాస్ అపనమ్మకంగా ప్రఫుల్ల ముఖంలోకి ఏదో వెదుక్కుంటున్నట్టు చూశాడు.

"హూడూ యూ థింక్ అయామ్? ఇలాంటి విషయాల్లో జోక్ చేస్తానా?" అంది ప్రఫుల్ల.

"శైలజ పెళ్లి! నిజమా?" అతను నిర్ఘాంతపోయాడు.

"ఎందుకు... ఎందుకిలా చేసింది?" అతను తనలో గొణుక్కుంటున్నట్టు అన్నాడు.

"నువ్వేమీ అడగలేదా?"

"తనే ఏమీ చెప్పలేదు"

శ్రీనివాస్ కి ఏమనుకోవాలో, దీన్ని ఎలా అర్థంచేసుకోవాలో తెలియడం లేదు. 'ఎక్కడ జరిగింది పొరపాటు?'

తన ప్రేమను స్పష్టంగా తెలియపరచాడే ఆమెకు!

వ్యవహారాలన్నీ సెటిల్ అయాక ఆమెను వివాహం చేసుకుందామనుకున్నాడు. ఇపుడు అవన్నీ ఓ కొలిక్కి రావడంతో ఢిల్లీ నుంచి ఆనందంగా తిరిగి వచ్చాడు.

తను వెళ్లి ఆమెతో పెళ్లి విషయం మాట్లాడి సంతోష సముద్రంలో కేరింతలు కొట్టించాలనుకున్నాడు.

కాని, ఇక్కడికి చేరుకునేసరికి ప్రఫుల్లనుంచి ఈ కబురు.

ఆమె తనను అర్థం చేసుకోలేక పోయిందా...?

అలా తనేమీ ప్రవర్తించలేదే...

ఈమధ్య కలవడం, ఫోన్ చేయడం తగ్గించడాన్ని మరోలా అర్థం చేసుకుందా?

ఎందుకు మనసు మార్చుకుంది.?

ప్రశ్నల తాకిడితో అతని మెదడు



వేడెక్కింది.

"నువ్వు కానుకగా ఇచ్చిన ఉంగరాన్ని కూడా తిరిగిచ్చేసింది."

ఏమీ తోచక సతమతమవుతున్న అతన్ని ప్రఫుల్ల మాట ఇంకా కల్లోల పరచింది. దిగ్భ్రాంతిగా చూశాడు.

కాసేపటికి తేరుకుని ఫోనువేపు నడిచి రిసీవర్ ఎత్తి డయల్ చేయసాగాడు.

"శైలజకా?"

అతను ప్రఫుల్లవేపు చూడకుండా తల



వూపాడు.

అవతల ప్లీడరుగారి ఇంటిదగ్గర ఎవరో ఫోన్ ఎత్తారు.

"దయవుంచి శైలజను పిలుస్తారా?" చెప్పాడతను.

ప్రఫుల్ల మౌనంగా నిలబడి అతన్నే గమనిస్తోంది.

అతను చేతివేళ్ళతో కనురెప్పలను అదుముకుని, తల దూసుకుంటూ భావోద్వేగాన్ని అదుపుచేసుకోలేనట్టు తల విదిలించాడు.

శైలజ ఫోన్‌దగ్గరికి చేరుకోవడానికి పట్టిన పదినిమిషాలూ ఎంతో అసహనంగా గడిపాడు.

ఆమె ఫోన్ ఎత్తగానే—

"శైలూ, నేను శ్రీనివాస్‌ని" అన్నాడు ఆత్రంగా.

అవతల్నుంచి ఆమె ఏమందో, అతని ముఖంలో రంగులు మారాయి. "శైలూ కాస్త నేను చెప్పేది..."

"............"

అవతల ఫోన్ పెట్టేసిన చప్పుడుకి రిసీవరుపై బిగుసుకుంది అతని చేయి. అది క్రమంగా సడలి, నీరసంగా రిసీవర్‌ని క్రెడిల్ చేశాడు.

"ఏమంది వాసూ?" ప్రఫుల్ల దగ్గరికొచ్చింది.

"ఏమీ వినదలచుకోలేదట. ఇలా ఫోన్లతో ఇబ్బంది పెట్టవద్దంది."

"లెట్ హర్ గోటూ హెల్!"

ఆమె మూర్ఖత్వానికి కలిగిన విపరీతమైన కోపాన్ని నిగ్రహించుకోలేకపోయింది ప్రఫుల్ల.

"మనసులో ఏముందీ చెప్పదు. మన మాటలు వినిపించుకోదు! ఏమిటసలు? తన అర్థంలేని ప్రవర్తనతో ఎటూ తోచకుండా చేస్తోందే!

తన పెళ్ళి గురించి చెప్పి వెళ్ళాక నేను మళ్ళీ ఫోన్‌చేస్తే నాతోనూ ఇలాగే మాట్లాడింది. మనం ఎంతకని ఎప్రోచ్ అవుతాం అలాంటి మనిషిని! పోనివ్వు వాసూ! ఆమెను గురించి మర్చిపో!"

శ్రీనివాస్ నీరసంగా వెళ్ళి సోఫాలో కూలబడి, తల వెనక్కు వాల్చి, కళ్ళు మూసుకుని చెయ్యి అడ్డుగా పెట్టుకున్నాడు.

ప్రఫుల్ల వచ్చి సోఫాలో అతనిపక్కనే కూర్చుంది.

"వాసూ, ప్లీజ్! ఫర్ గెట్ హర్!" భుజం పైతడుతూ చెప్పింది.

"అది నువ్వు చెప్పినంత సులభమా ప్రఫూ?"

అతని కంఠంలో స్పష్టమైన వేదనకి ప్రఫుల్ల మనసు చలించింది.

అతనికి జవాబివ్వలేకపోయింది.

నిజమే! అంత త్వరగా విస్మరించేదయితే ఇక ప్రేమకు విలువేముంటుందని? సంతోషం, దుఃఖం, కోపం, జాలిలాంటి భావాలకుమల్లే అదికూడా తాత్కాలికమైనదే అవుతుంది కదా! శాశ్వతమైనది కావడంవల్లనే 'ప్రేమ'కు అంత విలువ ఆపాదింపబడిందేమో!

అర్థంలేకుండా ప్రవర్తిస్తున్న ఆమె మూర్ఖత్వానికి కోపంతో ఇలా మాట్లాడుతోందేతప్ప శైలజపట్ల తనకు 'స్నేహభావం' ఏ మాత్రం నశించలేదే! స్నేహంలోనే ఇలా వున్నప్పుడు మరి 'ప్రేమ'లో ఆ ఇష్టం ఇంకెంత గాఢంగా వుండాలి?

"ప్రఫూ! కాస్త టీ తెచ్చి పెడతావా?"

ఆమె అక్కడినుంచి లేచివెళ్ళింది.

శ్రీనివాస్‌కి ఏం చేయాలో పాలుపోవడం లేదు.

ఎలా?

శైలజను నాదాన్ని చేసుకోవడంఎలా?

అసలది సాధ్యమేనా?

ఆమెకు పెళ్ళి కుదిరిపోవడం పరిస్థితి చేజారిపోయినట్టు కాదుకదా!

ప్రఫుల్ల తెచ్చిన టీ తాగి సోఫాలోంచి లేచాడు శ్రీనివాస్.

"ఎక్కడికి?" అంది ప్రఫుల్ల.

"నువు కూడా వస్తావా? శైలజను కలవాలి"

"పిచ్చివాడివా?" అన్నట్టు చూసిందామె.

"ఫోన్‌లోనే ఏమీ మాట్లాడలేదు, కలిస్తే సరిగ్గా ప్రవర్తిస్తుందనుకుంటున్నావా? ఏమిటి నీ వుద్దేశం? ఇక నువ్వేం ప్రయత్నించినా వృధా అని తోస్తోంది నాకు. ఆమె ఎందుకో నువు అక్కర్లేదనుకుని ఆ పెళ్ళికి ఒప్పుకుంది. ఇప్పుడు కలిస్తే మాత్రం ఆ పెళ్ళి రద్దు చేసుకుని నీతో వచ్చేస్తుందనుకుంటున్నావా? పెళ్ళి నిశ్చయమైపోయాక మనమేం ప్రయత్నించినా రభస కావడమే తప్ప మరో ప్రయోజనం లేదు. కనుక అలాంటి వుద్దేశాలు విరమించుకోవడం వుత్తమం!"

"అంతేనంటావా ప్రఫూ?"

అతను దీనంగా అడిగిన తీరుకు ప్రఫుల్ల కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"ఆమెను మరచిపో వాసూ! నేను చెప్పేదంతే!"

శ్రీనివాస్ నిలబడలేనట్టు నిస్సత్తువగా సోఫాలో వాలిపోయాడు.

* * *

"బావున్నావా?" అంది శైలజ తనను కలిసేందుకువచ్చిన వనితను ఇంట్లోకి ఆహ్వానిస్తూ.

"నేను బాగానే వున్నాను గానీ, నువ్వేమిటి అదోలా వున్నావ్?" అందామె ముఖంలోకి చూస్తూ.

"ఎలా వున్నాను? ఏమీలేదు! కొంచెం వంట్లో బాగోలేదంతే" శుష్కహాసంతో





జవాబిచ్చింది శైలజ.

శైలజ టీ చేసింది.

అది తాగాక, "నీకో విషయం చెప్పాలని వచ్చాను" అంది వనిత.

"అలా పార్కుకెళ్లి మాట్లాడుకుందాం!"

శైలజ పక్కింట్లో వున్న భాగ్యంతో బైటకు వెళ్తున్నట్టు చెప్పి అనుమతి తీసుకుని వచ్చింది.

ఇద్దరూ అక్కడికి దగ్గరలోవున్న చిన్న పార్కు వైపు నడిచారు.

నడుస్తుండగా కాన్వెంటులోని పిల్లలు శైలజ కోసం కలవరించినట్టుగా అడుగుతున్నట్టు, ప్రిన్సిపాల్ గిరినాధ్ కూడా అప్పుడప్పుడూ శైలజను తలచుకుంటున్నట్టు చెప్పిందామె.

శైలజ నిర్లిప్తంగా విని వూరుకుంది.

పార్కుకి చేరుకుని ఓ మూల పచ్చికపై కూర్చున్నారు.

"నువ్వు చేయడానికి ఒప్పుకుంటే ప్రస్తుతం ఓ ఉద్యోగం సిద్ధంగా వుంది"

శైలజ తన పెళ్ళి కబురు చెబుదామనుకుంటున్నంతలో వనిత ఈ మాట అంది. ఆమె తను చెప్పబోయేది విరమించుకుని—

"ఎక్కడ? ఏం ఆఫీసు??" అంది యధాలాపంగా.

"సిటీలో కాదు ... గుంటూరులో! ఆఫీసు కూడా కాదు. నీ ఉద్యోగం ఓ ఇంట్లో!"

"అంటే?" శైలజ అర్థంకానట్టు చూసింది.

"వివరంగా చెబుతాను విను. గుంటూరులో మా పెద్దమ్మగారి అబ్బాయి ఒకతనున్నాడు. వేణు అని డాక్టరు! వయసు ముప్పై అయిదు వరకూ వుంటుంది. ఈమధ్యనే భార్య చనిపోయింది. అతనికో కూతురు, కొడుకు పిల్లలిద్దరూ చిన్నవాళ్ళే. తెలిసీ తెలియని వయసు. పాపకి ఆరేళ్లు, బాబుకి నాలుగు వుంటాయి. ఇప్పుడు పిల్లల్ని ఎలా పెంచడమా అనేది వేణుకి సమస్యగా మారింది. తల్లి దండ్రుల దగ్గర గాని, అత్తమామల దగ్గర గాని వుంచడం ఇష్టం లేదు. ఆవిధంగా పిల్లలు తనకు దూరంగా వుండాల్సి వస్తుందనీ, పెద్దవాళ్ల పెంపకం చాదస్తంగా వుంటుందనీను. పెళ్లి చేసుకుందామంటే ఆ వచ్చినామె పిల్లల్ని ఎలా చూస్తుందోననే భయం! పిల్లలు ఏమాత్రం బాధపడ్డా భరించలేడు. అంత ప్రేమ!

అందుచేత పిల్లల్ని ఇంట్లోనే చదివిస్తూ వాళ్ల సంరక్షణ చూస్తూ వాళ్ళింట్లోనే వుండిపోయేందుకు ఎవరైనా వుంటే చూడమని ఉత్తరంరాశాడు.

ఈరోజు ఆ ఉత్తరం చదవగానే నువ్వే గుర్తొచ్చావు. ఇక్కడమీ అక్కతో గొడవగా వుంటుందని చెప్పావుకదా! నువ్వెందుకు వెళ్ళగూడదు అక్కడికి? హాయిగా వుంటుంది! భోజనమదీ వాళ్లింట్లోనే. వంటమనిషివుంది. నీ పని పిల్లలకి చదువు చెప్పడం, వాళ్ళకన్నీ అమరేట్టు చూడటం. జీతం నీ ఇష్టం! చాలా బావుంటుంది మరి! ఏమంటావ్?" అంది వనిత.

"నేను కొంచెం ఆలోచించుకోవాలి" అంది శైలజ.

"నీ ఇష్టం! తీరికగా ఆలోచించుకో. కాని, రెండు రోజుల్లో నాకు ఏ సంగతీ చెప్పాలి. వేణు నా ఉత్తరంకోసం ఎదురు చూస్తుంటాడు" అంది వనిత.

కాసేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్నాక ఆమె వెళ్లిపోయింది. శైలజ ఇంటి దారి పట్టింది.

రాత్రి నిద్రపోయేందుకు పక్క మీద వాలినప్పుడు గాని ఆమెకు తీరికగా ఆలోచించుకోవడానికిసమయంచిక్కలేదు.

శైలజ మొదటిసారిగా ఆమె మానసిక పరిధిని దాటి తన పరిస్థితి గురించి ఆలోచించుకుంది.

ఈరోజు శ్రీనివాస్ ఫోన్ చేస్తే తిరస్కారంగా మాట్లాడింది. ఎందుకలా మాట్లాడిందో తనకే తెలీదు.

అతను నిజంగా తనను ప్రేమించినవాడే అయితే వచ్చి కలుస్తాడనుకుంది. అప్పుడు ఫొటో చూపించి దాని సంగతి చెప్పమని అడిగేది. కాని, అతనికి తనో లెక్కకాదు. తను ఎన్నోదో! లేకపోతే ఫొటోలో అలా వుంటాడా? తను అతని హృదయంలో స్థానంపొందిన మొదటి వ్యక్తి కాదనే నిజంకాదూ, తన మనసును ఇంత విరక్తితో నింపింది?

తామిద్దరూ 'మేడ్ ఫర్ ఈచ్ అదర్' అనుకుంది ఓసారి.

ఎంత భ్రమ తనది!

శ్రీనివాస్ తనవాడు కాదనే బాధతో మరో ఆలోచన లేకుండా తను భాగ్యం చెప్పిన సంబంధానికి ఒప్పుకుంది. పెళ్లి చూపులు కూడా వద్దంటూ పెళ్లికి సరేనంది.

కాని, ఇప్పుడు ఆలోచిస్తే తను పొరపాటు చేసిందన్పిస్తోంది.

తను శ్రీనివాస్‌ని మర్చిపోలేక పోతోంది.

ఎంత ప్రయత్నించినా అది తనకు అసాధ్యమైన పనే అన్పిస్తోంది.

అందుకే ఇపుడు, మరో వ్యక్తికి భార్యగా అతని జీవితంలోభాగం పంచుకోగలదా అనే వెరపు కలుగుతోంది.

ఈ పెళ్లి తన కష్టాలకు అంతంలా కాకుండా మరో విధమైన ఆరంభంగా పరిణమిస్తే? అనే భయం తన మనసును స్థిమితంగా వుండనివ్వడంలేదు.

అవును. తన సంపూర్ణ ఇష్టంతో జరగని ఈ పెళ్ళితో తర్వాత తను రాజీ పడలేదేమో?

అదే సంభవిస్తే అంతకన్నా నరక సదృశ్యం వుంటుందా?

అది జీవిత పర్యంతం, విధిలేక భరించవలసిన నరకమవుతుంది.

అది తప్పాలంటే తను ఈ పెళ్ళిని తప్పించుకోవాలి.

తను తల్లిదండ్రుల మరణం తర్వాత తన ఇష్టాయిష్టాల ప్రసక్తి లేకుండా భాగ్యానికి అనుగుణంగా బతుకుతూ, ఆమె చెప్పినట్లల్లా చేసే మరబొమ్మ అయింది.

ఇప్పుడా జీవితంనుంచి విముక్తిపొందే అవకాశం లభించింది తనకి.

ఈ జీవితం తనది. తన అభీష్టం ప్రకారం సాగాల్సింది.

అందుకు ఈ అవకాశాన్ని ఉపయోగించుకోవాలి.

ఈ విధమైన స్థిర నిర్ణయానికి వచ్చాక శైలజ నిశ్చింతగా కళ్ళు మూసుకుంది. నిద్రపోతున్న కనురెప్పలపై ఈమధ్య కాలంలో ఆమెకు దూరమైన మనశ్శాంతి వచ్చి వాలింది.

* * *

మరుసటిరోజు—

శైలజ పనులన్నీ ముగించి, భోంచేసి కాన్వెంటుకెళ్ళింది. ముందు వనితను పలకరించిన తర్వాత,

వెళ్ళి ప్రిన్సిపాల్‌ని కలిసింది. గిరినాథ్ సంతోషంగా కాఫీతెప్పించి మాట్లాడాడు.

తర్వాత క్లాసురూముల్లోకి వెళ్ళింది. పిల్లలంతా ఆమెను చుట్టుముట్టారు. వాళ్ళ

ప్రశ్నలతో వూపిరాడనివ్వలేదు. వారితో కాసేపు గడిపి స్టాఫ్‌రూమ్‌కు చేరుకుంది.

ఇద్దరూ లంచ్‌రూమ్‌కి వెళ్ళి కూర్చున్నారు.

శైలజ వనితకుతన నిర్ణయంచెప్పింది. ఆమె హర్షం వ్యక్తంచేసింది.

తన ప్రయాణపు ఖర్చులకోసం వంద రూపాయలు అప్పుగా ఇమ్మని కోరింది శైలజ. సాయంత్రంఇంటికి తెచ్చిస్తానంది.

శైలజ అక్కడినుంచి తిరిగొచ్చేసింది. ఆమె తన ఇంటి సమీపానికి చేరుకునేసరికి కారులో వస్తున్న ప్రఫుల్ల కనబడింది.

సంతోషంతో వికసించిం దామెముఖం.

కాని, ప్రఫుల్ల కారును ఆమె పక్కన ఆపి ముభావంగా "ఇందులో ఉత్తర ముంది... చదువు" అంటూ ఓ కవరు అందించి, "నేను వెళ్తున్నాను" అంటూ కారును రయ్యిన పోనిచ్చింది.

శైలజ విస్తుబోయింది.

కారు కనుమరుగయే వరకూ చూసి ఇంటివైపు వడివడిగా అడుగులేసింది. ప్రఫుల్ల ఏం రాసి వుంటుందా అనే ఆలోచన ఆమెను తొందరపెట్టింది.

ఇంటికి చేరుకోవడం ఆలస్యం ముందు కవరు చింపి కాగితం బయటకితీసి మడతలు విప్పింది.

ప్రఫుల్ల "శైలజా!" అంటూ ఉత్తరాన్ని మొదలుపెట్టింది.

ఆమెకు హృదయాన్ని ముల్లుతో పొడిచినట్టయింది.

'తను అంత కాని మనిషి అయిపోయిందన్నమాట! ఎంత పొడిగా సంబోధించింది!' అని నిట్టూర్చి ఉత్తరం చదవ సాగింది.

"నాకు నీమీద ఎంత కోపంగావుందో తెలుసా? నీతో స్నేహం చేసినందుకు నేనిప్పుడు నిజంగా చింతిస్తున్నాను.

అసలు నువ్వు హఠాత్తుగా ఇలా ఎందుకు మారిపోయావో అర్థంకావడం లేదు. ఒకరిని వలచి, వలపించుకుని మరొకరితో పెళ్ళికి ఎందుకు సిద్ధపడ్డావో అంతుబట్టడంలేదు.

నీ నిర్ణయం శ్రీనివాస్ మనసును ఎంత దెబ్బతీసిందో నీకెలా తెలుస్తుంది?

అతను మతిభ్రమించినట్టయాడని చెబితే నీకు సంతోషంగా వుంటుందా?

రాత్రి అతనో బార్‌లో తప్పతాగి ఇంటికి రానని గొడవచేస్తే డ్రైవర్ వచ్చి నాకు చెబితే, నేను బార్‌కి వెళ్ళి అతన్ని పట్టుకురావలసివచ్చింది తెలుసా?

అతని దీనస్థితికి నేను బాధపడుతుంటే అతనేమన్నాడో చెబితే నీకు హృదయమనేది వుంటే బద్దలై తీరాల్సిందే!

"ప్రఫూ! నేనీ తాగుడుతో దేవదాసులా మారిపోతానని నువ్వేం భయపడవద్దు. ప్రస్తుతం నా ధ్యేయం ఒక్కటే! శైలజను మర్చిపోవడం! మామూలు పరిస్థితుల్లో ఆమెను మరవలేను. నా హృదయంలో నిండిపోయిన ఆమె, మస్తిష్కాన్ని మత్తుతోనిద్రబుచ్చితేతప్ప మరపుకురాదు. నా ప్రేమ సముద్రపు నీరులాంటిది కదూ, ప్రఫూ! అనంతమైన ఆ నీరు తాగేందుకు పనికిరానట్టే, నాకు శైలజపట్ల ఎంత ప్రేమవుంటే ఏం ప్రయోజనం? ఆమెకు దాన్ని స్వీకరించే హృదయంలేక పోయాక"

ఇవి శ్రీనివాస్ తాగిన మత్తులో తడబడుతూ చెప్పిన మాటలు!

శ్రీనివాస్ నిన్ను ప్రేమిస్తున్నాడని నేను చెప్పినపుడు నువ్వెంత తృణీకారంగా మాట్లాడావో గుర్తుందా? అంత మత్తులో కూడా శ్రీనివాస్ నిన్నే పలవరించినదానికి

ఇప్పుడు ఏమంటావు?

నీ అర్థంలేని ప్రవర్తనతో నీకు నువ్వే కొనితెచ్చుకుంటున్న దురదృష్టానికి చింతించడంతప్ప ఏమీచేయలేకపోతున్న- ప్రఫుల్ల!" ఆ వుత్తరం చదివాక శైలజ మనసులో ఏదో విచ్చుకున్నట్టయింది.

కాని, ఆ ఫొటో!

ఇపుడు శ్రీనివాస్ తననే హృదయంలో నిలుపుకుని ఆరాధిస్తుండవచ్చు!

తను నమ్ముతోంది.

కాని, ఆ ఫొటోలోని యువతి!

వారి మధ్య ఎంత దగ్గరితనం లేకపోతే అతనితో అంత సన్నిహితంగా వుంటుంది.

ఆమెతో సైతం అతను ప్రేమ వ్యవహారం నడిపి వుండవచ్చుకదా!

ఏ కారణం వల్లనో ఆమె అతనికి దూరమై వుంటుంది!

ఆతర్వాత శ్రీనివాస్ తనను ప్రేమించి వుంటాడు.

అదే...

అదే తన మనసునంతగా గాయపరచింది.

ఆ యువతి గురించి శ్రీనివాస్ ముందే చెబితే తను తేలికగా తీసుకుని వుండేదేమో!

కాని, అతనా విషయాన్ని మరుగు పరచటం, అది కూడా సహించలేకపోయింది.

ఇదంతా ప్రఫుల్లకేం తెలుసు!

తనను అర్థం చేసుకోకుండా దూషిస్తుందా?

ఆ ఫొటో పంపితే దోషమెక్కడుందో ఆమెకే అర్థమవుతుంది.

ఆమె వెంటనే కూర్చుని ఆలోచించి ప్రఫుల్లకు వుత్తరం రాసింది.





"డియర్ ప్రఫుల్లా!

నేను నీకేమీ కానట్టు నువు 'శైలజా!' అని మాత్రమే సంబోధించినా, నేను అలా అనుకోలేక, నీ తీయటి స్నేహాన్ని మరవలేక 'డియర్' అని ప్రారంభించాను. దీనికి నీకు కోపం వస్తే క్షమించు.

నీ నిష్ఠూరాన్ని, నిందల్ని భరించేందుకు నేను సిద్ధమే! అయితే వాటికి ముందు నేనెంతవరకూ దోషినో నువ్వు నిర్ధారించుకోవాలి. నేను పంపుతున్న ఈ ఫొటో నాలోని మార్పుకు మూలమేమిటో నీకు బోధ పరుస్తుందనుకుంటాను.

ఇది చూశాక అయినా నీ తొందరపాటుకి పశ్చాత్తాపపడి తిరిగి నాతో మునుపటి 'స్నేహభావం'తోనే వుంటానంటావా? అలా అయితే ఓ పనిచేయి! నేను రేపు గోల్కొండ ఎక్స్‌ప్రెస్‌లో గుంటూరు వెళ్ళిపోతున్నాను. అక్కడ నా బతుకు తెరువుకు ఓ ఆధారం దొరికింది. బహుశా అందులోనే నా శేషజీవితాన్ని గడిపేస్తానేమో! ఇక పెళ్ళి గురించి ఆలోచించే ప్రసక్తే లేదు!

మన మధ్య స్నేహం వుందనుకుంటే నువు స్టేషన్‌కి వచ్చి సెండాఫ్ ఇవ్వు చాలు! ఆ మనశ్శాంతితో నేను తృప్తిగా హైదరాబాద్ వదిలి వెళ్ళిపోతాను.

నీ స్నేహాన్ని ఎప్పటికీ కోరుకునే,

శైలజ"

శైలజ ఆ కాగితాన్ని ఫొటోతోపాటు ఓ కవరులో పెట్టింది.

వీలు కుదిరినపుడు తనే స్వయంగా వెళ్ళి ప్రఫుల్లకు ఇచ్చిరావాలనుకుంది. కాని, పనుల వత్తిడితో సాయంత్రం వరకూ గడిచిపోయింది.

సాయంత్రం వనిత వచ్చి ఆమె అడిగిన డబ్బుతోపాటు, గుంటూరులో వేణు అడ్రెస్ వున్న కాగితం ఇచ్చి,

రైల్వే స్టేషన్ నుంచి అక్కడికి ఎలా వెళ్ళాలో వివరాలు చెప్పింది. 'రేపు స్టేషన్‌కి నేను కూడా వస్తాను. నువ్వు బైలుదేరేముందు 'స్టేషన్‌కి వచ్చి రిసీవ్ చేసుకో'మని వేణుకి టెలిగ్రాం ఇద్దాం'- అని చెప్పి వెళ్ళిపోయింది.

'చీకటి పడ్డాక వెళ్ళడమెందుకులే! ప్రఫుల్లకి ఉత్తరం రేపు ఇవ్వొచ్చు!' అనుకుని వూరుకుంది శైలజ.

మరుసటిరోజు...

భాగ్యం చూడకుండా శైలజ తన బట్టలు, అవసరమైన చిన్న సామానులు సూట్ కేసులో సర్దుకుంది.

ఆమె వుద్దేశం దొంగచాటుగా పారి పోవాలని కాదు. మొదట భాగ్యానికి చెప్పి తెగతెంపులు చేసుకునే వెళ్ళాలనుకుంది. కాని, వెంటనే దాని పర్యవసానం గుర్తొచ్చి ఆ ఆలోచనను విరమించుకుంది. భాగ్యం తననంత సులువుగా పోనివ్వదు. ఆమె కుదిర్చిన పెళ్ళి జరగకపోతే పరువు పోతుందని భయపడుతుంది. దాంతో తను వెళ్తుంటే ఆమె ఎంతో రభస చేస్తుంది- చుట్టుపక్కల అందరూ పోగయ్యేలా! ఆ అవమానాన్ని భరించడం కష్టం! భాగ్యం మొత్తుకోళ్ళకి జాలిపడి అందరూ ఆమెకు వత్తాసు పలికితే తను ఆగిపోవలసి వస్తుంది. అప్పుడు తన బతుకు భాగ్యం దగ్గిర మరీ హీనమవుతుంది. అందుకే ఆమెకు తెలియకుండా, ఆమె లేని సమయంలో ఇక్కడినుంచి నిష్క్రమించాలి!

వెళ్ళిపోతున్నట్టు భాగ్యానికి ఓ చీటీ పెడితే సరిపోతుంది. ఎక్కడికి, ఏమిటనేది ఏమీ రాయకూడదు. అంతగా కావలిస్తే తర్వాత వివరంగా క్షమాపణలతో శంకర్రావుకి వుత్తరం రాయొచ్చు.

ఈ వుద్దేశంతోనే ఆ ఇంట్లో నుంచి రహస్యంగా నిష్క్రమించాలనుకుంది.

కాని, అలవాటుకు విరుద్ధంగా భాగ్యం ఆరోజు భోంచేసిన వెంటనే బైటకు పోకుండా చాలా సేపటి వరకూ ఇంట్లోనే వుంది. శైలజ దిక్కు తోచక అస్థిమితంగా ఆలోచిస్తూ ఆమె బైటకు వెళ్ళే సమయం కోసం ఎదురుచూడసాగింది. దానివల్ల ఆమె ప్రఫుల్లకు ఉత్తరం ఇచ్చి వచ్చే కార్యక్రమాన్ని కూడా మానుకుంది.

తను ఆమె దగ్గరికి వెళ్ళి వచ్చేలోపు భాగ్యం కూడా బైట తిరిగి వచ్చేసి, ఇంట్లోనే తిష్ఠ వేస్తే? తను సూట్ కేస్ తీసుకెళ్ళడం సాధ్యం కాదు. అదీ ఇక్కడి సమస్య! అందుచేత తను భాగ్యం ఇంట్లోంచి కదిలే అదనుకోసం వేచి వుండి ఇక్కడి నుంచి జారుకోవాలి.

ఆమె బాధ తెలిసినట్టుగా ఇంతలో తాయారమ్మ వచ్చి భాగ్యాన్ని పిలిచింది.

"ఇప్పుడే వస్తాను. ఇల్లు జాగ్రత్త" అని శైలజను హెచ్చరించి బైటకు వెళ్ళిందామె.

శైలజ 'హమ్మయ్య!' అనుకుంది.

ఆమె చుట్టుపక్క లెక్కడా లేదని నిర్ధారణ చేసుకున్న వెంటనే సూట్ కేస్ తీసుకుని ఇంటికి తాళం పెట్టి తాళంచెవి పక్కవాళ్ళకిచ్చి గబగబా రోడ్ మీదికి నడిచింది.

రోడ్ మీదికి చేరుకోగానే కంటబడిన ఆటోలో ప్రఫుల్ల వాళ్ళింటికి బైలుదేరింది. ఆమెకు ఉత్తరమిచ్చేసి, అటునుంచి సికింద్రాబాద్ స్టేషన్‌కి చేరుకోవాలని ఆమె వుద్దేశం!

ఆటో నడుస్తుండగా ఎందుకో అనుమానం వచ్చి తను రాసిన

ఉత్తరాన్ని కవరులోంచి తీసి చదివింది.

"నేను రేపు గోల్కొండ ఎక్స్‌ప్రెస్‌లో గుంటూరు వెళ్ళిపోతున్నాను" అదీ దొర్లిన పొరపాటు! ఆ ఉత్తరం క్రితం రోజే ప్రఫుల్లకు ఇవ్వాలనుకుని అలా రాసింది. పెన్‌తో 'రేపు'ను కొట్టేసి పైన 'ఈరోజు' అని రాసి తిరిగి ఉత్తరం కవరులో పెట్టేసింది.

ఆమె మనసులో ఇప్పుడు ఎలాంటి భావోద్రేకాలకూ తావులేని నిర్వికార భావం చోటు చేసుకుంది.

ఆటో ప్రఫుల్ల వాళ్ళ భవంతి మెయిన్ గేటు దగ్గిర ఆగింది. దిగి గేటు దగ్గరికెళ్ళి లోపలి ఆవరణలో పని చేసుకుంటున్న తోటమాలిని చూసి పిలిచింది శైలజ.

ఆమె లోపలికెళ్ళి ప్రఫుల్లను కలవాలనే వుద్దేశాన్ని మార్చుకుంది. శ్రీనివాస్ కూడా వుంటే?

"ఇది వెంటనే ప్రఫుల్లకివ్వు" గేటు లోంచి కవరుని అతనికిచ్చి, గిరుక్కున వెనక్కు వచ్చి ఆటోలో కూర్చుంది.

ఆటో సికింద్రాబాద్ స్టేషన్ వైపు సాగిపోయింది.

* * *

"ఛీ! ఛీ! మీ మగాళ్ళంతా ఇంతే! ఒక్కరినే హృదయపూర్వకంగా ప్రేమించడం మీకెవరికైనా తెలుసా అని!"

శ్రీనివాస్ దగ్గరికి గాలి దుమారంలా వచ్చింది ప్రఫుల్ల.

"నేనింకా నువ్వు అందరిలా కాదు, జెంటిల్ మన్‌వనుకున్నాను. కాని, నువ్వూ ఏమీ తీసిపోవు. నిష్కారణంగా శైలజను నిందించాను. నిజానికి ఆ తిట్లన్నీ నీకే చెందాలి" అందామె కోపంగా.

హాంగోవర్ వల్ల బైటికి వెళ్ళకుండా బద్ధకంగా బెడ్‌మీదే పడుకుని వున్న శ్రీనివాస్, ప్రఫుల్ల కోపానికి కారణమేమిటో అర్థం కాక నివ్వెరపోతూ చూశాడు.

"శైలజను మరవలేకపోతున్నానంటూ కల్లబొల్లి మాటలు చెప్పావు. మరి ఇదేమిటి?" అంటూ చేతిలోని ఫొటోను అతని మీదకు గిరాటుకొట్టింది.

"చెప్పు! ఎవరామె? ఎన్నో ప్రేమాయణం? శైలజకి ముందా? వెనకా??" అందామె అదే కోపంతో.

శ్రీనివాస్ ఫొటో అందుకుని చూశాడు. వెంటనే అతని కళ్ళు చురుగ్గా అయినాయి.

"తన ఛాతీపై తల వాల్చుకుని చిరునవ్వు నవ్వుతోందా యువతి. తను ఒక చేత్తో ఆమె నడుము దగ్గిర పట్టుకుని, మరో చేయి ఆమె తలపై వుంచి కురులను సవరిస్తూ తల వంచి ఆమె చెవిదగ్గిర 'స్వీట్ నథింగ్స్' చెబుతున్నట్టుగా వున్న ఫొటో!"

"అరె! ఇది 'మేడ్ ఫర్ ఈచ్ అదర్!' కాంపిటీషన్‌కి తీసిన ఫొటో!" తనలో మాట్లాడుకుంటున్నట్టుగా అన్నాడు శ్రీనివాస్.

"ఏమిటీ?" అంది ప్రఫుల్ల భృకుటి ముడిపడగా.

"ఈ ఫొటో నీకెలా వచ్చిందో ముందు చెప్పు" అన్నాడు శ్రీనివాస్.

"శైలజ పంపింది. దీన్ని బట్టేనట ఆమె నిన్ను వదులుకుని మరొకరితో పెళ్ళికి ఒప్పుకోవడం!"

"మైగాడ్!" అతని ముఖంలో చిరునవ్వులాంటిది చోటు చేసుకుంది.

"ఇంత కథకి ఇదన్నమాట కారణం! దీని వెనకున్న కథేమిటో తెలుసా ప్రఫు

భవానీశంకర్ అని ఓ ఫొటో గ్రాఫర్‌తో ఇదివరకు నాకు స్నేహం వుండేది.అతను సరదాగాఓ ఆంగ్లపత్రిక వాళ్లునిర్వహించిన 'మేడ్ ఫర్ ఈచ్ అదర్' కాంపిటీషన్‌కి నన్ను ఓ అందమైన మోడల్‌తో కలిపి ఫొటో తీసి పంపిస్తానన్నాడు.నాకిష్టం లేక పోయినా అతని నిర్బంధం మీద ఒప్పు కున్నాను. అదే ఈ ఫొటో! ప్రైజు వస్తే నీకు ఘనంగా చెప్పుకోవాలనుకున్నాను. కాని, అలాంటిదేమీ రాకపోవడంవల్ల నువు వెక్కిరిస్తావని నీతో చెప్పలేదు.

తర్వాత భవానీశంకర్ స్వభావం నచ్చక అతని స్నేహం విరమించాను. అతనికి ఆడవాళ్ళంటే చాలా తేలిక భావ ముంది. ఆ మనస్తత్వం పోగొట్టాలని ఎంతో ప్రయత్నించి సాధ్యంకాక చివరికి అతని స్నేహమే వదులుకున్నాను.

అతను నామీద కక్షతో ఈ ఫొటో శైలజకి పంపించాడన్నమాట! ఇంతకీ శైలజ ఎవరో అతనికెలా తెలిసినట్టు? మేం ఇద్దరం కలిసి వుండగా చూసి వుంటాడా?" అన్నాడు శ్రీ ని వా స్ సాలోచనగా!

ప్రఫుల్ల అతని మాటలు వినిపించు కోకుండా చేతికున్న వాచీలో టైమ్ చూసుకుని, "వాసూ! మనం వెంటనే బైలుదేరి సి కిం ద్రా బా ద్ స్టేషన్‌కి చేరుకోవాలి" అంది కంగారుగా.

"ఏమిటంత అర్జెంట్?" అన్నాడతను ఏమీ అర్థంకాక.

"దారిలో చెబుతాను...పద" ఆమె మంచం మీద కూర్చునివున్న శ్రీనివాస్‌ని రెక్కపట్టి లేవదీసింది.

శ్రీనివాస్, ప్రఫుల్లలతో కారు మెయిన్ గేటులోంచి రయ్యిన దూసుకుపోతుంటే నౌకర్లు ఆశ్చర్యంగా గమనించారు.

'శైలజ విరక్తితో గోల్కొండ ఎక్స్‌ప్రెస్‌లో గుంటూరు వెళ్లిపోతోందన్న వార్త' ప్రఫుల్ల చెప్పాక కారును సంధించి విడిచిన బాణంలా రివ్వున పోనిచ్చాడు శ్రీనివాస్.

కారు స్టేషన్‌కి చేరగానే ప్రఫుల్ల ఎంట్రెన్స్ దగ్గిర దిగిపోయి, "నువ్వు పార్క్ చేసిరా! నేనీలోపు శైలజను కలుసుకుంటాను" అంటూ పరుగులాంటి నడకతో లోపలికి నడిచింది.

కారు పార్క్ చేసి, ప్లాట్‌ఫారమ్ టిక్కెట్లు తీసుకుని శ్రీనివాస్ లోపలికి వెళ్ళేటప్పటికి ప్రఫుల్ల, శైలజ, మరో యువతిఎంట్రెన్స్‌వైపు వస్తూ కనబడ్డారు.

ప్రఫుల్ల సూట్‌కేస్ పట్టుకుని శైలజతో మాట్లాడుతూ వస్తోంది.

ఆమె శ్రీనివాస్‌ని చూసింది. శైలజ పెట్టెకోసం చేయిచాచి అడుగుతుంటే అందకుండా వెనక్కి పెట్టుకుంటూ, చూపుడు వేలుతో శ్రీనివాస్‌ని చూపిం దామెకు.

శైలజ అతనికేసి చూసింది! శ్రీనివాస్ ఆమెను తదేకంగా చూస్తూ అలాగే ఆగి పోయాడు.

"లవ్ ఈజ్ లైక్ ఎ ఫొటో నెగెటివ్ విచ్ నీడ్స్ డార్క్‌నెస్ టు డెవలప్" అనే ఆంగ్ల సూక్తి గుర్తొచ్చిందామెకి.

కాని, ప్రేమకు చీకటి లేదు !

అది ఆకర్షణ, మోహం, అలాంటి మరో భావమో కాకుంటే-

అపార్థాలూ, కలతలూ, దూరాలూ, తారతమ్యాలూ లాంటి అడ్డంకులేవీ-

ప్రేమికుల్ని విడదీయలేవు!

వారి కలయికను ఆపలేవు!

నిజం...నిజం...!

'నో డార్క్‌నెస్ ఫర్ లవ్!' ★

# చతుర క్షతలు

## వ్యాపారం!

''హలో...''

"నేను...భూషణాన్ని మాట్లాడుతున్నాను. కేశవరావేనా?"

"అవును...బాగున్నారా సార్?"

"ఆఁ... నీ వ్యాపారం ఎలా సాగుతోంది"

"మామూలే సార్!"

"స్టాక్ ఏమాత్రం వుందేమిటి?"

"మీకేం కావాలి సార్?"

"పద్మావతి వుందా?"

"వుంది"

"దాన్ని వదిలెయ్. ఇంకా?"

"విజయశ్రీ కావాలా?"

''రేటెంత?''

''తొంభై''

''మహాలక్ష్మి''

''ఎనభై అయిదు''

"గీతాంజలి?"

"ఇపుడు దొరకదు సార్! రెండు రోజుల తర్వాత వీలవుతుంది"

"నీ దగ్గిర వున్నవాటిల్లో ఏది బాగుంటుందో చెప్పు!"

"నందిని...రేటు నూట ఎనభై"

"క్రితం నెలలో పంపింది దాన్నే కదూ! నేను దాన్నో ఫ్రెండ్‌కు పంపితే తనకు నచ్చలేదని తిప్పి పంపేశాడు"

"ఎందుకు నచ్చలేదో మరి! అయితే విజయశ్రీని పంపేదా?"

"రేటెంత?"

"చెప్పానుగా....తొంభై"

"నిన్నటి పేపర్ చూడలేదా? దాని మార్కెట్ డౌన్ అవుతోంది"

"సరే!సరే! నేను దాన్ని మార్కెట్ రేటు ప్రకారమే ఇస్తాను"



"అలా అన్నావు బావుంది. నేను మావాళ్ళని కూడా వాళ్ళకెంత కావాలో కనుక్కుని వాళ్ళకి విజయశ్రీ ఎరువులే కావాలో మరోరకమో తెలుసుకుని ఫోన్ చేస్తాను....సరేనా!"

"మంచిది సార్! వుంటాను"

"సరే!"

—జాకీ

# పేషెంట్

యమలోకం హడావిడిగా వుంది.

పాపులను శిక్షించే యమధర్మరాజుకు అనుకోకుండా పెద్ద జబ్బు చేసింది.

రాజవైద్యులకు జబ్బు లొంగలేదు.

చిత్రగుప్తుణ్ని సలహా అడిగాడు యముడు.

"భూలోకంలో పెద్ద పెద్ద డాక్టర్లుంటారు మహాప్రభూ! మీరు వారికి చూపించుకుంటే ఫలితముండొచ్చు" అన్నాడు చిత్రగుప్తుడు.



ఈ పరిస్థితిలో యముణ్ని కదిలించటం మంచిది కాదని హెచ్చరించారు రాజవైద్యులు.

భూలోకంలోని వైద్యుల ఘనకీర్తి గురించి విన్న యముడికి భయం పట్టుకొంది. ఆ సమయంలో చిత్రగుప్తుడో ఉపాయం చెప్పడాయనకి. యముడు ఆనందంగా యమభటుల్ని పిల్చి—

"భూలోకంలో అతితక్కువ మందిని చంపిన వైద్యుణ్ని తీసుకురండి" అని చెప్పాడు.

"చిత్తం ప్రభూ! కానీ తక్కువ మందిని చంపిన వైద్యుణ్ని గుర్తించడం ఎలా?" ధర్మసందేహం వెలిబుచ్చారు భటులు.

"ఎవరి ఇంటి ముందయితే అతి తక్కువ ప్రేతాత్మలు తిరుగుతుంటాయో ఆ వైద్యుణ్ని పట్టుకురండి!"

"చిత్తం ప్రభూ" అంటూ బయల్దేరారు యమభటులు. వెతగ్గా వెతగ్గా ఓ డాక్టర్ ఇంటి ముందు ఒక్కటే ప్రేతాత్మ ఏడుస్తూ కనిపించింది. భటులు ఆనందంగా ఆ డాక్టర్ని తీసుకొచ్చి యముడి ముందు హాజరుపరిచారు.




డాక్టర్‌కి సకల మర్యాదలూ చేశాక "మీకున్న అనుభవం మూలంగా మీరు విజయాన్ని సాధించారనుకొంటాను. ఎన్నాళ్ళబట్టి మీరు డాక్టర్‌గా పని చేస్తున్నారు?" అని అడిగాడు యముడు.

"ఈరోజుదయాన్నే నా క్లినిక్ ప్రారంభించాను. మీరే నా రెండో "పేషెంట్"" నెమ్మదిగా చెప్పాడు డాక్టర్.

యమధర్మరాజు తెలివితప్పి పడిపోయాడు.

—కె. హరిబాబు

## FORM IV [See Rule 8]

Statement about ownership and other particulars of CHATURA

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |
| 2. | Periodicity of its Publication | : Monthly |
| 3. | Printer's Name | : RAMOJI RAO |
| | Whether citizen of India? | : Yes |
| | If Foreigner, state the country of origin | : ——— |
| | Address | : 6-3-570, Eenadu Compound Somajiguda, Hyderabad-500 004. |
| 4. | Publisher's Name | : RAMOJI RAO |
| | Whether citizen of India? | : Yes |
| | If foreigner, state the country of origin | : ——— |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |
| 5. | Editor's Name | : RAMOJI RAO |
| | Whether citizen of India? | : Yes |
| | If foreigner, state the country of origin | : ——— |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |
| 6. | Names and addresses of Individuals who own the news paper and partners or share holders holding more than one percent of the total capital. | : VASUNDHARAPUBLICATIONS 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

for VASUNDHARA PUBLICATIONS.

Date : Sd/- RAMOJI RAO

March 1, 1985. Publisher.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/HD /40